# చతుర

అక్టోబరు 2009

రూ.10/-








# కేన్సర్ – CANCER-ల్యుకేమియా BLOOD CANCER వారికి శుభవార్త

* మెదడు * నోరు * థైరాయిడ్ గ్రంథి * స్తనములు * ఊపిరితిత్తులు * అన్నవాహిక * జీర్ణాశయము * పసరుతిత్తి * కాలేయము * పాన్క్రియాసిస్ * మూత్రపిండములు * ప్రొస్టేటు గ్రంథి * మూత్రకోశము * జీర్ణకోశము * ప్రేగులు * గర్భాశయ కంఠము (సెర్విక్స్) * గర్భాశయము * అండములు * పురుషాంగము * వృషణములు * న్యూరోబ్లాస్టోమా * కండరములు * ఎముకలు * చర్మము * లింఫ్ గ్రంథులు * ఎక్యూట్ లింఫోబ్లాస్టిక్ ల్యుకేమియా * ఎక్యూట్ మైలాయిడ్ ల్యుకేమియా * క్రానిక్ లింఫోసైటిక్ ల్యుకేమియా * క్రానిక్ మైలాయిడ్ ల్యుకేమియా ఎంతో మంది క్యాన్సర్, ల్యుకేమియా వ్యాధిగ్రస్తులను బాగుచేస్తున్నటువంటి ఆంధ్రప్రదేశ్‌లోని ప్రప్రథమ కేరళ ఆయుర్వేద వైద్యశాల. రేడియేషన్ థెరపి. కీమోథెరపి. హార్మోన్ థెరపి. బయోలాజికల్ థెరపి. మరియు ఇతర వైద్య పద్ధతులను తీసుకుంటున్న వారు కూడా మా ఆయుర్వేద మందులు వాడవచ్చును.

## షుగరు (DIABETES MELLITUS) అతిమూత్రము (DIABETES INSIPIDUS) వ్యాధి బాధితులకు శుభవార్త

35 సం॥రాల సుదీర్ఘకాల పరిశోధనా ఫలితం! అన్ని వయసుల వారికి ఎన్ని సంవత్సరముల నుండి షుగర్ వ్యాధి ఉన్నా (TYPE-II DIABETES. NON INSULIN DEPENDENT DIABETES MELLITUS. (NIDDM) 30 రోజులలో నియంత్రణలోకి వస్తుంది. (TYPE-1 DIABETES INSULIN DEPENDENT DIABETES MELLITUS (IDDM) 60 రోజులలో నియంత్రణలోకి వస్తుంది. కోర్సు అయిన తరువాత ఆహార నియమాలు యోగ, నడక, శరీర, వ్యాయామాలు లేకుండా పంచదార, బెల్లం, తేనె, ఖర్జూరము లాంటివి తీసుకుంటూ వ్యాధిని తగ్గించుట ఈ మందు యొక్క ప్రత్యేకత. షుగర్ పేషెంట్లకు మానని పుళ్లు, గాయములు, గాంగ్రీన్ లాంటివి 30 రోజులలో మాన్పించవచ్చును. (PER MONTH Rs. 2000/-) TYPE-II COURSE 3 MONTHS. TYPE-1 COURSE 6 MONTHS

## త్రాగుడు మానండి! మాన్పించండి!! STOP ALCOHOL!!

మీరు అనుకోకుండా బానిసలుగా మారిన త్రాగుడును ఆల్కహాల్‌ను (Alcohol), గంజాయి (Bang), నల్లమందు (Opium) (Morphine), బీడి. సిగరెట్. గుట్కా. కల్లు. సారాయి. మైకం పొగ (Cannabis), (Heroin) మొదలగు మత్తుమందులు (Tobacco-Pipe) పొగాకు పొగ పీల్చుట మా ఆయుర్వేద మందు ద్వారా మానవచ్చును. లేదా వ్యసనపరుడైన వ్యక్తిని తీసుకురాకుండా మరియు అతనికి తెలియకుండా మాన్పించవచ్చును (Per Month Rs. 1200/-) Course : 2 Months

## బట్టతల!! Baldness! నెరసిన జుట్టు!! Grey Hair!

చుండ్రు, జుట్టురాలుట, పేను కొరుకుడు, జలుబు, కళ్ళ మంటలు, దీర్ఘకాల తలపోటు, మాడు పోటు, పార్శ్వపు నొప్పి, మెదడును చల్లబరుచుట, సుఖనిద్రను కలిగించి జ్ఞాపకశక్తిని వృద్ధిపరిచి తలలోని పేలను వదలగొట్టి, జుట్టును నల్లగా పొత్తుగా, పొడవుగా పెంచి బట్టతల నెరసిన జుట్టును శాశ్వతంగా నివారించును. Kerala Herbal Hair Tonic (Oil) 100 ml. Rs. 400/-, 250 ml Rs. 900/-, Kerala Herbal Shampoo - 100 ml. Rs. 50/-; 250 ml Rs. 120/-; Herbal Hair Capsules 60 - Rs. 300/- (Per Month Rs. 750) Course: 6 Months.

## సంతానం లేని (Infertillity-Sterillity) దంపతులకు శుభవార్త!!

సంతానోత్పత్తి కణాలు తక్కువగా వున్న మగవారికి కణాలలో కదలిక లేని వారికి కణాలు పూర్తిగా లేనివారికి (Azoosperimia) వెరికోసిల్‌వీన్స్ (Varicoseviens) (Per month Rs. 3000/-) Course : 3 months, స్త్రీలకు అండాశయముల నుండి అండములు విడుదలకాకపోవుట, అండవాహికలు మూసుకొనిపోవుట (Fallopian Tubes Block), గర్భాశయ పొరలకు వ్యాధి సోకినా, ప్రొలాక్టిన్ హార్మోన్ ఎక్కువ శాతములో ఉన్నా, లోపలి ద్రవాల్లో ఆమ్లగుణము (Acid) ఎక్కువగా వున్నా, ఎండోమెట్రియాసిస్, అండములు చాలా చిన్నవిగా వున్నా రసాయన వాజీకరణ పద్ధతుల ద్వారా ప్రత్యేక చికిత్స చేయబడును (Per Month Rs. 3000/-) Course : 3 months

## ఉబ్బసం (Asthma) ఎలర్జీ (Allergy) వ్యాధులకు ప్రత్యేక చికిత్స!!

జలుబు, దగ్గు, ఆయాసం, తుమ్ములు, పిల్లికూతలు, కళ్ళు, ముక్కు నుండి నీరు కారుట, ఊపిరి ఆడకపోవడము, సైనసైటిస్ (Sinusitis) ఇస్నోఫీలియా (Eosinophilia) దుమ్ము, ధూళి, ఏసి, ఏస్‌వాటర్, మంచు చల్లగాలుల వల్ల కలుగు ఎలర్జీ వ్యాధులకు Asthma Sanjivini 200 ml Rs. 300/- (Per month Rs. 600/-) Course: 9 months.

❖ **మాతిన యవ్వన శక్తికి, శీఘ్రస్ఖలనము, హస్తప్రయోగము** (Masturbation): నపుంసకత్వము (impotency) అంగస్తంభన సరిగా లేకపోవుట, లైంగిక వాంఛ లేకపోవుట (Libido), రతి మధ్యలో అంగము మెత్తబడి చిన్నగా ముడుచుకొనిపోవుట, వృషణములు శుష్కించి పోవుట (Atrophy of Tests), ప్రోస్టేటు గ్రంధి వాపు (Enlarge Prostate) per month Rs. 2000/- Course: 3 months ❖ **సుఖ వ్యాధులు** (Venereal Diseases): వ్రణములు, పుండ్లు, సవాయి, కొరుకుడు గనేరియా సిఫిలిస్, గ్రీట్, షాంక్రాయిడ్ (per month Rs. 1000/-) Course: 3 Months ❖ హెర్పిస్ సింప్లెక్స్ (Herpes Simplex) హెర్పిస్ జోష్టర్ (Herpes Zoster) (Per month Rs. 2000/-) Course : 3 months ❖ **స్తనముల పెరుగుదల**: జారిన (వాలిన) స్తనములను చిన్నగా, మెత్తగా వున్న స్తనములను సైజును పెంచి, గట్టిగా, గుండ్రముగా చేసి స్త్రీలను అందముగా కనబడునట్లు చేయును, స్తనముల సైజును తగ్గించుటకు (Decrease) (Per month Rs. 750/-)Course: 3 months ❖ **స్త్రీలకు పొత్తికడుపు మీద గారిన గీతలు, చారలు పోవుటకు** (Screch Marks): (Per month Rs. 1000/-) Course : 3 months ❖ **మలబద్ధకము** (Constipation) (Per month Rs. 3,00/-) Course : 1 month. **గ్యాస్ట్రబుల్, ఎసిడిటీ, అల్సర్, అజీర్ణము** (Dispepsia), ఆకలి లేకపోవుట, కడుపులో నొప్పి, మంట (Gastritis) జీర్ణాశయములో ఆసిడ్ ఎక్కువై ఛాతిలో మంట (Acidity), జీర్ణాశయములో పుండు (Peptic Ulcer) అంత్రమూలములో పుండు (Duodenal Ulcer) (Per month Rs. 750/-) Course : 3 months. ❖ **రక్తమొలలు, అర్శమొలలు** (Piles) Haemoroids, ఆసనములో చీలిక పుండ్లు, (Fissers) (ఆపరేషన్ లేకుండా) (Per month Rs. 750/-) Course : 3 months ❖ **పులిపిర్లు** (Warts) ఆనెలు (Corns) Rs. 300/- ❖ **సోరియాసిస్** (Psoriasis) (Per month Rs. 2000/-) Course : 3 months: బొల్లి (Leucoderma), (Per month Rs.2000/-) Course : 3 months ❖ **స్థూలకాయము** (Obesity) : **అధిక బరువును, లావును తగ్గించుటకు** (No Diet, No Exercise) (Per month Rs. 2000/-) Course: 3 months ❖ **పిల్లలు బలహీనముగా మందు వాడు బరువు పెరిగి, లావుకావటానికి, ఎత్తు పెరుగుటకు, (21 సం॥లోపు వారు)** (Per month Rs. 2000/-) Course: 3 months ❖ **కీళ్ళు కండరాల నొప్పులకు**: (Rheumatis arthritis) నరముల వాపు (Neurities) (Backache), **నడుము నొప్పి** (Lumbago), **మెడనొప్పి, వెన్నునొప్పి** (Spinalcord), **తుంటినొప్పి, సయాటిక ఆపరేషన్ లేకుండా** (Per month Rs. 750/-) Course : 3 months ❖ **పక్షవాతము** (Paralysis) (Per month Rs. 5000/-) Course : 3 months, ❖ **మూర్ఛ, అపస్మారకము** (Fits) (Epliepsy) పిచ్చి ఉన్మాదము (Mania) హిస్టీరియా (Hysteria) జ్ఞాపకశక్తి తగ్గిపోవుట (Loss of Memory) నిద్రపట్టకపోవుట (Insomnia), (Per month Rs.2000/-) Course : 3 months ❖ **చెవిపోటు** (Ear ache) : **చెవి నుండి చీముకారుట, చెవుడు, చెవిలో హోరు శబ్దము ఆపరేషన్‌లేకుండా**, (Per month Rs. 750/-) Course : 3 months. ❖ **నత్తిని తగ్గించుటకు** (Stammering) : (Per month Rs. 1500/-) Course : 3 months ❖ **స్త్రీల శరీరంపై వచ్చు అవాంఛిత రోమములు తిరిగి మొలవకుండా చేయుటకు** : (Per month Rs. 3,000/-) Course : 1 month

**అన్ని రకముల దీర్ఘకాల వ్యాధులకు సంప్రదించండి. మాకు మరెక్కడా బ్రాంచీలు లేవు.**

**HIV/ AIDS, FITS, PSORIASIS, OBESITY, PARALYSIS, HEPATITIS, HERPES.**




# కేరళ ఆయుర్వేద వైద్యశాల

ఓడియన్ 70 ఎంఎం థియేటర్ ఎదురుగా, రెమాండ్స్ & Fantoosh Showroom ప్రక్కన, రూపాని టెక్స్‌టైల్స్‌పైన,
చిక్కడపల్లి మెయిన్‌రోడ్, హైదరాబాద్ - 20. ఫోన్: 65526109, 9866155109, 9392355590

Note: పోస్ట్ ద్వారా కూడా చికిత్స కలదు. ఉత్తరాల ద్వారా మీ సమస్యలను తెలియచేసి, మీ దగ్గర ఉన్న రిపోర్టు పంపి ఫోన్ ద్వారా సంప్రదించి చికిత్స పొందవచ్చును. మందు ఖరీదు మరియు పోస్టల్ చార్జీ రూ. 80/- కలిపి మనియార్డర్ లేదా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా మీ ఫోన్ నెంబరుతో సహ పంపించండి. ఫోన్ ద్వారా సంప్రదించు వారు 10 A.M. - 2 P.M. & 5 P.M. - 8 P.M.



# కాప్షన్ మీదే - 10



ఈనాడు కార్టూనిస్ట్, ప్రముఖ చిత్రకారుడు శ్రీధర్ వేసిన పై కార్టూన్‌కు
నవ్వొచ్చే కాప్షన్ రాయండి. చక్కని బహుమతి అందుకోండి!
బాగున్న మరో నాలుగు ఎంపిక చేసి పంపినవారి పేర్లను ప్రచురిస్తాం.

మీ కాప్షన్లు అందాల్సిన చివరి తేదీ ఈ నెల 19

చిరునామా: సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 082
e-mail : chatura@eenadu.net

ఉత్తమ వ్యాఖ్య :

ఎడ్డె మంటే తెడ్డెమంటావా,
ఆవిడతో వేగగలుగుతున్నాను గానీ
నీతో వేగలేనురా బాబూ

–శ్రీ పెరంబుదూరు నారాయణరావు,
గాయత్రీనగర్, హైదరాబాద్





## కాప్షన్ మీదే -9

బాగున్న మరికొన్ని కాప్షన్లు:

నేను నాభార్య కోసం చూస్తే
మనసు ప్రియురాలి కోసం చూస్తోంది
– ఎస్.కె.సూర్యబేగం,
ఒంగోలు, ప్రకాశం జిల్లా

ఏమి..జీవితమో?..
మనసూ, తనువూ.. నెగెటివ్ థింకింగ్‌లే
నీడ సైతం.. వ్యతిరేక దిశలోనే..
– ఎమ్. స్నేహ,
కరంజి(టి) ఆదిలాబాద్ జిల్లా

వెంటాడే నీడా
వదిలి పోయింది నీ పీడ
– అన్వేష్, హైదరాబాద్

నా దొక దారి
నా నీడదొక దారి
నా బతుకు మాత్రం గోదారి
– కె.ఉమామహేశ్వరరావు,
బంజారాహిల్స్, హైదరాబాద్

సంపుటి -32
సంచిక - 09
అక్టోబరు 2009
381వ సంచిక

# చతుర


కాప్షన్ మీదే - 10 — 3

టాంక్‌బండ్ కథలు-23

**తేనె ప్రవాహం** — 6

**మనసున ఉన్నదీ...** — 32

**ప్రవేశిక విజేతలు** — 77

**కాలాతీతం**

ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయ వేదికలో ఎలిజబెత్ గాస్కెల్ నవల

**మేరీ బార్టన్** — 90

చతురకతలు — 96

**మా నాన్న.. నేనూ...**

ఆర్. శాంతసుందరి — 104

**టీ, కాఫీలు అస్సలు తాగను**

నటి అసిన్ ఆరోగ్య రహస్యాలు — 110

జ్ఞాన పీఠాలు - 9

**రాంధారీ సింహ్ దినకర్** — 112

యర్రంశెట్టి శాయి అపార్ట్‌మెంటాలజీ

**'లై' డిటెక్టర్** — 114

కథ వెనుక కథ

**పంచమం** — 126

**ప్రవేశిక** — 130

**నిన్నటి నిజం**


సేకరణ : రామశేషశాస్త్రి

ముఖచిత్రం : అసిన్

ముఖపత్రాలంకరణ : రాజు యాట



**'మీ మనవలు పులినో సింహాన్నో చూపించమంటే?'**

'జూకు తీసుకెళ్తాను'

**'అమ్మకు జ్వరం వస్తే..?'**

'డాక్టరు దగ్గరికి తీసుకెళ్తాను'

**'మీ ఆవిడకు చీర కావాలంటే..?'**

'గుండె దడ, ఆయాసం అని ఇంట్లోనే పడుకుంటా'

**'ఏడిచావులే.. సరిగ్గా చెప్పు?'**

'లేకపోతే ఏవిటా భేతాళ ప్రశ్నలు?' అన్నాడు క్రిష్ణ విసుగ్గా.

**'వెర్రి వెంగళప్పా! కొడుక్కు పెళ్లవ్వాలంటే నే చెప్పినట్లు చేయాలి' అన్నాడు మిత్రుడు సారథి.**

ఇంతకీ సారథి ఏం చెప్పాడు? వధూ అన్వేషణలో సంక్లిష్టతలను హాస్యంతో అక్షరబద్ధం చేసిన **పొత్తూరి విజయలక్ష్మి** నవల

**ఆనందమానందమాయె!**

10 వ పేజీలో

బొమ్మలు : రాజు

# ఈనాడు కథల పోటీ

**మీ అభిమాన దినపత్రిక 'ఈనాడు' కథల పోటీని నిర్వహిస్తోంది.**
రచయితలకూ రచయిత్రులకూ ఇదే ఆహ్వానం

**ప్రథమ బహుమతి**
**రూ. 10,000**
**ద్వితీయ బహుమతి(2)**
**రూ. 5,000**
**తృతీయ బహుమతి(2)**
**రూ. 2,500**

రూ. **25,000** విలువైన బహుమతులు

కథలు కేవలం సమస్యల్ని ఏకరువు పెట్టేవిగాకాక మానవ జీవితంలోని ప్రేమానుబంధాలకు అద్దంపట్టేలా ఉండాలి. అందమైన అనుభవాలనూ మధురమైన అనుభూతుల్నీ గిలిగింతలుపెట్టే హాస్యాన్నీ పాఠకులకు పంచుతూ వారి హృదయాలను మీటగలగాలి. యువతను ఆకట్టుకునే ఇతివృత్తాలకూ వారి జీవితాలను చుట్టుకుని ఆహ్లాదంగా సాగే చిలిపి, స్ఫూర్తిదాయక, ప్రేమకథలకూ ప్రాధాన్యం.

**నిబంధనలు:**

- కథ ఫుల్‌స్కేప్ సైజులో 7 పేజీలకు మించకుండా ఉండాలి. పేజీకి కాస్త అటూ ఇటుగా 25 లైన్లు ఉండాలి. కాగితానికి ఒకవైపే రాయాలి.
- కథల రాతప్రతుల్లో ఎక్కడా రచయిత/రచయిత్రి పేరుకానీ, చిరునామా కానీ రాయకూడదు. విడిగా మరో కాగితం మీద కథపేరు, రచయిత/రచయిత్రి పేరు, పూర్తి చిరునామా, కథ సొంతమే తప్ప అనువాదం/అనుసరణ/కాపీ కాదనీ అముద్రితమనీ హామీపత్రం రాసి కథకు జతపరచాలి. ఆ కథను మరేపత్రిక పరిశీలనార్థం పంపి ఉండకూడదు.
- ఎంపికైన కథలు ఈనాడు ఆదివారం అనుబంధంలో ప్రచురితమవుతాయి. బహుమతి పొందని కథలను సాధారణ ప్రచురణకు స్వీకరించే అధికారం పోటీ నిర్వాహకులకు ఉంటుంది.
- ఎంపిక కాని కథలను తిప్పి పంపడం సాధ్యపడదు.
- ఉత్తమ కథల ఎంపిక, బహుమతుల నిర్ణయంలో న్యాయనిర్ణేతలు, నిర్వాహకులదే తుది నిర్ణయం.

కథలు మాకు చేరాల్సిన ఆఖరు తేదీ
**10 అక్టోబరు 2009**

చిరునామా
**కథల పోటీ**
**ఆదివారం అనుబంధం**
**ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ**
**హైదరాబాద్-82.**

# తేనె ప్రవాహం

వద్దనే అనుకుంటాను.. చేయవద్దనే అనుకుంటాను.. ఉదయం ఎనిమిదయ్యేస రికి అసంకల్పితంగా సెల్ చేతిలోకి తీసు కుంటాను.. బొటనవ్రేలు ఆ నెంబరును నొక్కేస్తుంది. ఆ తర్వాత కనీసం అరగంట పాటు ఏవేవో కబుర్లు, ముచ్చట్లు.. మాట లప్రవాహాలు! ఆసరికే మా శ్రీమతి ఒకటి రెండుసార్లు వచ్చి ఎర్రగా చూసెళ్తుంది.. కాలేజీ బస్‌టైమవుతున్నా తనను ఎక్కించ డానికి బయలుదేరడంలేదని నా కూతురు తలకొట్టుకుంటుంది. 'డాడీ నేను ఆటోలో వెళ్లిపోతాన్లే' అని తను కోపంగా బయటకు నడిచేంతవరకూ మా సంభా షణ సాగుతూనే ఉంటుంది.




ఇంతకీ ఆవతల ఎవరు? అదేకదా మీ డౌటు? ఆవిడె వరో నాకూ తెలీదండీ బాబూ! నమ్మడంలేదు కదూ? కథ మొత్తం చెబితే మీరే నమ్ము తార్లెండి.. సుమారు ఏడాది క్రితం అంటే గత దీపావళి నాడను కుంటా.. నా సెల్‌కో మిస్డ్‌కాల్ వచ్చింది. ఆ తర్వాతెప్పుడో అది చూసుకుని తెలిసిన వాళ్లేమోనని రింగ్‌చేశాను.

అవతలినుంచి 'హలో' అనే కోమల కంఠం. ఆ స్వరం నాచెవికి సంగీతంలా తోచింది. ఆ మైకంలో పడిపోయిన నాకు మాటలే కరవయ్యాయి.

'హలో ఎవరండీ.. ఫోన్‌చేసి మాట్లా డరేం?' రెట్టించిందా కోయిల.

స్పృహలోకి వచ్చిన నేను తడబడుతూ- 'ఎ..ఎవరండీ మీరు? నాపేరు ప..పరమే శ్వర్.. అమర్త్య యాడ్‌ఏజెన్సీలో ఆర్టిస్టుని. పొద్దున మీ నెంబర్ నుంచి మిస్డ్‌కాల్ వస్తేనూ..'

'మీరు చేశారు. అంతేనా? ఏదోసాకుతో అమ్మాయిల్ని వేధించే నీలాంటి రోగ్స్‌కి ఎప్పటికి బుద్ధొస్తుందో?' అంటూ కసిగా ఫోన్ కట్‌చేసిందామె.

గమ్మత్తేమంటే- ఆమె అంత సీరియస్‌గా మాట్లాడినా ఆ స్వరమహత్యం ఏమోగానీ నాకు పిసరంతైనా కోపం రాలేదు. ఇంకాం చెంసేపు తిడ్తే బావుణ్ను అన్పించింది.

గంటతర్వాత కాబోలు మళ్లీ నా సెల్‌మోగింది. పనిలో ఉన్న నేను విసుగ్గా 'ఎవరు?' అన్నాను.

'సారీ' అందో కోమల కంఠం.

నాకేం అర్థంకాలేదు..

'సారీ! పరమేశ్వర్‌గారూ గంటక్రితం మిమ్మల్ని అనవసరంగా తిట్టేను. కాల్‌రిజిస్టర్‌లో చెక్‌చేస్తే నా సెల్ నుంచి మీ సెల్‌కు కాల్ వెళ్లినట్టే ఉంది. పొద్దున మా అక్కకూతురు నా ఫోన్‌తో ఆడింది. అప్పుడు మీకు పొరపాట్న మిస్డ్ కాల్ వెళ్లినట్టుంది. అనవసరంగా తిట్టేను.. ఎగైన్ సారీ' అందామె.

అప్పటికే ఆమె మాటల తేనెప్రవా హంలో మరోసారి కొట్టుకుపోతున్న నేను 'ఒకే, ఇట్సాల్‌రైట్' అన్నాను.

'మీరు నిజంగా క్షమించినట్టేనా?' రెట్టించిందామె.

'హండ్రెడ్ పర్సెంట్' అన్నాను.




'థాంక్‌గాడ్.. ఓ జంటిల్మన్‌ను హర్ట్‌చేశా నని ఇందాకట్నించీ తెగ బాధపడుతు న్నాను. ఓకే.. బబై' అందామె.

'మేడమ్ అన్యథా భావించనంటే మీ గొంతు చాలా బాగుంది.. నిజం చెప్పా లంటే తేనెప్రవాహంలా ఉంది. ఇందాక మీరు తిట్టినప్పుడు కూడా నాకు పెద్దగా బాధ అన్పించలేదంటే నమ్మండి' అన్నాను కొంచెం ధైర్యంచేసి.

'రియల్లీ?.. అయితే రోజూ ఉదయాన్నే లేచి ఓ పావుగంటసేపు తిట్టేయనా?' అందామె నవ్వుతూ.

'అంతకన్నా మహద్భాగ్యం ఏముంది' అన్నాను నేనూ నవ్వి.

మర్నాడు ఉదయం ఎనిమిది గంటలకు వచ్చిన ఫోన్‌కాల్‌కు ఆశ్చర్యంతో ఉక్కిరిబి క్కిరయ్యాను. ఎందుకంటే కోయిలనుంచే ఆ కాల్!

'హలో పరమేశ్వర్‌గారూ గుడ్మార్నింగ్! ఎలా ఉన్నారు?'

'వెరీ ఫైన్! మరోసారి మీ గొంతు విన్నాను కనుక వెరీవెరీ ఫైన్! మీ అంతట

మీరే ఫోన్‌చేశారు గనుక దిసీజ్ వెరీవెరీ గుడ్మార్నింగ్' అన్నాను పరవశంగా.

'పరమేశ్వర్‌గారూ కొంపతీసి మీరు కవులుకాదు గదా!' పడిపడి నవ్విందామె.

ఆమె నవ్వుకు ఫ్లాట్ అయిపోయాను. అలా మొదలైంది మా మాటల పర్వం. ప్రతిరోజూ కచ్చితంగా అదేసమయానికి తనో నేనో ఫోన్ చేయడం మాట్లాడడం అలవాటుగా మారింది. మాటల్లో తనపేరు వసుంధర అని, ఐసిఐసిఐలో పనిచేస్తున్నాననీ అంది. అడ్రసు అడిగితే 'ఆ ఒక్కటి అడక్కు' అంది.

'నా కులం, గోత్రం, అడ్రసు ఇవన్నీ నీకెందుకు? నా గొంతు నచ్చిందన్నావు.. సరదాగా మాట్లాడుకుందాం.. అంతే! నన్ను చూడాలని.. కలవాలనీ ప్రయత్నించకు. ఒకవేళ కాదని నువ్వు సిటీలోని ఐసిఐసిఐ బ్రాంచీలన్నింటినీ సర్వేచేసినా.. ఫోన్ నెంబరు ఆధారంగా కూపీలాగాలని ప్రయత్నించినా ఇక నా నుంచి నీకు ఫోన్ రాదు. అంతేకాదు.. ఈ ఫోన్ కూడా మార్చేస్తాను. నువ్వు మంచివాడివి.. పరిస్థితి అందాకా రానీవనే నా నమ్మకం' అని మొదట్లోనే హెచ్చరించింది.

అయినా ఓ రాయేసి చూద్దామని తెలివిగా 'నేను సిటీనుంచి వెళ్లిపోతున్నాను.. ఢిల్లీ బదిలీ అయింది.. చివరిసారిగా ఒక్కసారి కలుద్దామా? ' అన్నాను ఓసారి.

'నీ ఆఫీసెక్కడో.. ఇల్లెక్కడో అన్నీ నాకు తెలుసురా బాబూ! అబద్ధాలాడి నాకు నీపట్ల ఉన్న గౌరవాన్ని తగ్గించుకోకేం? ' మందలించింది సుతిమెత్తగా.

అప్పటినుంచీ నేనూ అలాంటి ప్రయత్నాలు చేయలేదు. కానీ ఆ తర్వాత ఎక్కడ ఐసిఐసిఐ బ్యాంకు కనబడ్డా.. చివరికి దాని యాడ్ కన్పించినా ఆరాధనగా చూడడం మొదలెట్టాను.. వసుంధర పేరుగలవాళ్లు తారసపడితే ఏదో చెప్పలేని గౌరవాభిమానాలు కలిగేవి. ఇంట్లోవాళ్లు మా ఇద్దరి స్నేహాన్ని తప్పుపట్టరుగానీ వారికి అవసరమైన వేళల్లో నేను ఫోన్ ఇవ్వకపోవడం చూసి చిరాకుపడేవాళ్లు. లేదంటే వాళ్లకు నాతో పనిపడ్డప్పుడు నేను ఫోన్‌పట్టుకు కూర్చోవడం కోపం తెప్పించేది. ఇది గ్రహించి ప్రతిరాత్రీ పడుకునేముందు 'రేపు వసుంధరకు ఫోన్‌చేయనుగాక చేయను' అనుకుంటా. కానీ ఉదయం ఎనిమిదయ్యేసరికి మనసు ఆగడంలేదు. అయినా ఏమైనా సరే ఇవ్వాళ చేయనుగాక చేయను అని పట్టుదలగా కూర్చున్నా ఈరోజు!

మాటకచేరీ మనిద్దరికీ వ్యసనంగా మారిందని తనూ ఒకటి రెండుసార్లు అనడం నాకు గుర్తువచ్చింది.

అప్పుడే ఫోన్‌మోగింది. ఇంకెవరు? వసుంధరే! 'నీకో గుడ్‌న్యూస్' అంది.

'ఏంటో అది? ' అన్నాను ఆసక్తిగా.

'సాయంత్రం మనం కలుస్తున్నాం'

నా చెవుల్ని నేనే నమ్మలేకపోయాను.

'నిజమా? '

'నిజం.. సాయంత్రం ఆరింటికి ట్యాంక్‌బండ్‌కి రా. మర్చిపోవద్దు'

'మర్చిపోవడమా పాడా? అసలు ఇప్పుడే వెళ్లి అక్కడ కూర్చుంటా' అన్నాను.

నవ్వుతూ ఫోన్ కట్‌చేసింది.

సంతోషంతో నా మనసు ఎగిసిపడుతోంది. 'ఎన్నాళ్లకెన్నాళ్లకెన్నాళ్లకు' వేటూరి పాట హమ్‌చేశాను. ఆఫీసులో సరిగా పని కూడా చేయలేదు. సాయంత్రం నాలుగింటికే ట్యాంక్‌బండ్‌కు చేరాను. తను సికింద్రాబాద్ నుంచి వస్తుందా? హైదరాబాద్ నుంచి వస్తుందా? ఆర్టీసీ క్రాస్‌రోడ్స్‌నుంచి వస్తుందా? వస్తే ఎంతసేపట్లో వస్తుంది? ఎలా ఉంటుంది? కంఠానికి తగిన అందమా? లేక కథల్లో ట్విస్ట్‌లా కురూపా? వికలాంగురాలా? పరిపరివిధాల నా ఆలోచనలు పోతున్నాయి.

అంతలో నా ఫోన్‌మోగింది.. చూస్తే వసుంధర నెంబరే.. హుషారుగా 'హాయ్ నేనొచ్చేశా.. నువ్వెక్కడ? ' అన్నాను.

'సారీ సర్.. మీరొక్కసారి గాంధీ ఆస్పత్రికి వస్తారా? ' ఎవరిదో మగగొంతు.

నాలో ఆందోళన! బీపీ కూడా పెరిగినట్టుంది.. 'మీరెవరు? వసూ ఎక్కడుంది? ఎందుకు ఆస్పత్రికి రమ్మంటున్నారు? తనకేమైంది? ' అరిచినట్టే అడిగాను.

'సోవర్రీ! ప్లీజ్ ముందు ఆస్పత్రికి వచ్చేయండి' అంటూ ఫోన్ కట్‌చేశారు.

బిత్తరపోయాను. నాకోసం వస్తుంటే వసూకేమైనా యాక్సిడెంట్.. ఆపైన ఆలోచించలేకపోయా.

పది నిముషాల్లో గాంధీ ఆస్పత్రికి చేరాను. అక్కడికి వెళ్లి రింగ్ ఇస్తే ఇందాక మాట్లాడిన అతనే ఫలానా వార్డుకు రమ్మన్నాడు. పరుగులాంటి నడకతో వెళ్లాను. డాక్టర్లు, రోగుల తాలూకు బంధువులు అక్కడ హడావిడిగా తిరుగుతున్నారు.

ఒకాయన నాదగ్గరకు వచ్చి 'పరమేశ్వర్? ' అన్నాడు.

తలూపాను. అదురుతున్న గుండెలతో 'వసుంధర? ' అస్పష్టంగా పలికాయి నా పెదాలు.

అతను మౌనంగా ఓ బెడ్‌దగ్గరకు తీసుకువెళ్లాడు. బక్కచిక్కిపోయిన ఓ ముప్పై ఏళ్ల యువతి నిస్త్రాణగా పడుకుని ఉంది. ఆక్సిజన్ ట్యూబ్ ముఖానికి పెట్టుంది.

ఆమెను చూపిస్తూ 'వసూ' అన్నాడతను మెల్లగా నాకు మాత్రమే వినబడేట్లు.

'ఏమిటి.. ఏమైంది? ఇక్కడెప్పుడు చేర్చారు? '

'మస్క్యులర్ డిస్ట్రోఫి.. అంటే కండరాల క్షీణత... మందులేని మహమ్మారి.. ఇక్కడ చేర్చి ఏడాది దాటపోయింది'

నా మనసుమొద్దుబారింది.

'మరి నాకు ఫోన్లు? ..'

'తనే చేసేది.. రోజూ మీతో మాట్లాడిన అరగంటలో రోజంతటికీ కావాల్సిన ఎనర్జీ సంపాదించేది. మళ్లీ రేపు ఉదయం ఎనిమిది ఎప్పుడవుతుందా అని ఎదురుచూసేది.. థాంక్స్ ఏ లాట్! ఏడాదిపాటు వసూను మీ మాటల్తో సంతోషపెట్టారు.. రేపటికోసం ఎదురుచూసేలా చేశారు' అతనికి కళ్లలో నీళ్లు తిరిగాయి.

'ఇంతకీ మీరు? '

'శ్రీరామ్. వసూ భర్తని, ఐసిఐసిఐలో ఆఫీసర్‌ను. ఇవ్వాళ ఉదయం వసూ జీవితం చివరిదశకు చేరిందని చెప్పారు డాక్టర్లు. అందుకే మిమ్మల్ని ఒక్కసారి చూడాలనుకుంది. ఆస్పత్రి అంటే అనుమానం వస్తుందని ట్యాంక్‌బండ్‌కు రమ్మంది. తర్వాత ఏదో చెప్పి ఇక్కడకి రప్పిద్దామని మా ప్లాన్..'

అంతలో వసూ మెల్లిగా కళ్లు తెరిచింది. ఆగలేకపోయాను. 'వసూ' అంటూ బెడ్‌ను సమీపించి ఆమె చేతిని నాచేతిలోకి తీసుకుని ప్రేమగా చుంబించాను.

ఎవరన్నట్లు చూసింది..

'పరమేశ్వర్‌ని.. నీ ఫ్రెండ్ పరమేశ్వర్‌ని..' ఏడుపు తన్నుకొస్తోంది.

వసూ పెదాలపై చిరునవ్వు.

'ప..ర..మే..శ్వ..ర్!' ఒక్కో అక్షరమే మెల్లగా పలికింది. ఆమెకళ్లలో సంతోషం తాలూకు వెలుగు స్పష్టంగా కన్పిస్తోంది.

'నీ తేనెప్రవాహం తనకు సెలవిమ్మని అడుగుతోంది. ఇస్తావా? ...' వాక్యం పూర్తి కానేలేదు.. ఆమె కళ్లు మూతపడ్డాయి. నా చేతిలోని ఆమె చెయ్యి అలాగే బిగుసుకుపోయింది.

మా నాన్న పోయినప్పుడు కూడా దుఃఖాన్ని నిగ్రహించుకున్న నేను ఒక్కపెట్టున గట్టిగా ఏడ్చేశాను. శ్రీరామ్ వసూనే చూస్తూ స్థాణువులా నిలబడిపోయాడు.

–చంద్రప్రతాప్

# ఆనందమానందమాయె!

కూతురికి పెళ్లి సంబంధం కుదిరేసరికి ఏడుచెప్పుల జతలు అరిగిపోయాయనే మాట- కొడుకు పెళ్లివిషయంలో క్రిష్ణ-శారదలకు అనుభవానికి వచ్చింది.. అదేంటి? అతనేమన్నా 'ఆ టైపా?' అనుకోకండి.. కుర్రాడు బహుబుద్ధిమంతుడు, రూపవంతుడు, ఉన్నత విద్యావంతుడు, ఉద్యోగవంతుడు. మరెందుకు అలా జరిగింది? అని బోల్డంత ఆశ్చర్యపోతున్నారా? అయితే మీరంతా పాతకాలంలో ఆలోచిస్తూ, ప్రస్తుతకాలాన్ని పట్టించుకోనివారికిందే లెక్క! మాకూ పెళ్లికి ఓ అబ్బాయి ఉన్నాడు ఇప్పుడెలా? అని దిగులు పడుతున్నారా? మరికనేం? మీరంతా తప్పకుండా చదివి తీరాల్సిన, తెలుసుకోవాల్సిన లోక 'కల్యాణ' కారక చరితమిది! 'కన్నవారికి' కన్నంత, 'చేసుకున్న'వారికి చేసుకున్నంత పుణ్యం గ్యారంటీగా దక్కుతుందనడంలో సందేహం లేదు.

సునిశిత హాస్య, వ్యంగ్యాలతో అక్షరాక్షరంలో గిలిగింతలు పెట్టే **పొత్తూరి విజయలక్ష్మి** **ఆనందమానందమాయె!** ఈనెల చతుర కానుక!



"శారదా! శారదా అంటూ పరిగెత్తుకుంటూ వంటింటివైపు వచ్చాడు క్రిష్ణ. గట్టు దగ్గర నుంచుని కూర వేయిస్తున్న శారద ఆ పని అలాగే వదిలేసి వెనక్కి తిరిగి పరిగెత్తుకొస్తున్న భర్తను పట్టుకొని ఆపేసింది.

ఆ పక్కనే ఉన్న పూజ గదిలో కూర్చుని పూజకు అన్నీ అమర్చుకుంటున్న బాలమ్మకు ఒళ్లుమండింది.

"పిదపకాలం పిదప బుద్ధులూనూ! ఇంత పచ్చికలి మా రోజుల్లో మేం ఎరుగం! ఇవతల పెద్దది, అత్తగారు చూస్తుందనే ఇద్దైనా లేకుండా పట్టపగలు భర్తని అమాంతం కావలించుకోవడం ఏమిటీ? హవ్వ! ఎవరైనా చూస్తే నవ్విపోతారు!" అంది చిరాగ్గా.

"చాల్లే ఊరుకోండి మీరొకరూ నా ప్రాణానికి! చీటికీ మాటికీ సన్నాయి నొక్కులు నొక్కుతూ దూరిపోతారు. నాకు కోడలొచ్చే వయసొచ్చినా నాకు అత్తపోరు తప్పడం లేదు" అని విసుక్కుంది శారద.

"నువ్వు ఏం చేసినా బాగానే ఉంటుంది. నేను ఓ మాట అంటే మాత్రం పౌరుషం పొడుచుకొస్తుంది" అంది బాలమ్మ.

"అబ్బబ్బ.. ఆపండి మీ గొడవ. ఇద్దరూ ఇద్దరే. ఛస్తున్నాను మీతో" విసుక్కున్నాడు క్రిష్ణ.

"అంతేలే నాయనా! నీ భార్య చేసేది బావుంటుంది. పెద్దదాన్ని నేను నోరెత్తితే అది మహాపరాధం!" అందావిడ బాధగా.

"శారదా! చూడు పాపం అమ్మ ఎంత బాధపడుతుందో! ఏది ఏమైనా నువ్వు చేసింది తప్పే! పట్టపగలే ఇలా సరసం ఆడటం అంత బాగాలేదు సుమా!" అన్నాడు క్రిష్ణ.

"రామ రామ! మీరు కూడా ఏవిటండీ ఆవిడకి తాళం వేస్తారు? కావలించుకోవడమా పాడా? అదుగో ఆ పక్కన నీళ్లు పడ్డాయి. ఈ గచ్చుమీద నీళ్లు పడ్డా కనిపించదు. పరిగెత్తుకుంటూ వచ్చి కాలుజారి పడతారేమో అని పట్టుకున్నాను" అసలు సంగతి చెప్పింది.

"అయ్యో అదా సంగతీ! నాకేం తెలుసూ! అందుకే అపార్థం చేసుకున్నాను. ఇంకా నయం తెలివిగా పట్టుకున్నావు కాబట్టి సరిపోయింది. లేకపోతే పాపం ఆ పవన్‌కుమార్ లాగా వీడూ కిందపడి కాళ్లు విరగొట్టుకునేవాడు" అంది బాలమ్మ.

అన్నాక ఏ పవన్‌కుమారూ? అని వాళ్ళిద్దరిలో ఎవరైనా అడుగుతారేమో అని ఎదురుచూసి ఎవరూ అడగకపోవడంతో తనే చెప్పటం మొదలుపెట్టింది.

"మీకు చెప్పానో లేదో మా సాంబమూర్తిగారి అబ్బాయి పవన్‌కుమారు మనసుపడి కొత్తింట్లో ఇదుగో ఇలాటి గచ్చే చేయించాడుట. గృహప్రవేశంనాడు గుమ్మడికాయా, కొబ్బరికాయా కొట్టి ఇంట్లోకి కుడికాలు పెట్టబోతూ దభీమని జారిపడిపోయాడుట. కాలు ఎముక విరిగితే మామూలుగా అతుక్కోదని ఆపరేషనుచేసి ఇనపకడ్డీ వేశారుట. ఆర్నెల్లు మంచంలో వున్నాడుట!

ప్రమాదం పసికట్టింది శారద. ఆవిడని ఆపకపోతే అలా చెప్పుకుంటూ పోతుంది. అన్నీ ప్రమాదాలూ, అపభ్రంశాలే. అందుకే మధ్యలోనే అందుకుని "ఇక చాల్లే ఆపండి" అనేసి, "అవునూ ఇప్పుడంత అర్జెంటుగా ఎందుకు పరిగెత్తుకొచ్చారు? " అంటూ భర్తని అడిగింది.

ఈ గందరగోళంలో అసలు విషయం మర్చిపోయాడు క్రిష్ణ. "నేనా? పరిగెత్తుకొచ్చానా? " అని భార్యనే అడిగాడు.

"ఇది మరీ బావుంది. శారదా శారదా.. అంటూ రేసుగుర్రంలా పరిగెట్టుకొస్తేనేకదా, పడతారేమోనని నేను పట్టుకున్నదీ? " గుర్తుచేసింది.

"ఏమో మరి! మర్చిపోయాను.. ఉండు" అంటూ మళ్లీ అటూ ఇటూ పచార్లు చెయ్యడం మొదలుపెట్టాడు. ఆయనెప్పుడూ అంతే. చెప్పాల్సిన మాట గుర్తురాకపోతే అలాగే పచార్లు చేస్తాడు. అప్పుడు గుర్తొస్తుంది. అదృష్టం బావుండి నాలుగు సార్లు తిరిగేసరికే గుర్తొచ్చింది. ఆయన మొహం వెలిగిపోయింది.

"శారదా! ఇందాక మన చిట్టిగాడికోసం ఎవరో అమ్మాయి ఫోన్ చేసింది" అన్నాడు.

"అమ్మాయా? " శారద మొహం కూడా వెలిగిపోయింది.

"అవును అమ్మాయే. కంఠం ఎంతో తియ్యగా వుంది. మాటలో ఎంతో మర్యాద తొణికిసలాడుతోంది" చెప్పాడు.

"అలాగా ఏం మాట్లాడింది? " ఆనందంగా అడిగింది శారద.

"సూర్యంతో మాట్లాడొచ్చా అండీ!- అంది ఇంగ్లీషులో. అయ్యో దానికేముందమ్మా.. నిరభ్యంతరంగా మాట్లాడొచ్చు. కానీ ప్రస్తుతం వాడింట్లో లేడు. కావలిస్తే మొబైల్ నెంబరిస్తాను- అన్నాను."

"మొబైల్‌లో ప్రయత్నించి చూశానండీ! దొరకడం లేదు. అర్జెంటుగా మాట్లాడాలి- అంటూ ఇంగ్లీషులో తెగ ఇదైపోయింది" అన్నాడు ప్రసన్నంగా.

"ఆహా! అంతదాకా వచ్చిందంటే బాగానే స్నేహం ఉందన్నమాట! మరి మనవాడు మనతో మాట మాత్రమైనా చెప్పలేదేం!" మురిసిపోయింది శారద.

మళ్ళీ పూజగదిలోంచి అందుకుంది బాలమ్మ, "వాడంతటవాడేం చెప్తాడు? సిగ్గుపడి వుంటాడు. ఇవ్వాళో రేపో చెప్తాడు. అబ్బాయ్.. పన్లో పనిగా ఆ పిల్ల పేరూ ఊరూ కనుక్కోక పోయావా? " అంటూ.

"పేరు చెప్పిందిలే నేనడక్కుండానే" అన్నాడు క్రిష్ణ.

"అలాగా మరి చెప్పరేం? ఏం పేరు? " ఆత్రంగా అడిగింది శారద.

"లావణ్య"

"లావణ్యా? ? ? " నిలువునా నీరుగారిపోయింది శారద!

"అవును. లావణ్యే. ఏం? " భార్య ఎందుకలా డీలా పడిపోయిందో అర్థంకాలేదు క్రిష్ణకి.

"ఏడిసినట్లే వుంది. చిట్టిగాడికి ఆడపిల్ల ఫోన్ చేసిందంటే ఏవిటేవిటో ఊహించుకుని సరదా పడ్డాను" అంది నీరసంగా.

"ఏం ఇప్పుడు మాత్రం ఏమైంది? ఫోన్ చేసింది ఆడపిల్లేగా!"

"ఈ లావణ్య వాడి టీమ్ మేటు"

"అయితే మాత్రం ఏం? ఇలా ఒకేచోట పనిచేస్తూ స్నేహం పెంచుకుని మనసులు దగ్గరై పెళ్ళిళ్ళు చేసుకున్నవాళ్ళు ఎంతమంది లేరు? " క్రిష్ణ ఆశావాది.

"అవును. కానీ ఈ లావణ్యకి రెండేళ్ళకిందటే పెళ్ళయింది. ఈ మధ్యనే పిల్లవాడు కూడా పుట్టాడు. వాడికి చీటికీ మాటికి ఏవో ఆరోగ్య సమస్యలు. అవొచ్చినప్పుడల్లా ఈ లావణ్య చిట్టిగాడికి ఫోన్‌చేసి తన పని కూడా చూసి పెట్టమని బ్రతిమాలుతుంది. ఇవ్వాళా ఏదో సమస్య వచ్చుంటుంది. అందుకే తెల్లారకుండానే ఫోన్ చేసింది" వివరించి చెప్పింది శారద.

"అదా విషయం. నేనింకా ఏమిటేవిటో ఊహించుకొని మురిసిపోయాను" నీరసపడిపోయాడు కృష్ణ. మళ్లీ తనే-

"నేనెంత చెప్పినా వీడికి చీమ కుట్టినట్లైనా లేదు" అన్నాడు.

అప్పుడే ఇంట్లోకి అడుగుపెట్టాడు చిట్టిగాడనబడే శ్రీనివాస్ ఉరఫ్ సూర్య.

"వచ్చావుట్రా! రాత్రి ఎప్పుడొచ్చేవ్? " అడిగింది శారద.

తల ఆడించుకుంటూ చెప్పులు

షూస్టాండులో పెట్టి మెట్లవైపు నడిచాడు చిట్టి. శారద కంగారు పడిపోయింది. "చచ్చాం.. వాడు మేడెక్కేస్తున్నాడు. ఒరే చిట్టీ! ఆగరా! ఒరే! నిన్నే" అంటూ అరవగ లిగినంత గట్టిగా అరిచింది.

అయినా చిట్టి వినిపించుకోలేదు. పర వశంగా తలాడిస్తూ మేడ మీదికి వెళ్ళిపో యాడు.

అతనికి వినికిడి లోపం ఏమైనా వుందా అంటే ఎంతమాత్రం లేదు. సలక్షణంగా వినిపిస్తుంది. కాకపోతే బయటి ప్రపం చంతో సంబంధం ఉండదు. ఉంటే ఓ చె విలో సెల్‌ఫోనైనా వుంటుంది, లేకపోతే రెండు చెవుల్లో మైక్రోఫోన్లైనా వుంటాయి. ఇవతలివాళ్ళు అరిచి గీపెట్టినా వినపడదు.

"అరిచి ఛస్తున్నా వినకుండా వెళ్లిపో యాడు.. వీడొహడు నా ప్రాణానికి. నీ ప్రోగ్రాం ఏమిటో చెప్పేడవరా అంటే వినడు" విసుక్కుంది శారద.

అవును మరి ఆ చిట్టిగాడి వేళలు అలాగే వుంటాయి. అంతా అస్తవ్యస్తంగా ఉంటుంది అతని వ్యవహారం.

పేరు మోసిన ఐ.టి. కంపెనీలో అయి దేళ్లుగా పనిచేస్తున్నాడు. ప్రస్తుతం టీమ్ లీడర్ పదవిలో ఉన్నాడు. వేళాపాళా లేని ఉద్యోగం.

ఒకరోజు 'అమ్మా తొమ్మిదింటికే టిఫిన్ చేసి భోజనం పట్టుకెళ్తాను' అంటాడు. మర్నాడు పదిన్నరకి ఏకంగా భోజనం చేసి వెళ్తానంటాడు. మరోరోజు మధ్యాహ్నం ఒంటిగంటకి వెళ్లి, మర్నాడు మధ్యాహ్నం వచ్చి అన్నం తినకుండా నిద్రపోతాడు.

'నువ్వెప్పుడొస్తావో, ఏం తింటావో నాకు కాస్త ముందుగా చెప్పి ఏడవరా' అని మొత్తుకుంటుంది శారద. అయినా వినిపిం చుకోడు.

'ఏం ఫర్వాలేదులే లైట్ తీస్కో. అంతగా అయితే అక్కడే తింటాను' అంటాడు. పోనీ అలా అన్నవాడు వూరుకుంటాడా? ఏ మధ్యాహ్నమో ఫోన్‌చేసి, 'అమ్మా ఏం వండావు? బెండకాయ కూరా? తిను.. తిను.. నీకేం అదృష్టవంతురాలివి. నేనిక్కడ నూడుల్స్ అనబడే చెత్త తింటు న్నాను' అని వాపోతూవుంటే తల్లి ప్రాణం కొట్టుకుపోతుంది. ఇక అన్నం సయించదు.

ఇప్పుడు మళ్ళీ మేడెక్కి వెళ్ళి వాడిని పట్టుకుని చెవుల్లోంచీ ఆ యంత్రాలు ఊడ బీకి ఏం తింటాడో అడిగి రావాలి! ఉసూ రుమంది శారద.

"ఏవండీ! పైకి వెళ్ళి అబ్బాయికేం కావాలో అడిగొస్తారా? " అంది ప్రేమగా.

"నావల్ల కాదు. నువ్వే వెళ్లు" అన్నాడా యన మోకాళ్ళు సవరదీసుకుంటూ.

"అత్తయ్యా!" అంది శారద.

ఓ చెవి ఇటువేసి వుంచిన బాలమ్మ వెంటనే అందుకుంది "నా వల్ల కాదే తల్లీ. అంత్య నిష్ఠూరం కంటే ఆదినిష్ఠూరం మేలు. కావాలంటే వంటలో సాయం చేస్తాను" కచ్చితంగా చెప్పేసింది.

"ఎవరికి తప్పినా నాకు తప్పదు కదా! నా బతుకంతా ఈ కొంప చాకిరీకే సరిపో తోంది" అంటూ గ్యాస్ ఆపేసి ఆపసోపాలు పడుతూ మేడ మీదికి వెళ్ళింది శారద.

భార్య వంక చూసి నిట్టూర్చాడు క్రిష్ణ.

'అంతా నా ఖర్మ. ప్రాణమిత్రుడు కదా అని ఆ పార్థసారథిగాడి సలహా పాటించి ఇదుగో ఇలా అవస్థ పడుతున్నాం' అనుకు న్నాడు.

ఆ ప్రాణస్నేహితుడు పార్థసారథి.. పాపం చాలా మంచివాడు. వాళ్ళ మేలు కోరేవాడు. కాలానుగుణ్యంగా నడుచుకోమ న్నాడు. అసలు విషయం ఏమిటంటే అయి దేళ్ల కిందట స్వంత ఇల్లు కొనుక్కోవాలని ఆలోచిస్తున్నప్పుడు తారసపడ్డాడు అతడు.

మూడు పడగ్గదులున్న ఫ్లాట్ కొనుక్కుం టాను అంటే, వద్దన్నాడు. 'ఆ ఫ్లాట్ పద్ధతి

పాతబడిపోయింది. ఇప్పుడంతా డ్యూప్లెక్స్ ఇళ్లు ఫ్యాషన్. నువ్వూ అదే కొనుక్కో. దర్జాగా ఉంటుంది. అందులోనూ రేపో మాపో కొడుకు పెళ్లి చెయ్యబోతున్నావు. ఫ్లాటులో ఉన్నానంటే, అబ్బే ఫ్లాటా అనే స్తారు ఎదుటివాళ్లు. అదే డ్యూప్లెక్స్ ఇల్లు అన్నావనుకో.. అబ్బో, అలాగా అంటారు. ఘనంగా ఉంటుంది' అన్నాడు. దాంతో ఫ్లాట్ ఆలోచన మానేసి ఇళ్ల వేటలో పడ్డాడు.

సలహా ఇచ్చి ఊరుకోలేదు పార్థసారథి. ఇల్లు ఎంపికలోనూ, బేరసారాలలోనూ దగ్గ రుండి సాయం చేశాడు. ఒకటికి పదిసార్లు తిరిగి ఒకచోట ఎంచాడు.

నూట పదిగజాల స్థలంలో నాలుగువై పులా కాస్త కాస్త స్థలం వదిలి మధ్యలో కట్టిన ఇల్లు. కింద హాలు, పూజగది, వంటిల్లు, ఒక పడగ్గది. పైన మళ్లీ హాలు, రెండు పడగ్గదులు. ఇంచుమించు మూడు వేల చదరపుటడుగుల ఇల్లు. బ్రహ్మాం డంగా ఉంది.

కింద గచ్చు, అధునాతనమైన వంటిల్లు, చెక్క అలమార్లు, ఏసీలు. 'నలభై రెండు లక్షలు అయినా ఇంద్రభవనంలా ఉంది' అని మెచ్చుకున్నారు చూసిన వాళ్లంతా.

క్రిష్ణ సంతోషంతో ఉబ్బితబ్బిబ్బు అయి పోయాడు. శారద ఆనందం అంతా ఇంతా కాదు. బాలమ్మ కూడా భలే సరదా పడింది. సూర్యహా ఉరఫ్ చిట్టిగాడు ఉరఫ్ శ్రీనివాస్ సంబరానికి పట్టపగ్గాలులేవు. పార్థసారథికి జరీపంచె, ఆయన భార్యకి పట్టుచీరె కూడా సమర్పించారు.

రెండు నెలలు తిరిగొచ్చేసరికి ఆ సరదా ఆవిరైపోయింది. చిట్టిగాడు తప్పించి అందరూ నీరసాన పడ్డారు.

ఉన్న కొద్ది స్థలంలో హాల్లోంచీ మెట్లు కట్టాల్సి వచ్చేసరికి బాగా ఎత్తుగా.. మూరె డంత మెట్లు కట్టడం జరిగింది. ఎక్కేసరికి అలుపూ ఆయాసం. అందులోనూ ఒకసారి

## కొత్తగాలి...

**దృష్టి మాంద్యంవల్ల**
**ఆర్థిక మాంద్యం**
**ఆటోమేటిక్‌గా**
**హార్దిక మాంద్యం!**

*-దూసి నీహారిక, మారతహళ్లి, బెంగళూరు*

ఎలాగో మెట్లెక్కి పైకెళ్లి, 'హమ్మయ్య మొక్కు తీరిపోయింది' అనుకునే పరిస్థితి కాదు. రోజుకి అరవైసార్లు ఎక్కి దిగాలి.

కింద పడగ్గది బాలమ్మకి. పైన రెండు గదులూ తండ్రికొకటీ, కొడుక్కి ఒకటీ అను కున్నారు. అదేం ఖర్మమో.. పైనుంటే కింద ఏదో పని తగుల్తుంది. కిందికి దిగ గానే పైకి వెళ్ళాల్సి వస్తుంది. పోన్లే అదో వ్యాయామం అని సరిపెట్టుకున్నారు కొత్తలో.

ఇలాకాదు. అవసరం అయితేనే పైకీ కిందికీ దిగుదాం అనుకున్నారు దంప తులు. అయినా వీలవదు. కింద పన్లన్నీ ముగించుకుని బాలమ్మని కిందవుంచి పైకెళ్లి నడుం వాల్చగానే ఎవరో తలుపు తడతారు.

బాలమ్మ తలుపు తీసినా.. అబ్బాయ్ అనో, శారదా అనో పిలవాల్సిందే తప్పించి ఆవిడేం సమర్థించగలదు?

ఎంత వద్దనుకున్నా రోజు మొత్తంమీద పాతికసార్లు మేడెక్కి దిగడం తప్పడం లేదు. దాంతో ఇద్దరికీ మోకాళ్ళు వాచి పోయి ఒకటే నొప్పులు.

బాలమ్మ ముందే చేతులెత్తేసింది.

"హమ్మో.. ఇవేం మెట్లే? నిచ్చెనో, కొబ్బరి చెట్టో ఎక్కినట్లే ఉందిగానీ మేడెక్కి నట్లు లేదు. నా వల్లకాదు" అని కచ్చితంగా చెప్పేసింది.

ఇక ఎప్పుడో తప్పనిసరి పరిస్థితుల్లో త

మిళ ముఖ్యమంత్రి కరుణానిధిలాగా మనిషి సాయంతో పైకి వెళ్తుంది.. అంతే. అలా వెళ్లినందుకు ఆ రోజంతా ఆపసోపాలు పడుతుంది.

క్రిష్ణ కూడా పగలంతా కిందనే కాలక్షేపం చేస్తాడు. నెలకి సగం రోజులు తల్లి గదిలోనే పడుకుంటాడు కూడాను.

తల్లీ కొడుకులు తప్పించుకున్నా శారదకి మాత్రం తప్పడం లేదు. తన కోసం కాకపోయినా కొడుకు కోసమైనా పదిసార్లు పైకీ కిందికీ తిరగకుండా గడవడంలేదు. 'బుద్ధి గడ్డితిని కొన్నాం ఈ ఇల్లు. నేలబారుగా వుంటే హాయిగా వుండేది' అనుకుంటుంది మేడెక్కినప్పుడల్లా.

ఈసురోమంటూ మేడెక్కి, చేర్‌లో కూర్చుని తలాడిస్తున్న కొడుకు భుజంమీద తట్టింది. చెవులోంచి యంత్రాలు తీసి తల్లిని చూసి నవ్వేడు చిట్టి.

"చాల్లే. చేసే పిచ్చిపన్లు కాక నవ్వొకటి తక్కువ. ఇంట్లోకి రాగానే చెవుల్లోంచి యంత్రాలు తియ్యరా అంటాను వినవు కదా!" విసుక్కుంది.

విషయం తెలుసుకుని, "ఇంకో అరగంటలో టిఫిన్ చేస్తాను. ఇవ్వాళ ఆఫీసుకి వెళ్లను. ఇంట్లోంచే పని చేసుకుంటాను" చెప్పాడు.

"నీకోసం లావణ్య ఫోన్ చేసింది" అని చెప్పి, వెనుతిరిగింది శారద. నెమ్మదిగా కిందికి దిగింది.

'వీడివెనకాల పరిగెత్తలేక నా ప్రాణం పోతోంది. వీడికి పెళ్లిచేస్తే భార్య వస్తుంది. వీడి బరువు బాధ్యతలు తీసుకుంటుంది అని ఆశ పడ్డాను. అదేం ఖర్మమో ఏదీ కలిసిరావడం లేదు' అనుకుంది దీనంగా.

వాళ్లకి ఏకైక సంతానం చిట్టిగాడనబడే సూర్యహా. తొలికాన్పులో ఎనిమిదో నెలకి పుట్టిన పిల్లవాడు నాలుగు రోజులు మాత్రమే బతికి చనిపోయాడు. ఆ తర్వాత మళ్లీ గర్భం వచ్చినపుడు మొక్కని దైవం లేదు. తీసుకోని జాగ్రత్త లేదు.

ఆమాటు ఏ అవాంతరం లేకుండా నెలలు నిండాక పుట్టాడు, పండంటి మగబిడ్డ. వాడి నామకరణానికి ముందు అందరూ సమావేశమై పేరు నిర్ణయించారు.

నాగసత్య సూర్య హనుమత్ శంకర సాయి వేణుగోపాల దుర్గా శ్రీనివాస్. పళ్లెంలో బియ్యం మీద ఓపికగా ఉంగరంతో రాసి ఊపిరి పీల్చుకున్నాడు క్రిష్ణ.

స్కూల్లో వేసేటప్పుడు పి. ఎన్. ఎస్. ఎస్. హెచ్. ఎస్. ఎస్. వి. డి శ్రీనివాస్ అని రాసి వున్న పేరు చూసి 'మీకేమైనా పిచ్చా చాదస్తమా' అని విసుక్కుంది క్రిస్టియన్ ప్రిన్సిపాల్.

ఆ తర్వాత కంప్యూటర్ యుగం వచ్చేసింది. పొడి అక్షరాలు రాసేసి పని జరుపుకున్నా ముఖ్యమైన చోట్ల చచ్చినట్లు పూర్తిపేరు రాయాల్సిందే.

మనిషికి ఇంత పొడుగు పేరుకూడా ఉంటుందని ఆ కంప్యూటరుకి తెలియక కొన్ని గడులే కేటాయించింది పేరుకి.

ఫలితం.. పసివేదల నాగ సత్య సూర్య హ అని రాసేటప్పటికి గళ్లు పూర్తయిపోయి చేతులెత్తేసింది కంప్యూటరు.

పేరు మార్చుకుంటానంటే పెద్దవాళ్ళు ఒప్పుకోలేదు. 'ఇంకా నయం. దేవుడి పేరు మార్చుకుంటే కళ్లుపోతాయ్' అన్నారు.

ఇంకేం చేస్తాడు? ఆ పేరుతోనే ఐ.ఐ.టి. ఎంట్రెన్స్ రాశాడు. ఆ పేరుతోనే గౌహతీలో చదివాడు. ఆ పేరుతోనే కేంపస్ ఇంటర్వ్యూలో నెగ్గాడు. ఆ పేరుతోనే ఉద్యోగంలో చేరాడు.

ఆఫీసులో కూడా ఆ పేరుతోనే చలామణి అయిపోతున్నాడు. కాస్త ఓపిక వున్నవాళ్లు 'ఏం నాగ సత్య సూర్యహా పసి

వేదలా! ఎలా వున్నావ్' అంటారు. అంత శక్తిలేనివాళ్లు 'సూర్యహా పసివేదలా.. రా కాఫీ తాగొద్దాం' అంటారు.

అమెరికన్ క్లైంట్ కూడా నోరు తిరిగో తిరగకో ఇతన్ని పిల్చి మాట్లాడి పని జరుపుకుంటాడు. పేరు కాంప్లికేటెడ్‌గా వుంటుందిగానీ ఈ ఉద్యోగి చాలా ఇంటలిజెంట్ అనుకుంటాడు.

ఆఫీసులో ఎవరెలా పిలిచినా అతని బంధువులంతా 'శ్రీనివాస్' అంటారు. ఇంట్లో మాత్రం ముద్దుగా 'చిట్టీ' అని పిలుస్తారు.

సూర్యహాకి పెళ్లీడు వచ్చింది. చిన్నతనం నుండీ బుద్ధిగా క్రమశిక్షణతో పెరిగాడు. తన లోకం ఏమో తానేమో.. అలాగని వెర్రివెంగళాయి కాదు. అతనికి తెలియని విషయం లేదు. కాకపోతే ప్రేమలూ, అవీ ఏం లేవు.

'పెద్దవాళ్ళు పెళ్లి చేస్తాం' అంటే, 'సరే' అన్నాడు బుద్ధిగా.

క్రిష్ణ మనసు సంతోషంతో ఉప్పొంగిపోయింది. ఇక పెళ్లి ప్రయత్నాలు చెయ్యాలి. మగపిల్లాడి తండ్రిని అని గర్వంగా కాలరు ఎగరేసుకున్నాడు.

"నా పెళ్లికిలాగా కాదు. నా కొడుక్కి అన్నీ దర్జాగా జరగాలి" అన్నాడు భార్యతో.

మొహం ముడుచుకుంది శారద. "మీకేం తక్కువైందిట!" అంది విసురుగా.

"నీ విషయం వేరులేరా అబ్బాయ్! నీ కొడుక్కి అలా జరగదులే!" అంది బాలమ్మ ఓదార్పుగా.

ఏమాట కామాటే చెప్పుకోవాలి. అల్లుడిగా క్రిష్ణకి ఏ లోపమూ జరగలేదు. ముగ్గురాడ పిల్లల్లో పెద్దది శారద. పెళ్లి ఘనంగానే చేశారు. ముద్దూ ముచ్చట్లూ బాగానే జరిపారు. పెళ్లై ఇన్నాళ్ళయినా ఇప్పటికీ మామగారు ఎంతో ప్రేమగా 'ఏవిరా క్రిష్ణా' అనేసి నాలుక కరుచుకుని, 'బాగున్నారా?' అని సరిదిద్దుకుంటాడు.

మరి పాపం ఆయన మాత్రం ఏం చేస్తాడు. స్వయానా మేనమామ. అందునా పెద్ద మేనమామ. చిన్నతనంలో అమ్మవెంట తాతగారింటికి వెళ్లినపుడు పెద్ద మామయ్యంటే హడలు. పుట్టింటికొచ్చిన నలుగురు అక్కచెల్లెళ్లు ఒకచోట చేరి కబుర్లు చెప్పుకుంటూ పిల్లలు అల్లరి చేస్తుంటే, 'ఒరే చంద్రా.. కాస్త వీళ్లని కేకలెయ్యరా' అనేవాళ్లు.

చంద్రా అనబడే చంద్రశేఖరం మావయ్య "ఎవడ్రా ఆ అల్లరి చేసేదీ? నేనొచ్చానంటే బెత్తంతో పెళ్లి చేస్తాను" అని హుంకరించేవాడు. దాంతో అల్లరాపేసి పరుగులు పెట్టేవాళ్లు పిల్లలు.

మరి చిన్ననాటి నుండీ ఉన్న భయం పెళ్లినాడు ఎక్కడికి పోతుంది? నాకివన్నీ ఇష్టం లేదు అన్నా, 'కాదు లేదు ఇదో వేడుక' అని బలవంతాన అలకపాన్పు ఎక్కించారు క్రిష్ణని. మొహమాటపడుతూనే పాపం అలక పాన్పుమీద కూర్చున్నాడు.

'అల్లుడు అలిగాడు. వచ్చి అలక తీర్చు' అని మామగారికి చెప్పారు. అసలే కన్యాదాత. పెళ్లి సవ్యంగా చేసి ఏ మాటా రాకుండా పెళ్లివారిని సాగనంపాలనే టెన్షన్‌లో ఉన్నాడు.

హఠాత్తుగా పిలిచేసరికి అలవాటుగా అరుచుకుంటూ వచ్చేశాడు. 'ఎవడ్రా? ఎవరదీ? ఏం పడాలా దెబ్బలూ?' అంటూ హడావిడిగా వస్తున్న పెద్ద మావయ్యని చూసి, తన హోదా కూడా మర్చిపోయి అలక పాన్పు దిగి పరుగుతీశాడు అల్లుడు అలవాటుగా.

ఆ తర్వాత అందరూ పూనుకుని అంతా సర్దుబాటు చేశారు.

అయినా ఆ భయం భయమే. ఎంత అవసరం అయితే తప్పించి మేనమామ




ఎదుటికి వెళ్లడు క్రిష్ణ.

తను పడిన బాధలు కొడుకు పడకూడదు. వాడికన్నీ దర్జాగా జరగాలి అని కొడుకు పెళ్లికి ప్రయత్నాలు మొదలుపె

ట్టాడతను.

కాస్త ఆలస్యం అయినా వాడికి మంచి సంబంధం వెతికి మరీ పెళ్లి చెయ్యాలి. మా నాన్న కాబట్టి నాకింత గొప్ప సంబంధం తెచ్చాడని వాడు అనుకోవాలి.

ఆ నిర్ణయం తీసుకున్నాక కనిపించిన బంధుమిత్రులందరితోనూ "మా అబ్బాయికి పెళ్లి చేద్దామనుకుంటున్నాం!" అని చెప్పాడు.

అలా చేస్తే, 'ఓహో ఈయన కొడుక్కి పెళ్లి చేస్తాడుట' అని అందరూ చెప్పుకుంటారు. ఆ నోటా ఆ నోటా పడి ఈ వర్తమానం అందరికీ చేరుతుంది. ఆడపిల్ల తల్లిదండ్రులు పరిగెట్టుకుని వస్తారు అనుకున్నాడు.

అంతకుముందే ఎటువంటి సంబంధం కావాలో అందరూ చర్చించుకుని ఒక నిర్ణయానికి వచ్చారు. కాస్త వాదోపవాదాలు జరిగినా చివరికి ఏకగ్రీవంగా ఓ నిర్ణయానికి వచ్చారు.



'తెల్లగా, సన్నగా పెద్ద పెద్ద కళ్లు, పొడవాటి జుట్టూ వుండి, చదువుకుని ఉద్యోగం చేసే అమ్మాయి కావాలి నాకు' అన్నాడు సూర్యహా.

'పిల్ల అణకువగా వుండాలి. మంచీ మర్యాదా, పనీ పాటా తెలిసిన అమ్మాయి కోడలుగా కావాలి నాకు' అంది శారద.

'సాంప్రదాయం కూడా చూడాలి' అంది బాలమ్మ.

'ధనవంతులై మంచి కుటుంబంలో పుట్టి పెరిగిన పిల్ల అయితే వాడికీ ముద్దూ ముచ్చటా జరుగుతాయి' అనుకున్నాడు క్రిష్ణ.

కొడుకు పెళ్లి చెయ్యాలనుకుంటున్నానహో అని దండోరా వేసి రెండు నెలలు గడిచిపోయాయి. ఎక్కడా చడీ చప్పుడూ లేదు. ఎవరూ పిల్లనిస్తామని ముందుకు రాలేదు.

ఆ విషయమే ఒక స్నేహితుడితో చర్చించాడు. "మనకి తెలిసిన వాళ్లలో ఎవరూ లేరు. అందరిళ్లలోనూ మగపిల్లలే. గుమ్మంలోకి వెళితే చాలు మా అబ్బాయికి ఎక్కడైనా సంబంధం చూడమని వెంటబడుతున్నారు. సర్లే వాళ్లలో నువ్వూ ఒకడివి. ఎక్కడైనా తటస్థపడితే చెప్తాను. నువ్వు కూడా నిమ్మకు నీరెత్తినట్లూ కూర్చోకుండా కాస్త గట్టిగా ప్రయత్నించు" అని చెప్పి వెళ్లిపోయాడాయన.

బుర్ర గోక్కున్నాడు. గట్టిగా ప్రయత్నించటం అంటే ఏం చెయ్యాలో అర్థం కాలేదు క్రిష్ణకి. మరో నలుగురికి చెప్తే సరి అనుకున్నాడు.

పక్కింటి మోహన్రావుగారికీ, ఎదురింటి పాపారావుగారికీ, వాకింగ్‌కి వెళ్లినప్పుడు కనిపించే మిత్రులందరికీ ఈ విధంగా

తను కొడుక్కి పెళ్లి చెయ్యబోతున్నట్లు చెప్పాడు. 'అలాగా? అయితే త్వరలో మాకు విందు భోజనం వుందన్నమాట' అని సంతోషపడ్డారు వాళ్లు.

'విందు భోజనానికేంగానీ మంచి సంబంధం వుంటే చెప్పండి' అన్నాడు.

'మాకెవరూ తెలియదు. కానీ చూస్తాం లెండి' అని హామీ ఇచ్చారు.

కానీ ఫలితం శూన్యం. దాంతో ప్రచారం మరింత విస్తృతం చేశాడు. పాలవాడికీ, పేపరువాడికీ, తను రోజూ వెళ్లే రామాలయం పూజారిగారికీ, పక్కకాలనీలో అయ్యప్పగుడి కడుతున్నాం చందాలివ్వండి అంటూ వచ్చిన పెద్ద మనుషులకీ, ఒక్కరినీ వదలకుండా చెప్పాడు సంబంధం చూడమని.

కానీ బండి కదల్లేదు.

అటువంటి సమయంలో మాట సాయం చేసి ఇల్లు దక్కించిన ప్రాణమిత్రుడు పార్థసారథి వచ్చాడు.

"ఏవిరా క్రిష్ణా ఎలా వున్నావ్? " పలకరించాడు, లోపలికి వచ్చి సోఫాలో సుఖాసీనుడై.

"ఏదో నీ దయవల్ల ఇలా వున్నాం!" మోకాళ్లు చూపించి సమాధానం చెప్పాడు క్రిష్ణ.

"ఏమ్మా ఎలా వున్నావ్? " మంచినీళ్లు తెచ్చి ఇచ్చిన శారదని అడిగాడు.

"ఏం ఉండటం అన్నయ్యగారూ! ఈ మధ్య ఆరోగ్యం అంత బావుండటంలేదు.. మోకాళ్ల నొప్పులు" అంది దీనంగా.

"అవునమ్మా ఈ వయసు ఆడవాళ్లకి మోకాళ్ల నొప్పులు సహజమే. మా ఆవిడా అంతే పట్టుమని పదడుగులు వేస్తే చాలు కుయ్యో, మొర్రో అంటుంది. చాలా నిదానంగా నడుస్తుంది. అదీ కష్టం. కేరళా వైద్యం చేయిస్తున్నాను" చెప్పాడు.

"అలాగా మరి ఏమైనా గుణం కనిపించిందా? "

"ఏం కనిపించడమో ఏమో! నడక వేగం బాగా మందగించింది. దానికితోడు తగని ఆరాటం. ఎవరింట్లో శుభకార్యమని పిలిచినా వెళ్దాం వెళ్దాం అని తయారైపోతుంది. అప్పటికీ ముందు జాగర్తతో ముహూర్తానికి బాగా ముందుగానే బయలుదేరుతాం. ఫంక్షన్ హాలుకి వేళకే చేరుతాం. కానీ ఏం లాభం? ఈవిడ కాళ్ళీడ్చుకుంటూ నడిచి వెళ్ళేసరికి అక్కడ ముహూర్తం, మంగళసూత్రధారణ, తలంబ్రాలూ కూడా అయిపోతాయి. ఏవిటో మా ఖర్మ. వయసులో దానికంటే ఏడేళ్ళు పెద్దవాడిని అయినా నాకే బాధాలేదు. చకచకా నడిచేస్తాను. అన్నట్లూ వీడూ నాతోటివాడేగా. అప్పుడే కాళ్ళీడుస్తున్నాడు" అన్నాడు.

"అవును నడుస్తావు! ఎందుకు నడవ్వూ? నీకిలాంటి మేడ లేదుకదా! ఇదుగో ఇంత ఎత్తు మెట్లు కట్టించుకునుంటే నువ్వూ నా కంటే మెల్లిగానే కాళ్ళీడ్చుకుంటూ నడిచేవాడివి" కినుకగా అన్నాడు క్రిష్ణ.

"నేను అప్పుడే చెప్పాను. లక్షణంగా రెండొందలయాభై గజాల స్థలం తీసుకోరా అని. విన్నావా? ఇప్పుడేడిస్తే ఏం లాభం? " బదులిచ్చాడు పార్థసారథి.

"అంత జాగా కావాలంటే మరో ఏడెనిమిది లక్షలు పెట్టాలి. ఈ ఇల్లు కట్టేసరికే చచ్చి సతమతమై కొనప్రాణాలతో మిగిలాను" అన్నాడు క్రిష్ణ.

"ఈ గొడవ సరేలే. మీవాడి పెళ్ళి విషయం ఏంచేశావు? ప్రయత్నాలు మొదలుపెట్టావా? " మాట మార్చాడు.

"ఆ మొదలుపెట్టకేం? ముమ్మరంగా ప్రయత్నాలు చేస్తూనే వున్నాను. ఇంకా ఏదీ కలిసిరాలేదు" చెప్పాడు క్రిష్ణ.

"అలాగా ఏంచేస్తున్నావు? " అడిగాడు

పార్థసారథి.

చెప్పాడు క్రిష్ణ.

ఆ సమాధానం విని పడీ పడీ నవ్వేడు పార్థసారథి.

"ఎందుకా నవ్వు? " చిరాగ్గా అడిగాడు క్రిష్ణ.

"ఏం చెయ్యనూ? నీ తెలివికి ఏడవలేక నవ్వుతున్నాను. క్రిష్ణా రేపు నీ మనవడో మనవరాలో వచ్చి తాతయ్యా నాకు పులినీ, సింహాన్నీ, ఖడ్గమృగాన్నీ చూపించవా అని అడిగితే వాళ్ళని ఎక్కడికి తీసికెళ్తావు? " అడిగాడు పార్థసారథి.

"జూకి తీసికెళ్తాను".

"మీ అమ్మకి జ్వరం వచ్చిందనుకో ఎవరి దగ్గరికి తీసికెళ్తావ్? " మరో ప్రశ్న.

"డాక్టరు దగ్గరికి" సమాధానం.

"మరి మీ ఆవిడ పట్టుచీరె కావాలంటే ఎక్కడికి తీసికెళ్తావు? "

"గుండె దడా, ఆయాసం అని చెప్పి ముసుగుతన్ని ఇంట్లో పడుకుంటాను"

"ఏడిచావులే. సరిగా సమాధానం చెప్పు!"

"ఏవిట్రా భేతాళుడిలాగా పిచ్చిప్రశ్నలూ నువ్వూనూ! పిచ్చేమైనా ఎక్కిందా? " ఓర్పు నశించిపోయింది క్రిష్ణకి.

"అది కాదురా వెర్రి వెంగళప్పా! కొడుక్కి పెళ్ళి చెయ్యాలంటే మేరేజ్ బ్యూరోకి వెళ్ళాలి. కంప్యూటర్‌లో వెతకాలి. లేదా పేపర్లో ప్రకటన ఇవ్వాలి. అంతేగానీ "పాలవాడికీ, పేపరు వాడికీ చెప్పడం ఏవిట్రా నీ తలకాయ!" మందలించాడు మిత్రుడు.

"ఓయబ్బ, నాకంత మాత్రం తెలీదా! ఇలా చేస్తే ప్రచారం జరుగుతుంది. నలుగురికీ తెలిస్తే మనం వెతక్కుండానే గుమ్మంలోకి వస్తాయి సంబంధాలు" ధీమాగా చెప్పాడు క్రిష్ణ.

"అలాగే అనుకుని కూర్చో. నువ్వు చెప్పినంత మాత్రాన వాళ్ళెందుకు వెతుకుతారు? గుమ్మం దిగ్గానే మర్చిపోతారు. అయినా ఊర్నిండా కోకొల్లలుగా మేరేజి బ్యూరోలుంటే వాటికి వెళ్ళి వెతుక్కోక ఈ అవస్థలన్నీ ఎందుకు చెప్పు? "

"నాకేం ఖర్మరా అక్కడా ఇక్కడా వెతకడానికి! నేను మగపిల్లాడి తండ్రిని. ఆ వెతకడాలూ, అవస్థలూ అన్నీ ఆడపిల్లగలవాళ్లు పడాలి." ధీమాగా అన్నాడు క్రిష్ణ.

మిత్రుడి అమాయకత్వం చూసి జాలిగా నవ్వాడు పార్థసారథి.

"మగపిల్లాడి తండ్రినని బీరాలు పలకడానికి నువ్వు సింగరాజు లింగరాజువీ కావు. ఇవి వరవిక్రయం రోజులూ కావు. ఆడపిల్లల తండ్రులు ఎంతమాత్రం తొందరపడడంలేదు.

అయితే ఈ ఏడు అవుతుంది. కాదూ పైఏడు అవుతుంది. అప్పటికి ఇంకా పెద్ద ఉద్యోగం వస్తే ఇంకా మంచివాడు దొరుకుతాడు అని నిశ్చింతగా వుంటున్నారు. కాబట్టి నువ్వు మగపిల్లాడి తండ్రినని బిగుసుకు కూర్చుంటే ఏమీ లాభంలేదు" అన్నాడు.

క్రిష్ణ మొహం వాడిపోయింది.

'ఈ వెధవ రంగప్రవేశం చేశాడు. ఇక నాకు మనశ్శాంతి వుండదు' అనుకున్నాడు.

అంతా వింటున్న శారద "ఆయన మాటలకేంలెండి అన్నయ్యగారూ! మా మేలు కోరేవారు. మీరే పూనుకుని సహాయం చెయ్యాలి" అంది శారద.

"దానికేంలే అమ్మా.. మావాళ్ళూ ఇద్దరు పెళ్ళికూతురికోసం వెతుకుతున్నారు. వాళ్ళకీ నేనే మాట సాయం చేస్తున్నాను. వాళ్ళతోపాటు మనవాడికీ చూస్తాను" వెంటనే ఒప్పుకున్నాడు పార్థసారథి అమిత రీవితో. 'ఈ మాత్రం సాయం చెయ్యకపోతే ఎలా? ' అని కూడా అన్నాడు.

"నీ సాయం స్వీకరించడం నాకిష్టంలేదు"

చెప్పాడు క్రిష్ణ.

"ఏం? కోరి సాయం చేస్తానంటే ఎందు కిష్టంలేదు? " అడిగింది శారద.

"ఏమో! వీడి సాయం నాకంతగా అచ్చి రాదేమో అని నా అనుమానం. పూనుకుని కట్టించాడుగా ఇల్లు!" అంటూ మళ్ళీ మోకాళ్ళ సవరదీసుకున్నాడు క్రిష్ణ.

"చాల్లే వూరుకోండి" అని మొగుడిని కసి రేసి, "ఆయన మాటలకేంలెండి అన్నయ్య గారూ! మీరు మాకు సాయం చెయ్యండి! అసలైనా మీరు నాకు స్వంత అన్నకంటే ఎక్కువ" అంది శారద.

"వాడి మాటలు పట్టించుకుంటే ఇక పనులు అయినట్లే. వాడి దోవన వాడేదో చెప్తాడు. మన దోవన మనం పనులు చేద్దాం. మంచిరోజు చూసి మనవాడి ఫొటో, వివరాలు, జాతకం ఒక్కోటీ నాలుగు కాపీల చొప్పున సిద్ధం చేసి నాకివ్వు! నాలుగుచోట్ల పెడతాను" అన్నాడు.

"పెడితే పెట్టావుగానీ నాయనా కాస్త తెలిసున్నవాళ్ళను చూడమని చెప్పు. ఆ సంబంధాలు చూసేవాళ్ళకి. అసలు పెళ్లంటే అటేడు తరాలూ, ఇటేడు తరాలూ చూసేవారుట మా రోజుల్లో. ఇప్పుడు కాలానుగుణంగా అంత లోతుగా చూడక పోయినా వాళ్ళ ఇంటి వివరాలైనా తెలుసు కోవాలిగా మరి. లేకపోతే పాపం మా పార్వతిలాగా అయిపోతుంది" అంటూ పక్కగదిలోంచి అన్నీ వింటున్న బాలమ్మ బయటకి వచ్చింది.

"ఏ పార్వతిగారు అత్తయ్యా? ఆవిడకి ఏమైంది? " అడిగాడు పార్థసారథి.

"ఏముందీ.. పాపం ఇలాగే నీబోటివాడె వరో చెప్పారని వాళ్ళ మనవడికి పెళ్ళి చేశారు. తీరా చూస్తే ఆ పిల్లతల్లికి కాస్త పిచ్చివుందిట. అమావాస్యకి, పౌర్ణమికీ తిర గబెడుతుందిట. ఆ వియ్యంకుడు దొరి కిందే సందు అని, ఆ రెండు రోజులూ భార్యని కూతురింటికి పంపించి తన మానాన తను పూలరంగడిలా తిరుగుతా డుట."

"మా పార్వతీ దాని కోడలు పిచ్చి వియ్యపురాలితో సతమతం అవుతున్నారు. గట్టిగా ఏమైనా అందామంటే ఆ పిల్ల ఏమ నుకుంటుందోనని భయం. కోరి కొరివితో తల గోక్కున్నట్టు వుంది మా పని. 'మీ మనవడి విషయంలో జాగర్తగా వుండండి' అని పాపం మా పార్వతి ఓ ఇదైపో యింది" అంటూ వివరించింది బాలమ్మ.

ఉసూరుమంది శారద. ఈవిడతో ఇదో తలనెప్పి. ఏదైనా మంచి పనిచెయ్యాలని తలపెట్టగానే ఈవిడ తగుదునమ్మా అని తలదూర్చి ఏవో అపభ్రంశపు విషయా లన్నీ చెప్తుంది. అన్నీ చెడ్డ వార్తలు, భయంకరమైన ఉదాహరణలు. కథలు కథలుగా చెపుతుంది. వెతికి చూసినా ఏ ఒక్కటీ మంచి కబురు ఉండదు. లోలోన సణుక్కుని పైకి అత్తగారితో ఆ మాట అనే సింది, "శుభమా అని పిల్లాడి పెళ్లిమాట తలపెడితే ఏవిటా అపశకునం మాటలూ? "

"కీడెంచి మేలెంచమన్నట్లు, మీ మంచి గోరి ముందుగానే జాగర్తపడతారేమో అని చెప్తుంటే అదీ తప్పేనా? " తనని తాను సమర్థించుకుంది బాలమ్మ.

"ఆవిడ చెప్పిందీ నిజమే. సంబంధం మనకు నచ్చితే సరేననే ముందు వాళ్ళ గురించి బాగా తెలుసుకునే సరే అందాం!" అంటూ ఆ సమస్యని పరిష్కరించాడు పార్థసారథి.

"అవును కాస్త ఇరుగుపొరుగు వాళ్ళని అడిగినా చెప్తారు వాళ్ళ గురించి. ఆలస్యం ఎందుకు? వాడి ఫోటోలూ వివరాలూ అన్నీ మీకు అందజేస్తాను అన్నయ్య గారూ.. ఆపై భారం మీదే" అంది శారద.

కొడుకుని మంచి ఫొటోలు తీయించుకోమంది. ఇదుగో మాధవా అదుగో మాధవా అని వాయిదాలు వేసి పదిరోజుల తరువాత ఫొటోలు తీయించుకుని తల్లికిచ్చాడు సూర్యహా.

పంచమి బుధవారంనాడు ఫొటోలు, జాతకాలూ పార్థసారథికి అందజేసింది శారద.

దశమి సోమవారంనాడు ఆ వివరాలన్నీ పట్టుకువెళ్ళి నాలుగు మేరేజి బ్యూరోలలో రిజిస్టరు చేయించాడు పార్థసారథి.

ఓ వారం గడిచాక పార్థసారథికి ఫోన్ చేశాడు క్రిష్ణ, "ఏవిరా మరి ఏదో సాధించేస్తానని ప్రగల్భాలు పలికి ఫొటోలు పట్టుకెళ్ళావు. ఇంతవరకొక్కటీ బోణీ కాలేదు. ఏవీ సంబంధాలు? " అని అడిగాడు.

"వెనకటికి నీలాటి మహాతల్లి బిడ్డ కావాలని మొక్కి కడుపుపట్టుకు చూసుకుందిట. అలావుంది నీ వ్యవహారం. నువ్వు ఇలా ఫొటోలు ఇచ్చెయ్యగానే అలా వచ్చిపడిపోవు. కాస్త నిదానించు" అన్నాడు పార్థసారథి.

మరో పదిరోజులు గడిచాక ఒకరోజు పొద్దున పదిగంటలకి క్రిష్ణ ఇంట్లో ఫోన్ మోగింది. "అది క్రిష్ణగారి ఇల్లేనా? " అడిగింది అవతలికంఠం.

"అవునండీ" అన్నాడు క్రిష్ణ.

వెంటనే తనని పరిచయం చేసుకున్నాడు. "ఫలాని మేరేజ్ బ్యూరోలో మీ అబ్బాయి ఫొటో చూశాం. మీ సంబంధం మాకు నచ్చింది" అన్నాడు.

అమ్మాయి వివరాలు అడిగి, 'ఫొటో, జాతకం పంపించండి' అని తన అడ్రెస్ చెప్పాడు క్రిష్ణ.

ఫోన్ పెట్టేసి ఆ విషయం భార్యతో చెప్పాడు.

అప్పటికి నాల్రోజుల కిందటే ఒక తెల్ల కాయితాల పుస్తకం కొని సిద్ధంగా వుంచింది శారద. 'ఎవరి దగ్గర్నుండి ఫోను వచ్చినా ఇందులో వివరాలు రాయండి' అని చెప్పింది. క్రిష్ణాక్షయం అని రాసి ఆ సంబంధం వివరాలు రాశాడు క్రిష్ణ.

అది మొదలు రోజుకి ఒకటోరెండో ఫోన్లు వస్తూనే వున్నాయి. అందరివీ వివరాలు కనుక్కుని నచ్చకపోతే మర్యాదగా వద్దని చెప్తున్నాడు. నచ్చితే ఫొటో, జాతకం పంపించమంటున్నాడు. ఈ పద్ధతి బావుంది. గుమ్మం కదలకుండా వచ్చి పడుతున్నాయి సంబంధాలు అని సరదా పడ్డాడు.

ఆలా పదిరోజులు గడిచేసరికి అరడజను ఫొటోలు వచ్చి చేరాయి. ఎంతో

## శ్రీశ్రీ చతురోక్తులు

**తెలుగు జాతికి గర్వకారణమైన మహాకవి శ్రీశ్రీ. ఆయన కవిత్వం ఎంతోమందిని ప్రభావితం చేసి ప్రజా ఉద్యమాలవైపు నడిపించింది. వివిధ సందర్భాల్లో ఆయన విసిరిన చతురోక్తులు కొన్ని..**



### తూచడం ఎందుకు?

శ్రీశ్రీ మహాప్రస్థానం కావ్యానికి చలం రాసిన ముందుమాట సుప్రసిద్ధం. అందులో ఆయన తనవద్ద శ్రీశ్రీ కవిత్వాన్ని తూచే తూనికరాళ్లు లేవు అన్నారు. దానికి శ్రీశ్రీ, 'అసలు నా కవిత్వాన్ని మీరు తూచడం ఎందుకు? దాన్ని చదివి తరించి, పలవరించండి చాలు' అన్నారట!

ఆశతో ఎదురుచూసిన శారద ఆ ఫొటోలు చూసి నీరుగారిపోయింది.

"చిట్టిగాడు మంచి రంగు. మరి వాడి పక్కనుండే పిల్ల కనీసం వాడి రంగులో అయినా వుండాలా? అదీగాక ఏ పిల్ల మొహంలోనూ నేవళం లేదు" అంది నీరసంగా.

"ఇది మరీ బావుందే శారదా! వెనకటి రోజుల్లో అయితే ఆడపిల్లలు లక్షణంగా నీడపట్టున వుండేవాళ్ళు. స్కూలుకో, కాలేజీకో వెళ్ళినా ఏ రిక్షాలోనో వెళ్ళేవాళ్ళు. వారానికి ఒకసారి చక్కగా తలకి, ఒంటికి నూనె రాసి, పసుపూ, కచ్చూరాలు, బావంచాలు, తంగేడు పువ్వూ వేసి పట్టించిన సున్నిపిండితో నలుగుపెట్టి, కుంకుడుకాయతో తలంటి సాంబ్రాణి పొగ వేస్తే మెరుగుపెట్టిన బంగారంలా మెరిసిపోయే వాళ్ళు ఆడపిల్లలు.

మరి ఇప్పుడా పోషణ ఏది? అంత తీరిక, ఓపికా ఎవరికున్నాయి? దానికితోడు మగవాళ్ళతో సమానంగా ఎర్రటి ఎండలో స్కూటర్లమీద తిరుగుళ్ళూ, రాత్రింబగళ్ళూ చదువులూ, ఉద్యోగాలు. నలుపు కప్పు వేసిపోతున్నారు. ఉన్న రంగు కూడా వూడిపోతుంది.

ఇక నేవళం అంటావా? పదహారు పదిహేడేళ్ల పిల్ల మొహంలో వుండే లేతదనం పాతికేళ్ల పిల్లకి ఎక్కడినుంచి వస్తుంది? అసలైనా కొంతమంది ఫొటోలో కంటే విడిగా బావుంటారు.

మిగిలిన వివరాలన్నీ నచ్చితే ఓమారు వెళ్ళి చూసొస్తే సరి" అంది బాలమ్మ.

ఆవిడ అంతగా చెప్పినా సరిపుచ్చుకోలేకపోయింది శారద. ఫొటోలన్నీ తిప్పిపంపించేశారు. ఓ పది పదిహేనుమంది ఫొటోలు పంపించారు. తర్వాత ఫోన్లూ తగ్గిపోయాయి. రోజూ ఆశతో పోస్ట్ కోసం ఎదురుచూడడమే.

పార్థసారథికి ఆ మాట చెప్తే "అవునంతే. అలాగే వస్తాయి. ఆ తర్వాత ఆగిపోతాయి" అన్నాడు.

"అదేమిటి? పెళ్ళి కాకుండానే సంబంధాలు రావడం ఆగిపోతే ఎట్లారా? " ఆశ్చర్యంగా అడిగాడు క్రిష్ణ.

"వాటంతట అవి రాకపోతే మనం వెళ్ళి వెతుక్కుంటాం" చెప్పాడు.

"మనం వెళ్ళి వెతుక్కోవాలా? " క్రిష్ణ ఆశ్చర్యం.

"అవును. ఒక మంచి మ్యారేజ్ బ్యూరో వుంది. వాళ్ళు పెద్దగా ఫీజులవీ కూడా తీసుకోరు. ఇసక వేస్తే రాలకుండా వుంటారు జనాలు. అంతా పద్ధతిగా, పకడ్బందీగా వుంటుంది. వారంలో ఒక్క రోజు ఒక్కో రంగంలోనివారికి కేటాయిస్తారు. సోమవారం డాక్టర్లు, మంగళవారం బ్యాంకు ఉద్యోగస్థులు, లెక్చరర్లు వగైరా. బుధవారం సాఫ్ట్‌వేర్ ఇంజినీర్లు, గురువారం ఐ.ఎ.ఎస్. వంటి గొప్పవాళ్ళు, శుక్రవారం చిరుద్యోగులు, నిరుద్యోగులు. మనవాడు సాఫ్ట్‌వేర్ ఇంజినీరు కాబట్టి మనం బుధవారం వెళ్దాం" అన్నాడు.

శ్రోతలు నోరావలించారు.

"అంత తతంగం వుందా అన్నయ్యగారూ! నేనూ వస్తా" అంది శారద.

"వింటూంటే నమ్మశక్యం కాకుండా వుంది. అదేవిటో నేనూ చూస్తా!" అంది బాలమ్మ.

"అందరం ఒకేసారి కట్టగట్టుకుపోతే ఇబ్బంది అవుతుంది. వచ్చే బుధవారం నేనూ వీడూ వెళ్తాం. ఆ పైవారం వీడూ నువ్వూ వెళ్ళండి. ఆ తర్వాతి వారం మీ అత్తగార్ని తీసుకుని నువ్వు వెళ్ళచ్చు" అన్నాడు పార్థసారథి.

"ఏమిటి అన్ని వారాలు తిరగాలా? ఎందుకూరికే అన్నిసార్లు తిరగడం?

మొదటిసారి వెళ్ళినప్పుడే చూసి సెటిల్ చేసేసి వస్తే సరిపోదా? " ఆశ్చర్యంగా అడిగాడు క్రిష్ణ.

"ఎందుకు సరిపోదూ? కాకపోతే కుదరద్దూ. నీ మొహానికి చెప్పినా అర్థం అయి ఏడవదులే. అందుకే నేను చెప్పేది. కాస్త కళ్లు తెరిచి మన చుట్టుపక్కల ఏం జరుగుతోందో చూస్తే కాస్త లోకజ్ఞానం అలవడుతుంది అంటే వింటావా? పొద్దస్తమానం ఆ పిచ్చి వార్తలు చూస్తూ కూర్చుంటావు. దక్షిణాఫ్రికాలో వరదలొచ్చాయి, జపాన్‌లో అగ్నిపర్వతం బద్దలైంది అంటూ ఎక్కడ లేని విషయాలు ఏకరువు పెడతావు. పనికిరాని పరిజ్ఞానం అంటే ఇదే" అని మందలించి, "బుధవారం ఒంటిగంట కల్లా వెళ్దాం. రెడీగా వుండు" అని చెప్పి వెళ్ళిపోయాడు పార్థసారథి.

"వీడొహాడు! అసలు విషయం తప్పించి మిగిలిన సొల్లు కబుర్లన్నీ అరిటిపండు ఒల్చి చేతిలో పెట్టినట్లు చెప్తాడు" అని విసుక్కున్నాడు క్రిష్ణ.




బుధవారం రానే వచ్చింది. పన్నెండు కొట్టేసరికల్లా భర్తకి భోజనం పెట్టేసింది శారద. "ఇవాల్టికి ప్యాంటూ షర్టూ వద్దులేండి. వియ్యంకుడి హోదాలో వెళ్తున్నారు. సాంప్రదాయ దుస్తులు ధరిస్తే సలక్షణంగా వుంటుంది" అని చెప్పి అత్తాకోడలంచు పంచె కట్టించి, లాల్చీ తొడిగించింది. భుజంమీద ఉత్తరీయం వేసి, నుదుట చిన్న బొట్టు పెట్టింది. నాకే ముద్దొస్తున్నారు. ఇక అక్కడి ఆడపిల్లల తండ్రులందరూ మురిసిపోతారు" అంది.

కార్లో పార్థసారథి ఇంటికి బయలుదేరాడు క్రిష్ణ.

కారు హారను వినగానే వాకిట్లోకి వచ్చాడు పార్థసారథి. "లోపలికి రా! కాస్త కాఫీ తాగి వెళ్దాం" అన్నాడు.

కార్లోంచి దిగిన క్రిష్ణని చూసి "ఏవిట్రోయ్! ఈ అవతారం" అన్నాడు సంతోషంగా. గర్వంగా నవ్వాడు క్రిష్ణ.

"పెళ్ళి సంబంధం కోసం వెళ్తున్నారు కదా! ఇలా వెళ్తే బావుంటుంది దర్జాగా అని, శారదే బలవంతపెట్టి ఈ బట్టలు కట్టించిందిరా! మరి ఇహనించి నా హోదా పెరిగింది కదా.. మగపిల్లవాడి తండ్రిని మరి!" అన్నాడు.

పార్థసారథి ఏదో అనబోయి మానేసి జాలిగా నవ్వాడు. లోపలికి వెళ్ళి కాఫీ తాగి బయలుదేరారు. సందులూ గొందులూ తిరిగి గమ్యం చేరారు. అదో డెడ్ ఎండ్. ఆ చివరన వుంది ఈ మేరేజి బ్యూరో నిర్వహిస్తున్న ఇల్లు.

సందు మొదటినించే అంతా సందడిగా వుంది. ఇరువైపులా ఇళ్ళున్నాయి. గేటు ముందర 'వాహనములు నిలుపరాదు' అని ప్రతి ఇంటి గేటుమీదా స్పష్టంగా రాసి వున్నా అన్ని గేట్లముందూ కార్లు, స్కూటర్లు, బైక్‌లు నిలపబడి వున్నాయి. 'నన్నిక్కడ దింపేసి నువ్వు అక్కడెక్కడైనా కారు పార్క్ చేసుకురా!' అనేసి దిగిపోయాడు పార్థసారథి. అటు ఇటు తిరగ్గా తిరగ్గా పావుగంట తర్వాత స్థలం దొరికింది. కారు అక్కడ పెట్టి వచ్చాడు క్రిష్ణ. ఎండ తీక్షణంగానే వుంది.

సోడాబండీలు, ముంతకిందిపప్పు అమ్మే

వాళ్ళు. ఐస్‌క్రీమ్ బండీ, చెరుకురసం బండీ, అక్కడంతా హడావుడిగా వుంది. ఆ ఇంటి గేటుముందు లెక్కలేనన్ని చెప్పుల జతలు. గేటు ముందరా, లోపలా, పైకి వెళ్ళే మెట్లమీద, పైన కారిడార్లోనూ నిండి పోయి వున్నారు జనం.

"ఏమిటో చాలామంది వున్నారు. ఏదైనా శుభకార్యం జరుగుతోందేమో! పోనీ మనం వెళ్ళి మరోసారి వద్దామా?" అన్నాడు క్రిష్ణ.

ఏదో చెప్పబోయి మానేసి జాలిగా చూశాడు పార్థసారథి.

జనంలోంచి ఈదుకుంటూ అతికష్టం మీద మేడ మీదికి చేరుకున్నారు.

క్రిష్ణకి చిరాకొచ్చేసింది. 'ఈ జనం హడా ఏవండీ రాజాగారూ ఇంకా కుదర్లేదా! అరే రాధాక్రిష్ణగారూ.. మొన్నేదో సెటిల్ అయి నట్లు చెప్పారు. మళ్ళీ వచ్చారేం?' అంటూ అక్కడ ఎవరెవరినో పలకరిస్తున్నాడు. నిమ్మకు నీరెత్తినట్లు కుశాలుగా వున్న మిత్రుడిని చూసి చిర్రెత్తుకొచ్చింది క్రిష్ణకి.

మెల్లిగా అతడి భుజం తట్టాడు. "ఈ కబుర్లు చాల్లే. మనం ఏం చెయ్యాలి?" అన్నాడు మెల్లిగా.

"ముందు ఫారం నింపి నమోదు చేయించుకోవాలి" చెప్పాడు పార్థసారథి.

"మరైతే పద. ఆ ఫారం ఎక్కడిస్తారు" తొందరపెట్టాడు.

"అదుగో అక్కడ" అంటూ చూపిం చాడు. అక్కడ గుంపుగా వున్నారు జనం.



విడి. దానికితోడు అలవాటు కాని వస్త్రధారణ. శారదకి తన మాటే తప్ప ఎదుటివాడి గొడవ పట్టదు. వెళ్ళేచోట ఏదో గొప్పగా మొగుడికి పూర్ణకుంభంతో స్వాగతం పలుకుతారనుకుని ఇదుగో ఇలా పంచెకట్టి పంపించింది. వద్దంటే విన్లేదు. తనకేం హాయిగా వుంది. నేనే చస్తున్నాను సర్దుకోలేక' అని విసుక్కున్నాడు.

పార్థసారథి అక్కడ పాతకాపే. 'ఆ! 'మరి పద వెళ్దాం' అంటూ బయలుదే రాడు క్రిష్ణ. ఇద్దరూ హాల్లోకి వెళ్ళారు. హాలు పెద్దదే. కాకపోతే అంతమంది జనం వుండేసరికి కిక్కిరిసిపోయింది. కింద నేలమీద చాపలు పరిచి వున్నాయి. వాటిమీద అంతా కూర్చుని వున్నారు. అందరి చేతుల్లోనూ ఫైళ్ళు. మరోపక్క గోడమీద నోటీసులు రాసే బోర్డు తగి లించి వుంది. దానిమీద కొన్ని వివరాలు రాసి వున్నాయి.

5"10- అమెరికా, సాఫ్ట్‌వేర్ ఇంజనీరు,

ఎనిమిదివేల డాలర్లు.

6"2 అమెరికా, సాఫ్ట్‌వేర్ ఇంజనీరు, పది వేల డాలర్లు అంటూ వివరాలు రాసి వున్నాయి.

"ఏమిట్రా అవి.. రైళ్ళ రాకపోకల లాగా రాశారు? " కుతూహలంగా అడిగాడు క్రిష్ణ.

"పెళ్ళికోసం నెలరోజులు సెలవు మీద వచ్చిన పెళ్ళికొడుకుల వివరాలు. సమయం అట్టేలేదు కాబట్టి వీళ్ళని బతిమాలుకుంటే ప్రత్యేకంగా అలా బోర్డుమీద రాసి యుద్ధ ప్రాతిపదికన సంబంధాలు చూస్తారు" వివరించాడు పార్ధసారథి. వింతగా చూశాడు క్రిష్ణ.

అంతలోనే అక్కడికి ఒకావిడ వచ్చింది. అంతా గౌరవంగా నమస్కరించారు. ఆవిడే ఈ బ్యూరో నడుపుతున్నది అన్నాడు పార్ధసారథి. గద్వాల్ చీరె కట్టుకుని హుందాగా వుంది. మెళ్ళో కళ్ళజోడు. చేతులో కాయితాలూ, పెన్నూ.

ఒకాయనా, ఆయన భార్య జనాన్ని తప్పించుకుని ఆవిడ దగ్గరకు వెళ్లారు.

"మేడమ్, ఇంకా ఏం దొరకలేదు. ఈ నెలఖారుకే వాడు వెళ్ళిపోతాడు. ఎలా? " అన్నారు దీనంగా. వాళ్లని చూస్తే ఎటువంటి కరుకు గుండెవాడికైనా కడుపు తరుక్కుపోతుంది.

"చూద్దాం.. నా ప్రయత్నం నేను చేస్తూనే



## కొత్తగాలి...

**వరాలు**
**ఇస్తున్నట్టే ఇస్తున్నారు కానీ..**
**అమ్ముకుంటున్నారు**
**ఇదో 'వరవిక్రయం' మరి!**

*–కలియుగం హుమయూన్ సంఘీర్,*
*హైదరాబాద్*

వున్నాను" అనేసి కంఠం పెంచి "హలో వింటున్నారా! భరద్వాజ గోత్రం. నియోగులు, శాఖ పట్టింపులేదు. అమెరికా పెళ్ళికొడుకు. ఆరడుగులు, గ్రీన్ కార్డుంది. కాలిఫోర్నియా జీతం. అర్జెంటుగా పెళ్ళికూతురు కావాలి. ఎవరైనా వున్నారా? ఈ నెలఖారుకి అబ్బాయి అమెరికా వెళ్ళిపోతున్నాడు. ఎవర్కైనా ఆసక్తి వుంటే చెప్పండి' ' ఆమె సన్నగా వున్నా అన్ని గదుల్లో, బయటనుంచున్న వాళ్లకీ వినించేలా అరిచింది. గతంలో వేలం పాటల్లో పాల్గొనేదేమో.

అందరూ విన్నారు గానీ ఎవరూ మాక్కావాలని లేచి రాలేదు. ఆ పిల్లాడి తల్లిదండ్రులు ఆశగా చూశారు నలుదిక్కులా.

ఇంతలో ఇంకెవరో వచ్చి వాళ్లని పక్కకి తోసేసి ఆవిడ దగ్గరికి వెళ్ళి ఏదో చెప్పారు. వాళ్లూ పాపం దీనంగానే వున్నారు.

"ఆరామ ద్రావిడుల అమ్మాయి. శాఖ పట్టింపు వుంది. అమ్మాయి ఆస్ట్రేలియాలో వుంది. ఆగస్టుకి వస్తుంది" అని అరుస్తూ పక్కగదిలోకి వెళ్ళిపోయింది ఆవిడ.

నోరావలించి వుండిపోయాడు క్రిష్ణ.

'పదపద, ఫాం నింపుదాం' అని కాస్త పక్కకి తీసికెళ్ళాడు పార్థసారథి.

ఫాం చాలా పకడ్బందీగా వుంది. అబ్బాయి వివరాలు, కుటుంబం వివరాలు, ఒపక్క.. వారికి ఎటువంటి అమ్మాయి కావాలో మరోపక్క రాయాలి. అందులో వున్న ఖాళీ స్థలాలు అన్నీ నింపి ఫొటో అంటించి, జాతకం జతపరిచి మళ్ళీ బల్ల దగ్గరికి వెళ్ళి అక్కడ అందించారు. వాళ్ళు ఒక నెంబరు ఇచ్చారు.

"వెళ్ళండి.. వెళ్ళి ఫైల్స్ చూసుకోండి" అన్నారు. 'హమ్మయ్య ఒక ఘట్టం ముగిసింది' అనుకున్నారు.

ఈ కార్యక్రమం అంతా అయ్యేసరికి రెండున్నర దాటింది. 'పద పద.. మూడు కావస్తోంది. మళ్ళీ నాలుగున్నర దాటితే వెళ్ళిపోవాలి. ఆ తర్వాత వుండనివ్వరు' అంటూ పక్కగదిలోకి లాక్కెళ్ళాడు పార్థసారథి.

అది చాలా చిన్నగది. పదీ బై పదడుగులుంటుందేమో. అందులోనే ఒక మూల పైకి వెళ్ళేందుకు మెట్లున్నాయి. మరో మూల బల్ల కుర్చీ వేసుకుని కూర్చుని వుంది ఒకావిడ. కింద ఇరుక్కుని కూర్చున్నారు అందరూ. మెట్లు కూడా సగందాకా నిండిపోయాయి. ఊపిరాడలేదు క్రిష్ణకి.

"ఇక్కడ మరీ ఇరుగ్గా వుందిరా! దీని కంటే ఆ హాలు కాస్త మెరుగ్గా వుంది. అక్కడ కూర్చుందాం" అన్నాడు.

"అక్కడ వరుడి కోసం వచ్చినవాళ్ళు కూర్చుంటారు. మనం ఇక్కడే" అన్నాడు పార్థసారథి.

"ఏవిటండీ. ఏం కావాలి? " హుంకరించింది అక్కడ కూర్చున్నావిడ.

"మా అబ్బాయికి సంబంధం కోసం!" చెప్పాడు పార్థసారథి.

"మరామాట చెప్పాలి గానీ అలా దారికడ్డంగా నిలబడిపోతారేం? రిజిస్టర్ చేయించుకున్నారా! నెంబరెంత? " అంది.

క్రిష్ణకి కోపం వచ్చింది. "ఏవమ్మోయ్ అలా కసురుతావేం? " అనబోయాడు. పార్థసారథి మాత్రం నెంబరు చెప్పేసి

మాకు ఎమ్.సి.ఎ., ఇంజనీరింగ్, ఎమ్.బి.ఎ. చేసిన అమ్మాయిలు, ఎనభై రెండు తర్వాత పుట్టిన వాళ్ళ ఫైలు ఇవ్వండి" అన్నాడు.

ఆవిడ అటూ ఇటూ వెతికి అలమార్లోంచి ఫైల్ తీసి ఇచ్చింది. "ఇక్కడ ఇద్దరే కూర్చోవాలి. మిగిలినవాళ్ళు బయటికి వెళ్ళండి" మళ్ళీ హూంకరించింది.

"ఆ బాధ లేదు ఇద్దరమే వచ్చాం!" చెప్పాడు సారథి.

ఆ ఫైలు చేత్తో పుచ్చుకుని చోటుకోసం వెతకసాగారు ఇద్దరూ. వీళ్లని చూసి పై మెట్టుమీద కూర్చున్న ఆడవాళ్ళిద్దరు పిలిచారు. "మేము ఇంకో మెట్టుపైన కూర్చుంటాం. ఇలా రండి!" అన్నారు పైమెట్టుమీదికి జరుగుతూ.

మెట్ల మీదున్న అందర్నీ తప్పుకుంటూ ఆరేడు మెట్లు ఎక్కి అక్కడ కూర్చుని 'హమ్మయ్య' అనుకున్నారిద్దరూ. 'మనం బయలుదేరిన వేళా విశేషం మంచిది. చోటు దొరికింది' ఆనందపడ్డాడు సారథి.

ఫైలు క్రిష్ణకిచ్చి తను తెల్లకాయితాల పుస్తకం తెరచి పెన్ తీసుకుని సిద్ధంగా కూర్చున్నాడు. "ఒరే! ఒక్కో ఫోటో చూడు. నీకు నచ్చిన సంబంధం కనిపిస్తే వివరాలు నోట్ చేసుకుంటూ పోవాలి. ఇంటికెళ్ళి ఫోన్‌లు చేసుకోవచ్చు" అంటూ కర్తవ్యోన్ముఖుడిని చేశాడు.

ఫైల్ తెరిచాడు క్రిష్ణ. అయిదు నిముషాల్లో ఫైలు చూడ్డం ముగించాడు. "ప్చ్ ఇందులో ఎవరూ అంతగా నచ్చలేదురా" అన్నాడు.

"ఏవిటి అలా తిరగేసి పడేస్తే ఎలారా? నిదానంగా చూడు" అన్నాడు సారథి.

"ఏముంది చూడ్డానికి? మనవాడు చూడబోతే బాగా పొడుగు. వీళ్ళంతా పొట్టిగా వున్నారు. ముందు ఈడూ జోడూ కుదిరితే కదా మిగిలిన వివరాల్లోకి వెళ్లేది. అయినా సరే ఊరికే ఇలా చూసి

## కొత్తగాలి...

అండంలో
బ్రహ్మాండం
బోన్సాయి
మరుగుజ్జు వృక్షం!

—జోరాశర్మ, రాజమండ్రి

అలా ఇచ్చేస్తే బావుండదు. మరో అయిదు నిముషాలు చూడు. తర్వాత ఇది ఇచ్చి ఇంకో ఫైలు తీసుకుందాం!" మెల్లిగా చెప్పాడు సారథి.

విసుగ్గా మళ్ళీ ఫైల్ తిరగెయ్యడం మొదలుపెట్టాడు క్రిష్ణ.

వెనకనించి "ఇష్! ఇష్!" అంటూ పిలిచింది పైమెట్టుమీద కూర్చున్నావిడ. ఎవరి నోలే అని పట్టించుకోలేదు.

"ఇష్.. ఇష్! మిమ్మల్నే" మళ్ళీ పిలిచింది. తల వెనక్కి తిప్పబోతుంటే వారించింది. "అలా వెనక్కి తిరిగి చూడకండి! నే చెప్పేది వినండి!" అంది గుసగుసగా.

అదిరిపడ్డాడు క్రిష్ణ. ఏవిటీ వ్యవహారం. మెల్లిగా తలతిప్పి మిత్రుడి వంక చూశాడు. ఆయన విన్నాడో లేదోగాని చుక్కలాట ఆడుకుంటున్నాడు పుస్తకం మీద.

"వినిపించిందా!" మళ్ళీ అడిగిందా వెనకావిడ. గుసగుసగానే తలాడించాడు క్రిష్ణ.

"మీ దగ్గరున్న ఫైలు ఇలా ఇవ్వండి. నా దగ్గరుంది మీకిస్తాను" మళ్ళీ గుసగుసలాడింది.

ఫక్కున నవ్వేశాడు క్రిష్ణ. "భలేవారే. ఈ మాత్రం దానికి రహస్యంగా అడగడం ఎందుకండీ. ఇదుగో తీసుకోండి" అంటూ వెనక్కి తిరిగి తన చేతిలోని ఫైలు అందించాడు.

అప్పటిదాకా 'ఇష్ ఇష్' అని గుసగుసలాడి విసిగించిన ఆవిడ, ఏమీ ఎరగ

నట్లు ఎటో చూస్తోంది.

ఆ బల్లదగ్గర కూర్చున్నావిడ హూంక రించింది. "ఏవిటండీ.. ఏం చేస్తున్నారు? "

"ఏం లేదండీ. పాపం ఈవిడ ఫైలు అడిగితే ఇస్తున్నాను" తన గొప్పతనానికి తానే ఆనందపడిపోతూ భుజం మీదున్న జరీ ఉత్తరీయం సర్దుకుంటూ గర్వంగా చెప్పాడు.

గయ్‌మంది ఆవిడ. "ఇవ్వడానికి మీరెవరూ? తీసుకోడానికి ఆవిడ ఎవరూ? మీకు మీరే ఫైళ్ళు మార్చుకుంటూంటే మేమెందుకూ ఇక్కడ? ఎన్నిసార్లు చెప్పాలండీ? చెప్పి చెప్పి మా నోరు పడిపోవడమే తప్ప మీకు చీమకుట్టినట్లైనా లేదు. ఇదేమైనా మర్యాదగా వుందా! ఏమైనా అంటే పౌరుషాలు పొడుచుకొస్తాయి" స్టూడెంటు పరీక్షలో కాపీ కొడుతుంటే పట్టుకున్న ఎగ్జామినర్‌లాగా అడిగింది. తెల్లమొహం వేశాడు క్రిష్ణ. "ఏం.. ఫైలు ఇవ్వడం తప్పా? " అయోమయంగా అడిగాడు.

"తప్పా! తప్పున్నరా? " అందావిడ మరింత గొంతు పెంచి. క్రిష్ణని చూసి జాలేసింది ఆ పక్కన కూర్చున్నాయనకి.

"పాపం! ఇక్కడి పద్ధతులు తెలియవు కాబోలు మేడమ్. వదిలెయ్యండి" అని ఆవిడకి చెప్పి, "చూడండి సార్.. ఇక్కడ ఒక్కసారికి రెండు ఫైళ్ళు మాత్రమే చూసుకోనిస్తారు. వాళ్ళిస్తేనే తీసుకోవాలి. మన్లో మనం మార్చుకోకూడదు" అని తెలియజెప్పాడు క్రిష్ణకి.

"తెలియకపోతే తెలుసుకుని మరీ రావాలి!" అందావిడ ఆగ్రహంగా.

క్రిష్ణకి కోపం వచ్చింది విసురుగా లేచాడు "బుద్ధి గడ్డితిని మీ దగ్గరకు వచ్చాను. ఇక జన్మలో ఇలాటి వెధవ పని చెయ్యను. నా కొడుక్కి పెళ్ళి కాకపోతే సన్యాసుల్లో కలిసిపోతాడు" అని విసురుగా ఉత్తరీయం దులిపి భుజాన వేసుకుని పెద రాయుడిలాగా వెళ్ళిపోయాడు.




**వా**కిట్లో కారాగిన శబ్దం విని పరుగున వచ్చింది శారద "ఏమైంది కాయా? పండా? " అంది ఆత్రంగా.

"నా శ్రాద్ధం అయింది. నీకు ముందే చెప్పాను.. ఆ పార్థసారథిగాడి మాట సాయం మనకి అచ్చిరాదే అని. విన్నావా! వాడికి బాధ్యత అప్పగించావు. తగుదునమ్మా అని తీసుకోపోయాడు ఓ మ్యారేజి బ్యూరోకి. అక్కడో మహాతల్లి వుంది. సూర్యకాంతాన్ని, ఛాయాదేవినీ చంపి పుట్టింది. మాట మాట్లాడితే ఇంత నోరేసుకుని అరుస్తుంది. నేనేం పిల్లముండా వాడినా అల్లరిచేసి చీవాట్లు తినడానికి" అన్నాడు ఆగ్రహంగా.

ఏమీ అంతుపట్టలేదు శారదకి. "అసలేమైంది? అన్నయ్యగారేరి? " అడిగింది.

"ఆ.. ఆ.. వెధవ పేరు ఎత్తకు. వాడినక్కడే వదిలేసి వచ్చాను. ఇక వాడికీ నాకు రాం రాం. నా గడపలో కాలుపెడితే కాళ్ళు విరగ్గొడతా" అన్నాడు.

మరునాడు మధ్యాహ్నం పదకొండు గంటలకి, పార్థసారథి హాల్లో కూర్చుని వున్నాడు. ఎదురుగా క్రిష్ణ, అతని పక్కన శారద. నిన్నరాత్రి కాళ్లు విరగ్గొడతానన్నా.. తెల్లారి గుమ్మంలోకి వచ్చిన మిత్రుడిని అవమానించడానికి మనసొప్పలేదు. అదీ

గాక అప్పుడున్న ఆవేశం ఇప్పుడు లేదు. పలకరించలేదు. ముభావంగానే వున్నాడు. పార్థసారథీ మిత్రుడితో మాట్లాడలేదు. తీరిగ్గా శారదతోనే సంభాషణ ప్రారంభించాడు.

"అప్పుడంటే ఉద్యోగంలో వున్నాడు. వాళ్ళ పిలక వీడి చేతుల్లో వుంది కాబట్టి వీడు ఢాం.. ఢాం అంటే కింది ఉద్యోగులు భయపడేవాళ్ళు. అలా అందరి దగ్గరా జరగాలంటే ఎలా గమ్మా? అవసరం మనదా? వాళ్ళదా? అందులో ఈ సంస్థ వాళ్లు రూపాయి పుచ్చుకోరు. కేవలం పరోప కారం చేద్దామనే ఉద్దేశ్యంతో ఈ మేరేజి బ్యూరో స్థాపించుకున్నారు. వాళ్ళు ఏవో రూల్సు పెట్టుకున్నారు. మన పనికోసం వెళ్లినప్పుడు వాళ్ళు మాట అన్నా పడాలి.. తప్పదుమరి!" అన్నాడు.

"అవునన్నయ్యగారూ! మరి పాపం తెల్లారి లేస్తే మన్లాంటి వాళ్లు సవాలక్ష మంది వెళ్తారు వాళ్ళ దగ్గరికి. అంద రినీ ఆ మాత్రం అదుపాజ్ఞల్లో వుంచక పోతే వాళ్ళను అలుసు చేసి పారె య్యరూ? "

ఏకీభవించింది శారద.

"అదీ తెలివిగల వాళ్ళ లక్షణం. ఎలా గైనా నువ్వు సూక్ష్మగ్రాహివి. వీడి బదులు నువ్వొచ్చివుంటే బావుండేది అన్నాడు పార్థ సారథి!

ఇదంతా వింటూన్న క్రిష్ణకి కోపం వచ్చింది. "ఈ రూల్సూ పద్ధతులూ నిన్న అక్కడికి వెళ్ళేటప్పుడు చెప్పి ఏడవచ్చుగా. అప్పుడేమో అమెరికాలో ఆర్థిక మాంద్యం, ఫిలిప్పీన్సు దీవుల్లో అకాలవర్షం వంటి పిచ్చి విషయాలన్నీ మాట్లాడావు" కసురు కున్నాడు.

"ఎన్నని చెప్పేడవను? అంటే ఉడుక్కుం టావుగానీ.. ఆ ఫైమెట్టు ఆవిడ రహ స్యంగా అడిగినప్పుడైనా బుర్రపని చెయ్య

## కృష్ణశాస్త్రిపై శ్రీశ్రీ చెణుకులు

ఓసారి ఆలిండియా రేడియో ఏర్పాటు చేసిన కవిసమ్మేళనానికి అందరూ సకాలానికి వచ్చారుకాని, కృష్ణశాస్త్రిగారు యథావిధిగా ఆలస్యంగా వచ్చారు. దీంతో శ్రీశ్రీ 'సకాలానికి రావడం శాస్త్రీయం.. రాకపోవడం కృష్ణ శాస్త్రీయం' అన్నారు.

అదేసందర్భంగా కృష్ణశాస్త్రి 'ఏమర్రా



మీరంతా కొత్త రచనలు రాసుకొచ్చారా? నేనేం రాయలేదులే? ' అన్నారు.

దానికి శ్రీశ్రీ వెంటనే, 'రాయకున్నా మీరు రాయని భాస్కరుడిలాగున్నారు' అని ఉపమా నించారు.

లేదా? నీ మూలాన పాపం ఆవిడకీ అక్షిం తలు పడ్డాయి. 'ఆ రూపురేఖలు, వస్త్రధా రణా చూసి కాస్త లోకజ్ఞానం కలిగిన మని షేమో అనుకున్నాను. లేకపోతే మిమ్మ ల్నైనా అడిగేదాన్ని అన్యాయంగా అల్లరై పోయాను' అని పాపం చాలా ఇదైపో యింది" చెప్పాడు పార్థసారథి.

తలవంచుకుని తనలోతనే గొణుక్కు న్నాడు క్రిష్ణ.

మరి కాసేపు కూర్చుని లేచాడు పార్థసా రథి. "నేను ఊరు వెళ్తున్నా. వారంలో వస్తా" అన్నాడు.

ఆ మరునాడు తెల్లవారేసరికి ఒక ఫోన్ వచ్చింది క్రిష్ణకి. "అది క్రిష్ణమోహన్ గారి

# మనసున ఉన్నదీ...



★ సెప్టెంబరు చతుర నవల 'అనిర్వచనీయం' అనేక రకాలుగా చర్చనీయాంశం. జ్ఞానపీఠాలులో పరిచయాలు కూడా ఆసక్తికరంగా ఉన్నాయి. మెదడుకు పదును పెట్టే 'కాప్షన్ మీదే' ద్వారా శ్రీధర్ కార్టూన్ అందించడం చాలా బాగుంది. అపార్ట్‌మెంటాలజీ ఆసక్తికరంగా సాగుతోంది.

– కామేశ్వరరావు, హైదరాబాద్

★ చతుర నవల 'అనిర్వచనీయం' చాలా చాలా నచ్చింది. అఖిల్‌లాంటి వ్యక్తులు జీవితభాగస్వాములైతే దాంపత్యంలో ఎలాంటి తగాదాలు, విడాకుల సమస్యలు తలెత్తవు. ఎన్నో కలలు, ఆశలు, ఆశయాలతో పెరిగే అమ్మాయిల జీవితాలు పెళ్లైన తర్వాత చాలా సంఘర్షణకు లోనవుతాయి. ఆడపడుచుల జీవిత సమస్యలను చక్కగా ఆవిష్కరించిన రచయిత్రికి కృతజ్ఞతలు. ఇక కొత్తగాలి కవితలు చాలా బాగా ఆకట్టుకుంటున్నాయి.

–కృష్ణవేణి,
హిందూపురం, అనంతపురం జిల్లా

★ విజయరాణి 'అనిర్వచనీయం' నవల ఎక్కడా విసుగు కల్గించకుండా సాఫీగా చదివించింది. స్నేహానికి ఎక్కువ ప్రాధాన్యమిస్తూనే ముఖ్యంగా స్త్రీలపై జరిగే అన్యాయాలను అతి చక్కగా వర్ణించిన రచయిత్రి ప్రశంస పాత్రురాలు. ఇక అపార్ట్‌మెంటాలజీలో లై డిటెక్టరు ప్రహసనం కడుపుబ్బ నవ్విస్తోంది. హ్యాట్స్ ఆఫ్ టు యర్రంశెట్టి.

–రాజేశ్వరి, నెల్లూరు.

★ సెప్టెంబరు చతురలో అనిర్వచనీయం నవల బాగుంది. కొత్తగాలులు బాగున్నాయి. అరుంధతి కథలో లోకేష్‌లో కల్గిన మార్పు ఆకట్టుకుంది. జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత విష్ణుడే పరిచయం నచ్చింది. చివరి కవర్‌లో ఇచ్చిన ప్రపంచ నలుమూలలోని సైకత శిల్ప సోయగాలు విపరీతంగా ఆకర్షించాయి. కాప్షన్ మీదేపై వస్తున్న వ్యాఖ్యలు సరదాగా ఆకట్టుకుంటున్నాయి.

–అనిల్‌కుమార్,
కొత్తగూడెం, ఖమ్మం



★ ఈసారి చతుర నవల పేరుకు తగ్గట్టుగా నిజంగా అనిర్వచనీయమే. విజయరాణి మంచి ఇతివృత్తాన్ని గొప్పగా మలుచుకుంటూ పోయారు. 'ఇడ్లీ దోశ..'లో కాజల్ చెప్పిన ఆరోగ్య, సౌందర్య రహస్యాలు బాగున్నాయి. అపార్ట్‌మెంటాలజీలో 'లై డిటెక్టర్' ఇంటిల్లిపాదినీ బాగా నవ్వించింది.

–నాని, సికింద్రాబాద్

★ ఈసారి చతురలో వచ్చిన నవల విపరీతంగా నచ్చింది. అడుగడుగునా స్త్రీలకు సమాజంలో ఎదురయ్యే సమస్యలను రచయిత్రి ఎంతో ఆర్ద్రంగా వర్ణించారు. అలాగే నేడు సమాజసేవ పేరిట సంఘానికి హానిచేస్తూ పెద్దమనుషులుగా కొందరు ఎలా చలామణి అవుతున్నారో బాగా చూపించారు. ఈ నవలను చదివిన తర్వాత చాలా గొప్ప అనుభూతి కలిగింది. ఇక శ్రామిక వర్గ పక్షపాతి విష్ణుడే గురించి జ్ఞానపీఠాలులో పరిచయం చాలా బాగుంది. మంచి మంచి నవలలు, శీర్షికలు అందిస్తున్న చతురకు అభినందనలు.

–మోమిన్,
తణుకు, పశ్చిమగోదావరి జిల్లా

★ కొత్తగాలులు, ట్యాంక్‌బండ్ కథలు, జ్ఞానపీఠాలు, సాహితీవేత్తల చతురోక్తులు, కాప్షన్ మీదే... ఇవన్నీ చాలా బాగుంటున్నాయి. ప్రతి నెలా మేగజైన్‌కోసం ఎదురు చూస్తుంటాం.

–సోనియాసుమన్, బెంగళూరు


చిరునామా: మనసున ఉన్నదీ... సంపాదకుడు,
చతుర, ఈనాడు కాంపౌండ్,
సోమాజిగూడ, హైదరాబాద్ –500 082
ఈ మెయిల్ చిరునామా:
chatura@eenadu.net

ఇల్లేనాండీ!" అడిగారు.

"అవునండి. నేనే మాట్లాడుతున్నాను" సమాధానం చెప్పాడు.

"అయ్యా నా పేరు సాంబయ్య. గవర్న మెంటులో చిన్న ఉద్యోగం చేసి రిటైర్ అయ్యాను. వ్యాపార దృష్టితో కాకుండా పరులకు ఉచితంగా సహాయ పడాలని పెళ్లి సంబంధాలు చూడటం వ్యాపకంగా పెట్టుకున్నాను. మీరు సరేనంటే నేరుగా మీ ఇంటికి వచ్చి మాట్లాడతాను" అన్నాడు.

వెతకబోయిన తీగ కాలికి దొరికినట్లు అయింది క్రిష్ణకి. "అయ్యో తప్పకుండా రండి. మేమూ మా అబ్బాయి పెళ్లి చెయ్యాలనే ఆలోచనలో వున్నాం" అని తన అడ్రెస్ చెప్పాడు.

"మరో గంటలో వస్తాను" అన్నాడా యన.

వెంటనే శారదని పిల్చాడు క్రిష్ణ. "ఒకా యన వస్తున్నాడు. నువ్వు నీ పనులన్నీ తెముల్చుకుని కూర్చో ఆయనతో మాట్లా డుతున్నప్పుడు నువ్వు పక్కనే వుంటే నాకు సుఖం. లేకపోతే తర్వాత ఆయనేమ న్నాడు? మీరేమన్నారూ? అంటూ భేతాళ ప్రశ్నలు వేసి చంపుకు తింటావ్" అన్నాడు.

అలాగే అంది శారద. గబగబ వంట చేసేసి ఇస్త్రీ చీరెకట్టుకుని కూర్చుంది. ఇదంతా వింటూ వున్న బాలమ్మ కూడా పూజా పునస్కారం ముగించి సిద్ధంగా కూర్చుంది. సూర్యహో తయారై ఆఫీసుకి వెళ్తుంటే ఎదురయ్యాడు సాంబయ్య.

ఇంట్లోకి రాగానే "ఆ అబ్బాయా.. పెళ్లి కొడుకు? చూడముచ్చటగా మహారాజులా వున్నాడు. అటువంటి కొడుక్కి తండ్రి కావడం మీ అదృష్టం" అన్నాడు మెచ్చుకో లుగా.

ఆయనవంక చూశారు అందరూ. చక్కగా ఇస్త్రీ చేసిన ఖద్దరు పంచె, ఖద్దరు చొక్కా పైన కండువా. నుదుట విభూతి రేఖలు. కుంకుమ బొట్టు చూడగానే గౌరవం కలుగుతుంది ఎవర్కైనా!

"కూర్చోండి" అని మర్యాద చేశారు. మంచి నీళ్ళూ, కాఫీ అందించింది శారద.

"కాఫీ అమృతంలా ఉందమ్మా" అని మెచ్చుకున్నాడాయన.

"మా ఫోన్ నెంబరెవరిచ్చారు మీకు? మా గురించి మీకెలా తెలిసింది? ఎవరు చెప్పారు? " అడిగాడు క్రిష్ణ.

"అయ్యో ఒకరు చెప్పాలా? నిన్న మీ దుస్థితి చూసి నాకు కడుపు చెరువు అయి పోయిందంటే నమ్మండి" అన్నాడు.

క్రిష్ణకి పుండుమీద కారం చల్లినట్లు అని పించింది. "నిన్న మీరు అక్కడే వున్నారా? " సంకోచంగా అడిగాడు.

"ఆ! ఉన్నాను. మీలాంటి వారికి జరగ వలసిన అవమానమేనా అది? మీకేం తక్కువ? ఇకపోతే మీ అబ్బాయికి కన్నొం కరా? కాలొంకరా? దర్జాగా కాలుమీద కాలువేసుకుని కూర్చోవలసిన మిమ్మల్ని పట్టుకుని ఆవిడ అన్నేసి మాటలం టుందా? "

క్రిష్ణ మొహం పెంకులా మాడిపో యింది. అది గమనించింది శారద.

"వాళ్ళు డబ్బు తీసుకోకుండా పనిచేస్తా రట కదా. అందుకని అంత కచ్చితంగా వుంటారుట. అంతకుమించి ఈయన మీద చులకన భావం ఏమీ లేదుటలెండి"

**కొత్తగాలి...**

**విత్తనం**
**ఉగ్రరూపమే**
**వృక్షం**

– ఏవీఆర్ మూర్తి,
విశాఖపట్నం

## కొత్తగాలి...

**నిప్పూ కాదు**
**ఉప్పూ కాదు**
**రాజకీయం**
**స్విస్ బ్యాంక్**

*-వి.సూర్యారావు, అనకాపల్లి, విశాఖ జిల్లా*

అంది.

"డబ్బు తీసుకోనంత మాత్రాన ఎద్దంత గొంతు పెట్టుకుని అరుస్తానంటే ఎలా చెప్పండి? ఆ మాటకి వస్తే నేనూ డబ్బు తీసుకోను. మరి నేను అరుస్తున్నానా? ఏదో సాటివారికి చేతనైన సహాయం చెయ్యాలనే ఆలోచనతోనే మీ వంటి మర్యాదస్తుల వివరాలు సేకరించి వాళ్ళిం టికే వెళ్ళి సహాయం చేస్తాను. ఇదుగోండి దారి ఖర్చులకు వుంచుకోండి- అని ఓ వంద చేతిలో పెడితే తీసుకుంటానే తప్పించి చెయ్యి జాపి నయాపైసా అ డగను" చెప్పాడు సాంబయ్య.

"ఏమోనండీ, నిన్న ఆ మేరేజి బ్యూరోకి వెళ్ళొచ్చాక నాకు విరక్తి పుట్టింది" చెప్పాడు క్రిష్ణ.

"అయ్యో మీకేవిటండీ! ఎవర్కైనా విరక్తి పుడుతుంది. చేపల బజారులాగా వుంటుంది తప్పించి ఓ మంచీ మర్యాదా వుండవుకదా! నిన్న మిమ్మల్ని అక్కడ చూసి అయ్యో పాపం అనిపించింది. అందుకే అతికష్టం మీద మీ వివరాలు సేకరించి మీకు ఫోన్ చేశాను" అన్నాడు.

"ఇంతకీ మీరు పెళ్ళి సంబంధాలు కుదు రుస్తారా? " అంది శారద.

"కుదర్చడానికి నేనెవరినమ్మా. అంతా ఆ దేవుడి దయ. మీ వంటి మర్యాదస్తుల వివరాలు సేకరించి ఇదుగో ఇలా అందజే స్తాను" అన్నాడు.

"అసలు ఇలా పేపర్లలో వేయించ డాలూ.. గట్రా ఇప్పుడొచ్చి పడ్డాయిగానీ గతంలో చక్కగా మీ వంటి పెళ్ళిళ్ళ పేర య్యలు కుదిర్చేవారు సంబంధాలు" అంది బాలమ్మ సంబరంగా.

"మీ దగ్గర పెళ్ళికూతుళ్ళ వివరాలు న్నాయా అండీ" ఆసక్తిగా అడిగింది శారద.

"లేకపోవడం ఏమిటమ్మా. ఇదుగో చూడండి" అంటూ ఒక ఫొటో తీసి చూపించాడు.

పిల్ల కనుముక్కు తీరు బాగానే వుంది గానీ కాస్త లావుగా వుంది. "ఈ అమ్మా యికీ, మా అబ్బాయికీ వరహీనం అవుతుం దేమోనండీ" అంది శారద.

"ఆ మాటా నిజమేలెండి. ఇదుగో మరొ కటి" అంటూ ఇంకో ఫొటో చూపించాడు.

ఇదంతా చూస్తున్న క్రిష్ణకి చాలా సంతోషం కలిగింది. ఇదీ పద్ధతంటే. 'ఈ ఫొటో వద్దు అని నిన్న మ్యారేజి బ్యూరో లోని అపర సూర్యకాంతం ముందర అని వుంటే తిట్టడం కాదు. కోపగించుకుని రెండు దెబ్బలు వేసేది కూడానేమో.

పోతే పోయింది. పీడా వదిలింది. ఆ పార్థసారథిగాడిది మిడిమిడి జ్ఞానం. వాడి బొంద వాడికేం తెలుస్తుంది. వాడికి ఇద్దరూ కూతుళ్ళు. ఒకర్తేమో ప్రేమించి పెళ్ళి చేసుకుంది. రెండోదానికి మేనరికం చేశాడు. ఏదో అన్నీ తెలిసినట్లూ గొప్పగా ఫోజు పెడతాడు.

పోయిన కన్ను పోతే పోయింది, ఉన్న కన్ను రామబాణం అన్నట్లూ వాడి వెంట పడి అక్కడికి వెళ్ళడం మంచిదే అయింది. ఈ సాంబయ్యగారు తారసపడ్డాడు. ఏమా టకామాటే చెప్పుకోవాలి. నిన్న ఆవిడ అలా చీవాట్లు పెట్టబట్టేగా పాపం ఈ సాంబ య్యగారు తెల్లవారేసరికి వెతుక్కుంటూ వచ్చారు' అనుకున్నాడు.

రెండో ఫొటో శారదకి బాగా నచ్చింది.

"ఈ పిల్ల చక్కగా వుందండీ" అంది సంతోషంగా.

సాంబయ్యరాక కారు చీకటిలో వెలుతురుగా అనిపించింది.

సాంబయ్య వాళ్ళ పూర్తి వివరాలు తెలియజేశాడు. "మంచి సంబంధం. చెయ్యి దాటి పోనివ్వకండి. మీకెప్పుడు వీలుగా వుంటుందో చెప్తే నేను వాళ్ళతో మాట్లాడతా" అన్నాడు.

"అలాగే. తప్పకుండా. మా అబ్బాయిని కనుక్కుని వాడికెప్పుడు కుదురుతుందో చెప్తాను" అన్నాడు క్రిష్ణ. సాంబయ్య చేతిలో రెండొందలు పెట్టి దారి ఖర్చులకి వుంచండి" అన్నాడు.

సూర్యహాతో చెప్తే, "నా ప్రాజెక్ట్ డెలివరీ డేట్ దగ్గరకొచ్చేస్తుంది. ఈ వారం రోజులూ నన్ను మాట్లాడించకండి. వచ్చే వారం చూద్దాం!" అన్నాడు.

ఆ మరుసటి వారం ఆ అమ్మాయికి వీలు కాలేదు. ఆ తరువాత ఆదివారం నాడు ఆ అమ్మాయింట్లో పెళ్ళిచూపులు. వాళ్ళు నలుగురూ బయలుదేరి వెళ్ళారు.

పెళ్ళి చూపులకి వెళ్ళేటప్పుడు మగపెళ్ళి వారు ఒట్టి చేతులతో వెళ్ళకూడదు. పెళ్ళి కూతురి కోసం పూలూ పళ్ళూ తీసికెళ్ళాలని చెప్పింది బాలమ్మ. దారి మధ్యలో కారాపి తీసుకున్నారు.

వాళ్ళు ఎంతో మర్యాదగా ఆహ్వానించారు! సాంబయ్య అక్కడే వున్నాడు. వీళ్ళు కూర్చున్న తర్వాత కాఫీ ఇచ్చారు. మరికాసేపటికి లోపలినించి వచ్చింది పెళ్ళికూతురు. మామూలుగా వున్న పంజాబీ డ్రెస్ వేసుకుంది. మెళ్ళో సన్న గొలుసు. బోసి చేతులు.

"మా అమ్మాయి" అని పరిచయం చేశాడు తండ్రి. ఇదిగో వాళ్ళు ఫలానా అని కూతురికి వాళ్ళని పరిచయం చేశాడు. పెద్దవాళ్ళకి నమస్కారం పెట్టి సూర్యహాని

## ఇరవై ఏడేళ్ల తర్వాత



**పొత్తూరి విజయలక్ష్మి**

**1982** నుండి రచనలు చేస్తున్నాను. మొదటి నవల 'ప్రేమలేఖ' చతురలో 1982 అక్టోబర్ సంచికలో ప్రచురితమైంది. తర్వాత అదే 'శ్రీవారికి ప్రేమలేఖ' సినిమాగా వచ్చింది.

మళ్ళీ ఇరవై ఏడేళ్ల తరువాత 'చతుర'లో అదీ అక్టోబర్‌లోనే నా నవల రావడం కాకతాళీయమే అయినా ఆనందదాయకం. ఇది చతురలో నాలుగో నవల.

'ప్రేమలేఖ' తర్వాత చతురలో వచ్చిన మరో రెండు నవలలు- అచివాయసం, సహజీవనం.

ఇప్పటివరకూ దాదాపు 150 కథలు, 15 నవలలూ, రెండు టీవీ సీరియల్స్ రాశాను. తెలుగు యూనివర్సిటీ ధర్మనిధి పురస్కారం 2007లో అందుకున్నాను. ఇటీవలే నా కథలు మూడు సంపుటాలుగా ప్రచురించాను. 'చంద్రహారం', 'మా ఇంటి రామాయణం', 'ఆనందమే అందం'. చంద్రహారం మామూలు కథలు, కొన్ని హాస్యకథల గుచ్ఛం. మిగిలినవి రెండూ పూర్తిగా హాస్య కథలే. ఈనాడు ఆదివారం అనుబంధంగా వచ్చిన హాస్య కథలను ఎమెస్కో వారు ప్రచురించారు.

ఈ సుదీర్ఘ ప్రయాణంలో పుంఖాను పుంఖాలుగా రాయకపోయినా నన్ను రచయిత్రిగా గుర్తించి ఆదరిస్తున్న పాఠకులకూ పత్రికల వారికీ నా కృతజ్ఞతలు.

ఈ-మెయిల్:
pvlakshmi8@gmail.com

"హల్లో" అని పలకరించింది "హలో" అన్నాడు సూర్యహా కూడా.

మామూలు మాటలు అయ్యాక, "మీరి ద్దరూ లోపలికి వెళ్ళి మాట్లాడుకోండి" అన్నాడు పిల్ల తండ్రి. ఇద్దరూ లేచి లోప లికి వెళ్ళారు. తల్లి ఎందుకో లోపలికి వెళ్ళింది. తండ్రికి సెల్ మోగితే కాస్త పక్కకి వెళ్ళాడు.

"ఇదేం చోద్యమే శారదా? వెనకటికి పెళ్ళి చూపులంటే పెళ్ళికూతురు లక్షణంగా పట్టుచీర కట్టుకుని, నగలు పెట్టుకుని తయారయ్యేది. వీణో, ఫిడేలో వాయించి వినిపించేది. ఈ పిల్ల తలంటి స్నానానికి వెళ్తున్నట్టుగా ఇలా వుందేం? చిన్న పిల్లకి తెలియకపోతే తల్లైనా చెప్పద్దూ? " అంది బాలమ్మ గుసగుసగా.

"ఆ రోజులు పోయాయి. ఇప్పుడు పెళ్ళి చూపుల్లో ప్రత్యేకంగా అలంకరించుకోటం లేదుట. మామూలుగా ఇంట్లో ఎలా వుంటున్నారో అంతే సాదాసీదాగా వుంటు న్నారుట. ఇదే ఇప్పటి పద్ధతట మరి!" చెప్పింది శారద.

"మరి వీణా, ఫిడేలూ? " అడిగిందావిడ.

"చాల్లే ఊరుకోండి. ఈ రోజుల్లో అలా పిచ్చి ప్రశ్నలేసి పిల్లని ఇబ్బంది పెట్టకూడ దుట. వీణా, ఫిడేలూ అని మనం అడిగితే కోపం వచ్చి తబలా వాయిస్తుంది మిమ్మల్నీ నన్నూనూ!" అంది శారద.

ఇంతలో పిల్ల తల్లి లోపల్నించి బర్ఫీ కారంబూందీ పట్టుకొచ్చి ఇచ్చింది. తండ్రి కూడా ఫోన్లో సంభాషణ ముగించుకొచ్చి కూర్చున్నాడు. ఏదో పిచ్చాపాటీ మాట్లాడు కుంటూ కూర్చున్నారు. మరో అరగంట తర్వాత సూర్యహా, ఆ అమ్మాయి బయటకి వచ్చారు. ఇద్దరూ నవ్వుతూ సంతోషంగానే వున్నారు.

"మరి వెళ్దామా నాన్నగారూ!" అన్నాడు వచ్చీరాగానే.

"వెళ్దాం పద" అన్నాడు క్రిష్ణ. ఆవిడ బొట్టు పెట్టి తాంబూలం ఇచ్చింది. బయటిదాకా వచ్చి సాగనంపారు అందరూ.

కారు స్టార్టు చేసి నాలుగు గజాలు వెళ్ళ గానే "ఏమిత్రా చిట్టీ.. ఏం మాట్లాడుకు న్నారు? " అడిగేసింది శారద.

నవ్వేశాడు సూర్యహా. "వద్దనుకున్నాం!" అన్నాడు.

మొహాన వేడినీళ్ళు కొట్టినట్లు అయింది క్రిష్ణకి. "అదేమిత్రా? ఎందుకూ? " అన్నాడు.

"ఆ అమ్మాయికి పెళ్ళంటే పెద్దగా ఇష్టం లేదుట. ఇంట్లో వాళ్ళు పీక్కుతింటూ వుంటే సరే అందట. ఒకవేళ పెళ్ళైనా త న పద్ధతి మార్చుకునే ఉద్దేశ్యం ఆమెకు లేదు. స్వతంత్రంగా వుంటూ ఆమెకు ఇష్టం వచ్చినట్లు వుండటం మొదటినించే అలవాటట. ఆర్థికంగా తన మీద ఏమాత్రం ఆధారపడకుండా, ఆమె జీవన విధానానికి అడ్డుకురాకుండా సర్దుకు పోతా నంటే ఆమెవైపు నించి ఓకే అంది.

నాకలా ఇష్టంలేదు. ఆర్థికంగా నాక్కా బోయే భార్యమీద ఆధారపడను గానీ మరీ బొత్తిగా ఆవిడ పద్ధతులే అనుసరించా లంటే నాకూ కష్టం అవుతుంది. నాకూ కొన్ని స్వతంత్ర భావాలున్నాయి. కొంత నేను సర్దుకుపోతాను. కొంత ఆవిడ సర్దు కుపోవాలి" అన్నాడు.

"సరే.. అయితే తనవైపునించీ నో అంది. నేనూ నో యే అన్నాను" చెప్పాడు సూర్యహా.

తెల్లపోయారు శ్రోతలు. "మరి ఇంతటి భాగ్యానికి ఈ గొడవంతా ఎందుకు? అసలు పెళ్ళే వద్దంటే సరికదా? " అన్నాడు క్రిష్ణ.

"తను వద్దనే అందిట. పెద్దవాళ్ళే పోరు పెడుతున్నారుట. ఏమో నీ అభిప్రాయా

లను గౌరవించేవాడు దొరుకుతాడేమో అన్నారుట" చెప్పాడు.

"ఏడిసినట్లుంది! పెళ్ళయ్యాక కూడా నా ఇష్టం వచ్చినట్లు వుంటాను అంటే ఏ మగ వాడు ఒప్పుకుంటాడు? " విసుక్కున్నాడు క్రిష్ణ.

"మరి వద్దనుకుంటే అంతసేపు కబుర్లు చెప్పుకున్నారేం? అంతసేపు మాట్లాడు కుంటే మీ ఇద్దరి అభిప్రాయాలూ కలిశా యేమో అనుకున్నాం" అంది శారద.

"ఆ! అదేంలేదమ్మా. ప్రస్తుతం ఆ అమ్మాయి, నేనూ కూడా ఒకే రకం ప్రాజెక్ట్‌లు చేస్తున్నాం. ఆ సాధక బాధకాలు మాట్లాడుకున్నాం" అన్నాడు.

"వద్దనుకున్నాక అలా నవ్వుకుంటూ వచ్చారేంరా? " అడిగింది బాలమ్మ.

"నవ్వుకుంటూ రాక ఏడ్చుకుంటూ వస్తామా? మా ఇద్దరి అభిప్రాయాలూ కలవలేదు. అంతేగానీ మేమేం పోట్లాడుకో లేదుగా!" నవ్వేశాడు సూర్యహా.

"బాగానే వుంది.. సింగడు అద్దంకి పోనూ పోయాడు, రానూ వచ్చాడన్నట్లు అయింది" అంది బాలమ్మ.

మళ్ళీ తెల్లారగానే వచ్చాడు సాంబయ్య.

"ఏమిటోనండీ సంబంధం సానుకూల పడలేదు" అంది శారద.

"ఏదో లెండమ్మా వాళ్ళిద్దరికీ రాసి పెట్టి లేదు. అసలైనా ఇప్పుడు సగం సంబంధాలు అమ్మాయికీ అబ్బాయికీ అభిప్రాయాలు కుదరక వీగిపోతున్నాయి" అన్నాడు సాంబయ్య.

"అసలు నన్నడిగితే పెళ్ళికి ముందే కాబోయే దంపతులని మాట్లాడుకొనివ్వకూడదు. అలా మాట్లాడుకొనిస్తే ఎడ్డెం అంటే తెడ్డెం అంటూ లేనిపోని విషయాలన్నీ చర్చించుకుని వాదులాడుకుని, వద్దు.. పొమ్మంటున్నారు. అభిప్రాయాలు కుదిరితేనే పెళ్ళి చేసుకుంటాం అని మొండికేస్తే అలలు తగ్గాక సముద్రస్నానం చేస్తాను

## కొత్తగాలి...

**వాన చినుకులకై..**
**అందరందరి చూపు**
**వనరక్షణపై లేదెపుడూ**
**ముందుచూపు**

*-ఎమ్.రమేష్ యాదవ్,*
*కరంజి(టి), ఆదిలాబాద్ జిల్లా*

అన్నట్లుగా వుంటుంది" అంది శారద.

"అవును. అసలా మాటకొస్తే నేనూ మా ఆవిడ పెళ్ళికి ముందు మాట్లాడుకో లేదు కాబట్టే మా పెళ్ళయింది. మాట్లాడుకుని వుంటే మా పెళ్ళి జరిగేదే కాదు" అన్నాడు క్రిష్ణ.

"ఆ మాటకొస్తే మా పెళ్ళి మాత్రం జరిగుండేదిట్రా!" అంది బాలమ్మ.

"అవునండీ.. అందుకే గతంలో పెళ్ళికి ముందు మాట్లాడుకోనిచ్చేవాళ్ళుకాదు. పెళ్ళయాక తాళి కట్టాక, తన్నుకు చావండి అన్నట్టూ వదిలేసేవాళ్ళు. పోట్లాడుకునో, దెబ్బలాడుకునో దంపతులు రాజీపడిపోయేవాళ్ళు. ఈ మాట్లాడుకునే పద్ధతే అప్పుడు గానీ ఉన్నట్లయితే దేశంలో సగం మందికి పెళ్ళిళ్ళయ్యేవే కాదు" అన్నాడు సాంబయ్య.

"నాయనా మరి ఆ సంబంధం కుదర్లేదు కదా! మళ్ళీ ఏమైనా చూస్తారా? " అంది బాలమ్మ.

"అయ్యో మరి అందుకే కదమ్మా నేనొచ్చింది. మరో మంచి సంబంధం తెచ్చాను" అన్నాడు.

"అలాగా ఫొటో వుందా? " కుతూహలంగా అడిగింది శారద.

"ఇదుగో!" అంటూ చూపించాడు. ఈ పిల్ల మరీ బావుంది.

"మరి ఈ అమ్మాయి ఫొటోనే ముందు చూపించి వుంటే ఇదే చూసే వాళ్ళం కదా

సాంబయ్యగారూ!" అన్నాడు క్రిష్ణ కాస్త నిష్ఠూరంగా.

"చూపించేవాడినే కానీ. ఒక చిన్న తిర కాసుంది!"

"ఏమిటండీ అది? "

"మీరేమో అమ్మాయి కూడా బాగా చదువుకుని ఉద్యోగం చెయ్యాలన్నారు. మరి ఈ అమ్మాయికి చదువుందిగానీ ఉద్యోగం లేదు" చెప్పాడు.

"ఉద్యోగం లేదా? అయితే వద్దులెండి. మా అబ్బాయి ఉద్యోగం చేసే అమ్మాయే కావాలంటున్నాడు" చెప్పేశాడు క్రిష్ణ.

శారద మాత్రం ఆ ఫొటోవంకే మురిపెంగా చూస్తోంది.

"చూస్తుంటే మీకు ఈ అమ్మాయి నచ్చినట్లు వుంది కదమ్మా!" అన్నాడు సాంబయ్య.

"అవుననుకోండి కానీ ఉద్యోగం లేదుకదా!"

"మీ స్వవిషయాలకి జోక్యం చేసుకుంటున్నానని మీరు భావించకుండా వుంటే నేనో మాట చెప్తానమ్మా!" అన్నాడు సాంబయ్య.

"చెప్పండి!" అంది శారద.

"మీ అబ్బాయే కాదు, ఈ రోజుల్లో మగపిల్లలందరూ భార్య ఉద్యోగం చెయ్యాలనే కోరుకుంటున్నారు. ఎందుకో తెలుసా!"

"ఎందుకేముందీ... ఇద్దరూ సంపాదిస్తే దర్జాగా బ్రతకొచ్చని!" చెప్పాడు క్రిష్ణ.

అది చిన్నాచితకా ఉద్యోగస్తులకు. మీ అబ్బాయి వంటి వారికి కాదు. కానీ కుర్రాళ్ళంతా భార్య ఉద్యోగం చెయ్యాలని ఎందుకనుకుంటున్నారంటే వాళ్ళవి వేళాపాళా లేని ఉద్యోగాలు. ఇంటికి రాగానే పగలంతా ఒంటరిగా వున్న భార్య సినిమాలనీ, షికార్లనీ వేధిస్తుంది. అదే ఆ అమ్మాయికీ ఒక ఉద్యోగం వుంటే ఆవిడ లోకంలో ఆవిడ వుంటుంది. అందుకే భార్య ఉద్యోగం చెయ్యాలనుకుంటున్నారు"

"అదీ నిజమే లెండి!" అంది శారద.

"నిజమే. మరి మీ గురించి మీరు కాస్తైన ఆలోచించారా? " నిలదీశాడు సాంబయ్య!

"నా విషయం ఏమిటండీ? " అయోమయంగా అడిగింది శారద.

"ఏ అత్తగారైనా కోడలొచ్చాక సుఖపడాలనుకుంటుంది, అవునా? "

"అవునండీ. కోడలెప్పుడొస్తుందా? నాకు ఆసరాగా ఎప్పుడుంటుందా? అని వెయ్యి కళ్ళతో ఎదురు చూస్తున్నాను"

"మరి ఉద్యోగం చేసే కోడలు ఇంటి బాధ్యతలు స్వీకరించదు కదా? మరీ మంచిపిల్ల అయితే ఏదో ఓ కప్పు కాఫీ కలుపుకుంటుంది. అంతకు మించి ఇంటి పని చచ్చినా చెయ్యదు. అత్తగారి మాట అసలే వినదు. ఇప్పుడు చూస్తూనే వున్నాంగా అత్తగార్ల అవస్థలు. కొడుకు పెళ్ళయ్యాక మళ్లీ సెకండ్ ఇన్నింగ్స్ ప్రారంభించి కొడుకు చాటు కోడలికీ లంచ్ బాక్సులు కట్టి ఇస్తూ.. రేపు వాళ్ళకి పిల్లలు పుడితే మూడో నెలనించీ వాళ్ళని పెంచుకుంటూ సతమతం అయిపోతున్నారు" చెప్పాడు సాంబయ్య.

"అవునండీ మీరు చెప్పింది నిజమే. పాపం మా చిన్న వదిన మనవడిని పెంచలేక అవస్థ పడిపోతోంది..." అంది శారద.

"అవును. పాపం మొన్న వచ్చినప్పుడు చెప్పుకుని బాధ పడింది. కోడలికి దినం అస్తమానం ఉద్యోగంతోనే సరిపోతుందిట. వేల్టికి ఆవిడకి అన్నీ అందించాలిట. పని మనిషి రాకపోతే పనంతా ఈవిడ మీదే. కాస్త అటూ ఇటూ అయితే అత్తగారి మీద విసుక్కుంటుందిట. ఆనాడు అత్తగారి చేతా మాటలు పడ్డాను. ఈనాడు కోడలి చేతా మాటలు పడుతున్నాను- అని కళ్ళనీళ్ళ పర్యంతం అయింది" అంది

బాలమ్మ.

"అందుకే చెప్పేది. ఈ అమ్మాయిని చేసుకుంటే మీకా బాధలు తప్పుతాయి. కాలక్షేపం కోసం కావాలంటే ఏ చిన్నదో ఉద్యోగంలో చేర్పించండి. లేదూ ప్లెయిన్ చీరలు కొనిస్తే అద్దాలూ దువ్వెనలూ కుట్టుకుంటుంది. ఉద్యోగం లేదుగానీ చదువుంది కదా! పైగా వాళ్ళు బాగా డబ్బున్నవాళ్ళు కూడాను. బాగానే ముట్టచెప్తారు" అన్నాడు సాంబయ్య.

"మాకు వాళ్ళిచ్చే డబ్బు వద్దులెండి? " అన్నాడు క్రిష్ణ.

"మీరు పుచ్చుకోకండి. వాళ్ళమ్మాయికి ఇచ్చుకుంటారు. ఆ డబ్బు బ్యాంకులో వేసుకుంటే అమ్మాయి ఏదో కాలక్షేపానికి ఉద్యోగం చేస్తే వచ్చే జీతం వడ్డీరూపంలో వస్తుంది. కోడలు ఇంటి పట్టునే వుండి మీకు కొంచెం ఆసరాగా వుంటుంది" అన్నాడు.

శారద మొహం వికసించింది. "ఈ ఆలోచన ఏదో బాగానే వుంది" అంది.

"మరి అబ్బాయి ఒప్పుకుంటాడో లేదో!" సందేహించాడు క్రిష్ణ.

"అబ్బాయికి మీరు చెప్పే రీతిలో చెప్తే ఒప్పుకుంటాడు" అన్నాడు సాంబయ్య.

ఆ రాత్రి శారద కొడుకు దగ్గర కూర్చుని ఎన్నో విధాలా నచ్చచెప్పింది. ఒకసారి చూడు. అమ్మాయి బావుంది. చాలా మర్యాదస్తులట. నీకు ముద్దూ ముచ్చటా జరుగుతాయి. జీవితంలో మనం కోరుకున్నవి అన్నీ దొరకవు. మిగిలిన విషయాలన్నీ బావున్నాయి. ఆ ఉద్యోగం విషయంలో కాస్త నువ్వూ సర్దుకుపో. ఇంటిపట్టున వుండే కోడలొస్తే నాకూ సుఖమే. చూస్తున్నావు కదా. ఈ మేడెక్కి దిగలేక నేనెలా అవస్థ పడిపోతున్నానో. నా విషయం కూడా ఆలోచించు" అని బతిమాలింది.

కాస్త మెత్తపడ్డాడు సూర్యహా. "సరేలే. నీ కోసం సరే అంటున్నాను. ఆ అమ్మాయి నాకు మనస్ఫూర్తిగా నచ్చితేనే సరే అంటాను. మరోమాట. మీరిద్దరూ ఇంట్లో వుండి దెబ్బలాడుకుని మీ అమ్మ చూడు ఎలా అందో అని ఆ శాల్తీ, నీ భార్య చూడరా ఏం చేసిందో అవి నువ్వూ నన్నుచంపుకు తినకూడదు మరి. అలా అని మాటిస్తేనే ఈ ఉద్యోగం లేని అమ్మాయిని పెళ్ళి చేసుకుంటాను" అన్నాడు.

"సరే లేరా! అయినా నీ చాదస్తం కానీ ఉద్యోగం చేసే అమ్మాయితో రావా గొడవలు. నీకు ఇబ్బంది కలిగించకుండా నేను చూసుకుంటానుగా" అభయం ఇచ్చింది శారద. తర్వాత తనే-

"మరి ఎప్పుడు వెళ్దాం పెళ్ళిచూపులు చూడ్డానికి? " అంది.

"వీక్‌డేస్ నాకు కుదరదు. ఆదివారం పెట్టుకోండి" అన్నాడు.




ఆదివారం వచ్చింది. సాంబయ్యా వచ్చాడు. వాళ్ళు టాక్సీ పంపించారు. "వాళ్ళే వద్దామనుకున్నారుటగానీ కార్లో చోటుండదని రాలేదుట" అని చెప్పాడు.

"ఫర్వాలేదు మర్యాదస్తులే" ఆనందపడ్డారు మగపెళ్ళివారు.

దార్లో ఆగి పూలూ పళ్ళూ కొనుక్కుని వాళ్ళింటికి వెళ్ళారు. రెండంతస్తులమేడ.

వాకిట్లో కారాగగానే నలుగురు మగవాళ్ళు పరిగెత్తుకొచ్చి కారు తలుపులు తెరిచి "రండి రండి!" అని ఆహ్వానించారు.

"రండమ్మా రండి. దయచేయండి. మీవంటి వారు రావడం వల్ల మా ఇల్లు పావనం అయింది" బాలమ్మతో అన్నాడు ఒకాయన ఉత్తరీయంతో కళ్ళొత్తుకుంటూ.

అందరూ లోపలికి వెళ్ళారు. పాత కాలంనాటి ఇల్లు. హాలు బాగా విశాలంగా వుంది. దాన్నిండా సోఫాలు, కుర్చీలు, రెడ్ ఆక్సైడ్ గచ్చు దానిమీద తివాసీ.

వీళ్ళని కూర్చోబెట్టారు. మిగిలిన కుర్చీల్లో, సోఫాల్లో దాదాపు పదిమంది దాకా మగవాళ్ళు కూర్చున్నారు. ఆడవాళ్ళంతా గుమ్మాల దగ్గరా, కిటికీల దగ్గరా నిలబడ్డారు.

ఒకావిడ మంచినీళ్ళు తెచ్చి అందించింది. సఫారీ వేసుకున్న ఒక పెద్దాయన లేచి "ఇరుగో ఈయన మా పెద్దన్నయ్య. ఈయన రెండో అన్నయ్య. ఈయన బావగారు. ఈయన మావయ్య" అంటూ అందరినీ పరిచయం చేశాడు.

'ఇంతకీ మీరెవరూ? ' అని అడగబోయి మానేశాడు క్రిష్ణ. అక్కడున్న మగవాళ్ళనందరినీ పరిచయం చేసి అలసటగా కూర్చుండిపోయాడు ఆ సఫారీ.

మరొకాయన లేచి "అదుగో ఆవిడ మా పెద్దక్క. అది రెండోది. ఆ మూల మా పిన్ని. ఇది శాంత. అది మాధురి. ఆవిడ కౌసల్య. అదుగో గౌరి" అని పరిచయ కార్యక్రమం కొనసాగించాడు. కాస్త అటూ ఇటుగా సురభి నాటక కంపెనీలో కళాకారులంతమంది వున్నారు ఆ ఇంట్లో.

పరిచయాలు అయ్యాక ఒక పెద్దాయన నోరు విప్పాడు.

"మీరు, మీ ఆవిడ చక్కగా శ్రీనివాసుడూ పద్మావతీలాగా వున్నారు. మీ తల్లిగారు వకుళామాతలా వున్నారు. మీ అబ్బాయి మన్మథుడిలా వున్నాడు. మీ కుటుంబాన్ని చూస్తుంటే ఆనందంతో నాకు మాటలు రావడంలేదు" అని భుజమ్మీద ఉన్న తుండుగుడ్డతో కళ్ళు తుడుచుకున్నాడు.

ఆ వెంటనే భుజంమీద ఉత్తరీయాలూ, కండువాలూ ఉన్న వాళ్ళు వాటితో కళ్ళు తుడుచుకున్నారు. ప్యాంట్లు వేసుకున్న వాళ్ళు జేబులోంచి రుమాళ్లను తీసి కళ్ళొత్తుకున్నారు. ఆడవాళ్లు చీరకొంగుతో కళ్ళొత్తుకున్నారు.

ఒకావిడ కాఫీలు తీసుకొచ్చింది. "ఇవ్వాళ మా చిన్నాన్నగారే ఉంటే ఎంతో సంతోషించేవారు!" అంది కాఫీలందించి.

"ఏమయ్యారు మీ చిన్నాన్నగారు.. ఊరెళ్లారా? " అడిగింది శారద.

"అయ్యో కాదండీ.. పోయారు" అందావిడ.

"అయ్యో పాపం.. చిన్న వయస్సులోనే పోయారా చిన్నాన్నగారు? " పరామర్శించింది బాలమ్మ.

"చిన్న వయసేం కాదులెండీ. ఎనభైఏళ్లున్నాయి. మా సునీత పెళ్లి చూశాక పోవాలనుకున్నారు. చూడకుండానే పోయారు" అంటూ కళ్లు ఒత్తుకుంది.

మళ్లీ అందరూ ఆడామగా తేడా లేకుండా బాధగా కళ్లు తుడుచుకున్నారు. క్రిష్ణకి పిచ్చెక్కుతోంది. ఇలా వదిలేస్తే వీళ్లంతా ఆనందంతోనో, బాధతోనో ఏడుస్తూనే ఉంటారు కాబోలని భయం వేసింది.

"సాంబయ్యగారూ అమ్మాయిని పిలిపిస్తారా? " అంటూ అసలు విషయం గుర్తు చేశాడు.

"అయ్యో, ఇప్పుడే తీసుకొస్తాం" అని ఆడంగులు ఓ అరడజను మంది లోపలికి వెళ్లి పెళ్లికూతురు సునీతని వెంటబెట్టుకొచ్చి వీళ్ల ఎదురుగా కుర్చీలో కూర్చోబె

## కొత్తగాలి...

**ఋతు పవనాలు,**
**మేఘమథనాలతో**
**పనిలేదు**
**దగాపడ్డ ఆడపిల్లల కన్నీళ్లకు**

**-మోపూరు రామశేషు,**
ఎర్రగడ్డ, హైదరాబాద్

ట్టారు.

పిల్ల చక్కగా చిలకలా ఉంది. "నీ పేరే మిటమ్మా? " అడిగింది శారద.

"సునీత" చెప్పిందా అమ్మాయి కాస్త బెదురుగా.

"ఏం చదువుకున్నావమ్మా? " అడిగింది శారద.

ఆ అమ్మాయి తలొంచుకొని గుడ్లనీళ్లు కుక్కుకుంది. తెల్లబోయింది శారద.

"పాపం చదువు పేరెత్తేసరికి తల్లి గుర్తొచ్చినట్లుంది పిచ్చితల్లికి" అంటూ కళ్లనీళ్లు పెట్టుకుంది, పిల్ల పక్కనే కుర్చీకి ఆనుకుని నిలబడినావిడ.

"అయ్యో పాపం! పిల్లకి తల్లిలేదా? " జాలిగా అడిగింది బాలమ్మ.

"ఎంతమాట తల్లి లేకేం? ఉంది. కానీ ప్రస్తుతం అమెరికా వెళ్లింది. పెద్దపిల్లకి పురుడు పొయ్యడానికి" అందావిడ.

"అమెరికా వెళ్తే ఏడవడం ఎందుకండీ? " అయోమయంగా అడిగింది శారద.

"అదే తనకెలాగూ చదువులేదని పట్టుబట్టి పిల్లలని పెద్ద చదువులు చదివించింది వాళ్లమ్మ. అమ్మలేకుండా పెళ్లి చూపులేవిటని కళ్లనీళ్లు పెట్టుకుంది బిడ్డ. అమ్మ దగ్గర లేకపోతేనేం? మేమంతా లేమా అని ఒప్పించాం. మీరు చదువు విషయం ఎత్తేసరికి తల్లి గుర్తొచ్చి ఏడుస్తోంది.. పిచ్చితల్లి" అందావిడ కళ్లొత్తుకుంటూ.

షరా మామూలే! మళ్ళీ అందరూ కళ్లు తుడుచుకున్నారు.

ఇక తర్వాత నోరెత్తలేదు ఎవరూ!

"అబ్బాయి ఏమైనా అడుగుతాడేమో అడగమనండి!" అన్నాడు మరో పెద్దాయన.

వంచిన తల ఎత్తలేదు సూర్యహా!

"వాడేం అడుగుతాడులేండి. అయినా మా ఇంట్లో పిల్లవాడు పిల్లతో మాట్లాడే అలవాటు లేదు" అన్నాడు క్రిష్ణ.

"ఎంత గొప్ప వంశం. మా అమ్మాయి అదృష్టం బావుంటే మీ ఇంట కాలు పెడుతుంది" అన్నాడాయన ఆనందంగా కళ్లొత్తుకుంటూ.

"ఇహ వెళ్తాం" అని లేచాడు క్రిష్ణ. బలవంతపెట్టి ఫలహారం పెట్టారు. వాళ్లని పలకరిస్తే ఏం ప్రమాదమోనని నోరెత్తకుండా తిని లేచారు.

"మరి ఏ విషయం చెప్తారు కాదు" అన్నాడు ఓ పెద్దాయన.

"ఇంటికెళ్లి అబ్బాయితో సంప్రదించి తెలియజేస్తాం!" అన్నాడు క్రిష్ణ. అందరూ కళ్లొత్తుకుంటూ సాగనంపారు.

కారెక్కి కాస్తదూరం రాగానే ఆనందంతో అడిగాడు సాంబయ్య, "చూశారా ఎంత మర్యాదస్తులో వాళ్లు. నేను చెప్పలేదూ!" అన్నాడు.

"అదేం మర్యాదండీ బాబూ! అసలా ఏడుపులేమిటి? ఇవతలి వాళ్లకు ఊపిరాడకుండా? అసలదేం కుటుంబం? " చిరాకుపడ్డాడు క్రిష్ణ.

"కుటుంబంతో మీకేం సంబంధం చెప్పండి? పిల్లకదా మీ ఇంటికి వచ్చేది" అన్నాడు.

"పిల్లే. కానీ ఆ పిల్లకూడా పలకరిస్తే ఏడిచేస్తుంది. మాకొద్దు బాబూ! మేము తట్టుకోలేం అంది శారద"

సూర్యహా మాత్రం ఇంకా ఫోన్‌లో

# సంగీత విద్వాంసుల ఫుట్‌బాల్ మ్యాచ్



మైసూరు మహారాజు ముమ్మడి కృష్ణరాజ ఒడెయరు కళాపోషకులు. దేవరాజ అరసు దర్బార్ భక్షి. ఎల్లప్పుడూ సంగీతంలో మునిగి ఉండే విద్వాంసులకు వ్యాయామం అవసరమని అరసు భావించి ఒకసారి ఫుట్బాల్ మ్యాచ్ ఏర్పాటు చేయించారు. కార్యాలయ మొక్తేసర్ అనంతస్వామిరాయలు ఓరోజు మ్యాచ్ ఆడేందుకు హాజరుకమ్మని విద్వాంసులను ఆదేశించారు. మొక్తేసరు ఒక జట్టుకు, అందరిలో ముసలి విద్వాంసులు మరొక్క జట్టుకు క్యాప్టన్లు. అందరికీ ఎవరెవరు ఎక్కడెక్కడా ఉండాలో, ఆట ఎలా ఆడాలో సూచనలిచ్చారు. ఆట మొదలయింది.



ఎవరికి వారు బంతిని ఇష్టారాజ్యంగా తన్నుతున్నారు. అంతలో బంతి వీణ శివరామయ్య దగ్గరకొచ్చింది. ఆయన దిక్కు చూడకుండా బలంగా తన్నాడు. అది తిన్నగా అతని జట్టు గోలులోకే దూరింది. ఆయన చప్పట్లు చరుస్తూ గెంతులేశాడు. క్యాప్టన్ తల బాదుకుంటూ, 'ఏమండీ శివరామయ్యగారూ! మీరు బంతిని తన్నాల్సింది మన గోలులోనికి కాదు' అన్నాడు. ఆయనకు మరో అవకాశం వచ్చింది. క్యాప్టన్ చెప్పినట్లే ఈసారి ఎదుటి గోల్ వైపుకే తన్నాడు. మళ్లీ గోలయ్యింది. ఎందుకంటే అటువైపు గోల్ కీపర్ వేగంగా వస్తున్న బంతిని పట్టుకొనే ప్రయత్నం చేయక, చూస్తూ నిల్చున్నాడు. ఆ జట్టు క్యాప్టన్ ప్రశ్నిస్తే, 'అంత వేగంగా వచ్చే బంతిని పట్టడమా? దెబ్బ తగలదూ?' అన్నాడు. ఈ ఆటను చూసిన దర్బార్ భక్షికి పిచ్చెక్కింది. 'వీళ్ళు స-ప-స అని అరచేందుకు తప్ప దేనికీ పనికి రారు. ఇంక ఈ ఆట చాలు. ఇళ్లకు వెళ్దాం పదండి' అన్నారు.

ఉన్నాడు. ఇంటికొచ్చాక "అమ్మా రేపు తెల్లవారగానే వెళ్లిపోవాలి. కాస్త పెందలాడే లేచి లంచ్‌బాక్స్ ఇచ్చెయ్. ఏమిటో నిన్ను చాలా శ్రమ పెడుతున్నాను" అంటూ కళ్లొత్తుకున్నాడు.

టీవీలో వార్తలు చూసి "ఈ ఏడు వర్షాలు బాగా పడ్డాయట. అంతా ఆ దేవుడి దయ" అని కళ్లొత్తుకున్నాడు.

"ఏవిట్రా అది? అయినదానికీ, కానిదానికీ ఆ ఏడుపేమిటీ? ఏం మతిగానీ పోయిందా! ఏదో వెళ్లాం, చూశాం, వచ్చాం. ఇక అంతటితో వదిలెయ్యాలి గానీ ఆ పిచ్చి లక్షణాలు వంట బట్టించుకుంటే ఎట్లా.. ఆ మాటకొస్తే నేనూ వెళ్లాను కదా! నేనేడుస్తున్నానా!" గట్టిగా కసిరాడు క్రిష్ణ.

"పెళ్లి చూపులనగానే ఎంతో ఆశతో వెళ్లాడు. ఇలా జరిగేసరికి కాస్త జంకాడు పిల్లవాడు, అంతే. తెల్లవారేసరికి సర్దుకుంటాడులే" అంది బాలమ్మ.

"వెళ్లు, వెళ్లి పడుకో నాన్నా. ఇంతోటి దానికి నిన్నరాత్రి పొద్దుపోయేదాకా కూర్చుని బ్రెయిన్ వాష్ చేశాను వీడికి" అంది శారద.

కళ్లొత్తుకుంటూనే మేడమీదికి వెళ్లిపోయాడు సూర్యహా.

మర్నాడు మళ్ళీ సిద్ధం అయ్యాడు సాంబయ్య.

"ఏవిటండీ! మరి వాళ్ళు ఎదురు చూస్తుంటారు. ఏం చెప్దాం!" అన్నాడు. అరికాలిమంట నెత్తికెక్కింది క్రిష్ణకి.

"ఏమిటండీ సాంబయ్యగారు వాళ్ళు చూసేదీ, మనం చెప్పేదీనూ! బుద్ధీ బుర్రా వున్నవాళ్ళెవరైనా ఆ సంబంధం చేసుకుంటారా! చూడబోతే ఆ కుటుంబం ఓ సర్కస్ కంపెనీలా వుంది. వాళ్ళంతా జీవితంలో సగం సమయం ఆనందంతో ఏడు

## కొత్తగాలి...

**నువ్వూ నేనూ**
**ఇద్దరం ఒక్కటే**
**నీడలే అనేకం!**

– మంత్రి లక్ష్మీనారాయణ,
సిరిసిల్ల, కరీంనగర్ జిల్లా

స్తున్నారు! మిగిలిన సమయం బాధతో ఏడుస్తున్నారు. అటువంటి వారితో వియ్యమందితే మా బతుకంతా ఏడుపే మిగుల్తుంది.. వాళ్ళకో దణ్ణం. మాకొద్దు" అన్నాడు.

"ఈ కాలపు పద్ధతుల్ని బట్టి చూస్తే వాళ్ళది కాస్త భిన్నంగా వుండే కుటుంబమే అనుకోండి. కానీ పాపం మనుషులు చాలా మంచివాళ్ళు. అల్లుడికి మర్యాదలవీ ఘనంగానే చేస్తారు.." చెప్పాడు సాంబయ్య.

"వద్దన్నాను కదండీ.. మాకొద్దు" ఖండితంగా చెప్పేశాడు క్రిష్ణ.

"సర్లెండి. అంతగా వద్దనుకున్నాక ఇంకెందుకు? వాళ్ళతో ఆమాటే చెప్తాను. మనం మరో సంబంధం చూసుకుందాం!"

"ఏం చూడడమో ఏవిటో. ఏదీ కలిసి రావటంలేదు. విసుగేస్తోంది" అన్నాడు విసుగ్గా క్రిష్ణ.

"భలేవారేనండీ.. వాకిట్లో అడుగుపెట్టి వారణాసి ఎంతదూరం అన్నారట మీవంటివారే. రెండే రెండు పెళ్లి చూపులు చూసి విసిగిపోతే ఎలాగండీ!" అన్నాడు సాంబయ్య.

"ఇలా ఎంతకాలం సంబంధాలు వెతుక్కోడం, పెళ్లిచూపులు చూడడం!"

"కుదిరేదాకా చూడాల్సిందే. మధ్యలో ఆపేస్తే ఎలా మరి? ఇదుగో ఈ ఫొటో చూడండి" అంటూ మరో ఫొటో తీశాడు.

అక్షయ తూణీరాలలో బాణాలలాగా ఈయన దగ్గర ఫొటోలు తీసినకొద్దీ వస్తూనే వున్నాయనుకున్నాడు క్రిష్ణ. శారదని పిలిచాడు.

"ఇదుగో ఈ అమ్మాయి ఇంజనీరింగ్ పాసైంది. నలభై వేల జీతం. తండ్రి లాయరు. ఒక్కతే కూతురు. బోలెడంత ఆస్తి" చెప్పాడు.

"ఈ పిల్లా బానేవుంది"

"మరి అంత పెద్ద ఉద్యోగం అంటున్నారు. ఇక ఇంట్లో పనేం చేస్తుంది?" అంది శారద.

"చెయ్యదు, చెయ్యలేదు కూడానూ" ముందే చెప్పేశాడు సాంబయ్య.

"మరెలా! ఎవరు చేస్తారు. నాకసలే మోకాళ్ళ నెప్పులు. పదిసార్లు మేడెక్కి దిగలేక నా ప్రాణం పోతోంది" ఆక్రోశించింది.

"చూడండమ్మా శతకోటి దరిద్రాలకి అనంతకోటి ఉపాయాలు. ఈ రోజుల్లో వైద్యరంగం ఎంతో వృద్ధి చెందింది. మోకాళ్ళు అరిగిపోతే చిటికెలో ఇనప కీళ్ళు అమర్చేస్తున్నారు. మీరూ కీళ్ళు మార్పించుకున్నారంటే లేడిపిల్లలా పరిగెడతారు" అన్నాడు సాంబయ్య.

"అంటే ఏ ఇంజనో పాడైపోతే రిపేరు చేయించి మళ్ళీ పని చేయించినట్లు నాకీ కీళ్ళు మార్చి మళ్ళీ రంగంలోకి దింపి చాకిరీ చేయిస్తారా? అంటే ఇక నా బతుకంతా ఇంతేనా! నాకు మాత్రం విశ్రాంతి వద్దా?" అంది గద్గద కంఠంతో.

"అలా ప్రతీ చిన్న విషయానికీ అధైర్యపడితే ఎలా చెప్పండి. మీరు చెయ్యలేకపోతే ఒక వంటమనిషిని పెట్టుకోండి. చెప్పాను కదా వాళ్ళకూ ఒక్కతే పిల్ల. కాబట్టి సగం రోజులు పుట్టింట్లోనే వుంటుంది. సమయానుకూలంగా ఏదో ఉపాయం ఆలోచించాలిగానీ ముందే బెదిరిపోతే మీ పిల్లవాడికసలు పెళ్లవుతుందా?"

"ఇంతకీ ఏవిటీ మీరు చెప్పేది. నిన్న

నేమో ఇంటిపట్టున వుండే కోడల్ని తెచ్చుకుని సుఖపడమన్నారు. ఇవ్వాళేమో ఉద్యోగం కోడల్ని తెచ్చుకుని కీళ్లు మార్పించుకోమంటున్నారు" కాస్త గట్టిగానే మాట్లాడింది శారద.

"అమ్మా మన్నించాలి. ఇది మీ అబ్బాయి పెళ్లి విషయం. మీ ఇష్టం. ఏదో మీ మేలుకోరి సాయం చేస్తుంటే మీరిలా మాట్లాడ్డం అంత భావ్యంగా లేదు. మీరు చూడమంటే చూస్తున్నానుగానీ నా స్వార్థం కోసం కాదు కదా! కాదూ నీ సహాయం మాకు వద్దు అంటారా.. ఆ ముక్కే చెప్పండి. నా దోవన నేను పోతాను" అన్నాడు.

కాస్త మెత్తపడ్డారు క్రిష్ణ, శారద. 'సరే కానీ.. చూద్దాం. అన్నీ కుదిరితే మిగిలిన విషయాలలో ఏదోవిధంగా సర్దుకోవచ్చు' అనుకున్నారు.

"అదీ మంచి లక్షణం అంటే. వెంటనే పెళ్లి చూపులు ఏర్పాటు చేస్తాను. ముచ్చటగా మూడో సంబంధం. ఇది కచ్చితంగా ఖాయం అయిపోతుంది చూడండి" ధైర్యం చెప్పి వెళ్లిపోయాడు సాంబయ్య.




**మ**ళ్ళీ ఆదివారం మధ్యాహ్నం పెళ్లిచూపులు. "నాలుగ్గంటలకి తయారుగా వుండండి నేనొచ్చి తీసికెళ్తాను" అన్నాడు సాంబయ్య.

అలాగే రెడీ అయి కూర్చున్నారు నలుగురూ. ఎవరిలోనూ ఉత్సాహం లేదు. మొక్కుబడిగా వెళ్తున్నట్టుగానే వున్నారు.

నాలుగున్నరకి వాకిలిముందు పోలీస్ వేన్ వచ్చి ఆగింది. వాహనం ఆగిన శబ్దానికి లేచి వాకిట్లోకి వచ్చి చూసిన శారద అదిరిపడింది.

"ఏవండీ పోలీసులొచ్చారు? మనింటికి పోలీసులొచ్చారు? " అంటూ లోపలికి పరిగెట్టింది.

"పోలీసులా? మనింటికా? ఎందుకూ? " అంటూ పరుగున బయటికి వచ్చేశారు తండ్రీ కొడుకులు.

యూనీఫాంలో వున్న ఒక కానిస్టేబుల్ వీళ్ళ దగ్గరికి వచ్చాడు. "మా సార్ మిమ్మల్ని తీసుకురమ్మన్నాడు" అన్నాడు మర్యాదగానే. "నన్నా ఎందుకూ? నేనేం తప్పు చేశాను? " అన్నాడు క్రిష్ణ భయం భయంగా. ఇంతలో పోలీసు వేన్‌లో కూర్చున్న సాంబయ్య తలబైటికి పెట్టి "రండి రండి, త్వరగా వెళ్ళాలి. మళ్ళీ వర్షం వచ్చేస్తుంది" అన్నాడు.

"ఏవిటండీ? ఈ పోలీసు వేను ఏమిటి? నన్నెక్కడికి తీసికెళ్తున్నారు? " అడిగాడు క్రిష్ణ మళ్లీ.

"ఇంకెక్కడికి? పెళ్ళివారింటికి"

"పెళ్ళివారింటికా? పోలీస్ వేన్‌లోనా? " అర్థం కాలేదు క్రిష్ణకి.

"అయ్యో మీకు చెప్పలేదా? పెళ్ళికూతురి మేనమామ సర్కిల్ ఇన్‌స్పెక్టరు కదా! అందుకే ఈ బండి పంపించారు. రండి రండి.. మళ్ళీ వర్షం వస్తుంది" అని తొందరపెట్టాడు.

"ఓరి వీళ్ళ అఘాయిత్యం కూలా. పెళ్ళివారిని తీసుకురావడానికి పోలీసు వాహనం తప్ప వేరే ఏమీ దొరకలేదా? ఇంకా నయం కుక్కల బండి పంపించారు కాదు" విసుక్కున్నాడు క్రిష్ణ.

"నేను మాత్రం చచ్చినా ఈ వేన్లో ఎక్కను. మనం కార్లో వెళ్దాం!" అన్నాడు సూర్యహా!

"అవునలాగే చేద్దాం" అంది శారద. అందరూ కార్లో వెళ్దామంటే కానిస్టేబులు ఒప్పుకోలేదు. 'ఒక్కళ్ళనైనా తీసుకురాపోతే మాసార్ తిట్టిపోస్తాడు' అని బలవంత పెట్టి క్రిష్ణని చెయ్యిపట్టుకుని పోలీసు వేన్లో ఎక్కించాడు.

చుట్టుపక్కల జనం అంతా రాంగోపాల్ వర్మ నిర్మించిన 'సర్కార్'సినిమాలో అమితాబ్ బచ్చన్ అరెస్ట్ సీన్ చూసినట్లు చూశారు.

'ఏవిటో పాపం ఆ క్రిష్ణగారు చాలా మంచివారు. పోలీసులు ఎందుకు తీసుకురమ్మన్నారో!' అనుకున్నారు జాలిగా.

ముందు పోలీసు వేను, దానివెనక కారు. గమ్యం చేరారు పెళ్ళివారు. ఇల్లు చాలా బావుంది. ఇంటి ముందు చిన్నగార్డెన్ వుంది.

వాకిట్లోకి ఎదురొచ్చారు పిల్ల తండ్రీ, మేనమామ, పెళ్ళికూతురు.

ఇంట్లోనే అయినా పెళ్ళి చూపుల వేడుకకి వారి వారి డ్రస్‌లు అవసరం లేకపోయినా పిల్ల తండ్రి నల్లకోటేసుకునే వున్నాడు. మేన మామ పోలీస్ యూనిఫాంలో వున్నాడు. పెళ్ళికూతురు లేత నీలం రంగు మీద చెమ్కీలు కుట్టిన చీర కట్టుకుని వుంది.

సాదరంగా ఆహ్వానించి లోపలికి తీసుకువెళ్ళారు. కూర్చోబెట్టి కూల్‌డ్రింక్‌లు ఇచ్చింది పెళ్ళికూతురు. లోపలినించి తల్లి వచ్చింది. అందరికీ వినయంగా నమస్కరించి ఒక పక్కగా కూర్చుంది తలొంచు కొని.

బాలమ్మకి ఇదంతా వింతగా తోచింది. "ఇదేవిటి శారదా.. పిల్లేమో తల్లి చెయ్యాల్సిన మర్యాదలన్నీ చేసేస్తోంది. తల్లి చూడబోతే పెళ్ళికూతురిలా ఒక మూల కూర్చుంది" అంది.

"ఏమో నాకు మాత్రం ఏం తెలుసు? పెళ్ళికూతురు చదువుకుని ఉద్యోగం చేస్తోంది కాబట్టి చొరవ ఎక్కువనుకుంటాను. అన్నీ కూతురు చూసుకుంటుందని తల్లి నిమ్మకు నీరెత్తినట్లు కూర్చుంది కాబోలు" అంది శారద మెల్లిగా.



"ఆ! చెప్పండి సార్, ఏమిటి కబుర్లు? " అంటూ మెదలుపెట్టాడు లాయరు.

"ఆ ఏముందండీ! మామూలే. ఈ ఏడు ఎండలు బాగా ఎక్కువగా ఉన్నాయి. ఇప్పుడే ఇట్లావుంటే ఏప్రిల్, మేలలో

మాడ్చేస్తాయి" అన్నాడు క్రిష్ణ.

"ఆ ఎండలూ, ధరలూ వంటి మామూలు విషయాలు మాకు పట్టవండీ. అవన్నీ ఆడవాళ్ళూ, ఏ పనీపాట లేనివాళ్లూ మాట్లాడుకునే విషయాలు. మాకు సవా లక్ష సమస్యలుంటాయి ఎన్ని కేసులో ఎన్ని వ్యవహారాలో" అన్నాడు లాయరు.

"ఉద్యోగం చేసే రోజుల్లో మాకూ సవా లక్ష వ్యవహారాలుండేవి. రిటైరయ్యాక ఇంకేం పనుండదు కదా!" సర్ది చెప్పుకు న్నాడు క్రిష్ణ.

"మేము లాయర్లం. మాకు రిటైర్‌మెంట్ అంటూ వుండదు. అందులోనూ ఇప్పుడు మాకు పట్టిందల్లా బంగారంలాగా వుంది".

"అలాగా" ఏదో ఒకటి అనకపోతే బావుండదని అన్నాడు క్రిష్ణ.

"అయ్యో అంతేగా మరి. ఇప్పుడు పరిస్థి తులు ఎలా వున్నాయండీ? న్యాయం ధర్మం వెతికి చూసినా లేవు కదా! ఎదుటి వాడు నేరం చేస్తేనే అరెస్టు చెయ్యాలి, కేసుపెట్టాలి అని రూలేం లేదు కదా! మనకు వాడిమీద కోపం వస్తే చాలు ఏదో ఓ వంకన అరెస్ట్‌చేసి లోపలికి తోసేస్తు న్నారు.. అదుగో మా బావలాంటివాళ్ళు" అన్నాడు లాయరు.

పెళ్ళున నవ్వేడు పోలీసు మామయ్య.

"మా బావ చెప్పింది అక్షరాలా నిజం. హెల్మెట్ పెట్టుకోలేదనీ, సీట్ బెల్ట్ కట్టు కోలేదనీ చెప్పి ఫైను వేసేసి కోర్టుకి లాగచ్చు. మరీ ఆగ్రహం వచ్చిందనుకోండి



## కొత్తగాలి...

**నిండుపున్నమి**
**లోకానికి నెలకోసారే!**
**నేను ప్రతిరోజూ**
**నిన్ను చూస్తూనే ఉన్నానుగా!!**

—ఊర్మిళా జ్యోతి, మహబూబ్‌నగర్

అనుమానాస్పదంగా వుంది ఇతని వ్యవహారం అని పట్టుకోవచ్చు. ఆయుధాలు ఇంట్లో పెట్టుకున్నాడని కేసు బనాయించి జైల్లో పెట్టచ్చు" అన్నాడు.

"ఒకసారి కేసు పెట్టాక దానిలోంచి బయటపడాలంటే ఎంతోకష్టం కదండీ. మరి మా దగ్గరికి ఒకసారి వస్తే ఓ పట్టాన కేసుతేలదు కదా! మాబోటి మంచివాళ్ళం తేల్చేద్దాం అనుకున్నా అవతలి పార్టీ వాళ్ళు వాయిదాలు వేయించేస్తారు" లాయరు చెప్పాడు.

"మీవంటి మామూలు వాళ్ళపని దిన దిన గండం నూరేళ్ళ ఆయుర్దాయం అన్నట్లుగా వుంది ప్రస్తుతం. పెద్దవాళ్ళెవరినీ నొప్పించకుండా వాళ్ళ జోలికి వెళ్ళకుండా గడిచినంత కాలం ఫర్వాలేదు. ఒకసారి ఏదైనా గొడవలో ఇరుక్కుంటే ఇక మీ పని మటాష్" అన్నాడు పోలీసు మామయ్య.

"మేమలా ఇంకొకరి వ్యవహారాలలో జోక్యం చేసుకోము. మా పాటికి మేముంటాం" దీనంగా చెప్పాడు క్రిష్ణ.

"అలా వున్నా కూడా భద్రత లేకుండా పోతోంది కదా. మొన్నామధ్యన ఒక పెద్ద మనిషి పాపం మీలాగే చాలా మంచివాడు. ఆయనకి ఊరి చివర ఆరొందల గజాల స్థలం ఉంది. అందులో వంద గజాలు ఎవరో ఆక్రమించుకొని ఇల్లు కట్టేసుకుంటుంటే ఇదేం అన్యాయమని అడిగాడట. అవతలివాడేమో నేను మర్యాదస్తుడిని కాబట్టి వంద గజాలే నా స్థలంలో కలుపుకున్నాను. మొత్తం ఆక్రమిస్తే మాత్రం ఏం చేస్తావ్? అన్నాడు. ఈయనకి కోపం వచ్చి పోలీసులకి చెప్పాడు. పోలీసులు మాత్రం ఏం చేస్తారు? ఆ ఆక్రమించుకున్నవాడు చాలా గట్టివాడాయెను! అందుకే.. గోకుల్‌చాట్ పేలుడు సంఘటనలో సంబంధం వుందని అనుమానంగా ఉంది.. పదమని ఈ పెద్దమనిషి మీదే కేసు బనాయించారట. ఇంతకీ నేను చెప్పొచ్చేది ఏమిటంటే ఎవరైనా కావాలంటే మీలాంటి వాళ్ళని ఈజీగా ఇరికించెయ్యవచ్చు" అన్నాడు పోలీస్ మావయ్య.

క్రిష్ణకి కాళ్ళూ చేతులూ వణికాయి. ఇదెక్కడి పీడాకారం నేరకపోయి వచ్చామనుకున్నాడు.

అంతలో పెళ్ళికూతురొచ్చి ఆదుకుంది "ఏవిటి నాన్నా.. ఎప్పుడు చూసినా మీకేసులూ, గొడవలూనూ. మావయ్యా.. నాన్నకి లేకపోతే నీకైనా వుండద్దు బుద్ధి?" వాళ్ళిద్దరినీ మందలించి వాళ్ళకి టిఫిను పెట్టింది.

తర్వాత శారద పక్కనే కూర్చుని, "మీరు చాలా అందంగా వున్నారాంటీ! మీ చీరె చాలా బావుంది" అని పొగిడింది.

బాలమ్మ మెడలోని గొలుసు చూసి "ఇదేం డిజైన్ బామ్మగారూ! కొత్త మోడల్‌లా వుందే. ఎక్కడ కొన్నారు.. తనిష్కలోనా? " అని అడిగింది.

"కొత్తది కాదమ్మా పాతదే. గోవర్ధన గొలుసు అంటారు. నా పెళ్ళి నాటిది" చెప్పింది బాలమ్మ.

"మీరు చాలా హేండ్‌సమ్‌గా వున్నారు" అని సూర్యంని పలకరించింది. అతని హాబీలూ అవీ అడిగి తెలుసుకుంది. పాటలంటే ఇష్టమని తెలుసుకుని ఆనందించింది. "మీకు అభ్యంతరం లేకపోతే నేను పాట పాడతా" అంది.

"ఇప్పుడా పాటలూ అవీ వద్దులేవే!" అని వారించాడు పోలీసు మావయ్య.

"కాబట్టి క్రిష్ణగారూ.. పెద్దవాళ్ళను నొప్పించే భావన మీ మనసులో వున్నా తుడి చెయ్యండి. నేరంచేసి తప్పించుకోడం అసాధ్యం. పారిపోయినా వెతికి పట్టుకుంటారు" అన్నాడాయనే మళ్లీ.

"అబ్బా.. నువ్వుండు మావయ్యా! ఎవరి జాగర్తలో వాళ్ళుంటారు. నువ్వు భయపెడితే మాత్రం అవతలివాళ్ళు బెదిరిపోతారా, ఏం? అలా అయితే అసలు నేరాలే జరగవు" అని ఆయనని మందలించింది.

"మీరు పాట వినండి" అని 'కళ్ళల్లోకి కళ్ళుపెట్టి చూడవెందుకూ!' పాట పాడింది సూర్యహా వంక చూస్తూ.

పాట బాగానే ఉంది.

"ఎలా వుంది ఆంటీ? " అని అడిగింది.

"బాగానే వుందమ్మా. అయినా కొత్త పాటలతో అంత పరిచయం లేదు" అంది శారద కాస్త మొహమాటంగా.

అయితే ఓ పాతపాట పాడతాను అనేసి "ఎందుకే నీకింత తొందర" అని మల్లీశ్వరి లోని ఓ పాట పాడింది చాలా మధురంగా.

"చాలా బావుందమ్మా" అని మెచ్చుకున్నారు పెళ్ళివారు.

పోలీసు మామయ్య మాత్రం "ఏవిటా పిచ్చి పాటలు? " అని మందలించాడు.

మళ్లీ ఆయనే "నేను చెప్పిన మాట గుర్తుందిగా నేరంచేసి పారిపోయినా పట్టుకు రాగలం" అన్నాడు సూర్యహా వంక చూస్తూ

సూర్యహా దీనంగా చూసి "అమ్మా ఏవిటే నాకీ అల్లరీ" అన్నాడు మాయాబజారు సినిమాలో మాయా శశిరేఖలాగా.

"ఏమిటోరా నాయనా అంతా నాఖర్మ" అంది శారద రేవతీ దేవిలాగా.

"ఆ ఏవిటండీ క్రిష్ణగారూ! మాకు మీ సంబంధం ఓకే. మీరూ సరేనంటే వెంటనే ముహూర్తాలు పెట్టుకుని ఆ మూడుముళ్ళూ వేయించేద్దాం" అన్నాడు లాయరు.

క్రిష్ణకి కోపం, దుఃఖం ఏక కాలంలో కలిగాయి. 'ఈ సంబంధం ఒప్పుకోవడం కంటే మూకుమ్మడిగా ఆత్మహత్య చేసుకోవటం ఉత్తమం. ఆ మాటే అంటే ఏదైనా కేసులో ఇరికించేస్తాడేమో అని భయం. బుద్ధి గడ్డి తిని పెళ్ళిచూపులకి వచ్చాను' అనుకున్నాడు.

"ఇంటికెళ్ళి ఒక్కసారి సంప్రదించుకుని చెప్తాం" అన్నాడు

"ఎందుకూ అందరూ ఇక్కడే వున్నారుగా. కావలిస్తే మేడ మీదకెళ్ళి మాట్లాడుకోండి" అన్నాడు పోలీసు మామయ్య.

ఇక బాలమ్మ చూస్తూ వూరుకోలేకపోయింది. "లేడికి లేచిందే పరుగా నాయనా? ..అంత హడావుడి ఎందుకూ? మాకు ఇంట్లో పెద్దవాళ్ళున్నారు. వాళ్ళని సంప్రదించనిదే మేము ఏ పనీ చెయ్యం. ఇంటికెళ్ళి ఆలోచించుకు చెప్తాం? " అంది విసురుగా.

ఆవిడ వంక కొరకొరా చూశాడు పోలీసు మామయ్య.

"సర్లేండి. ఇంటికెళ్ళగానే మీరు ఫోన్లు చేసి మాట్లాడండి. మేము రేపొద్దున మీ ఇంటికి వస్తాం" అన్నాడు లాయరు.

"వెళ్ళొస్తాం" అన్నారు. పెళ్ళికూతురు బొట్టుపెట్టి తాంబూలం ఇచ్చింది. ఆ తర్వాత సూర్యహాని చూసి జాలి నిండిన స్నేహంతో నవ్వింది.

అందరూ బయటికి వచ్చారు. మళ్ళీ పోలీసు వ్యానులో దిగబెడతాం అన్నారు గానీ, ససేమిరా వద్దన్నాడు క్రిష్ణ. "మాకు వేరేచోట పనుంది. మా కార్లో వెళ్తాం" అన్నాడు.

అందరూ కారు ఎక్కారు

## కొత్తగాలి...

# నేలరాలిన పువ్వు పసిడి మొగ్గకు గురువుగా గీతోపదేశం

-యలమర్తి అనూరాధ,
పెనుగొండ, ప.గో.జిల్లా

"ఏవిట్రా ఈ దరిద్రగొట్టు సంబంధం!" అంది బాలమ్మ. ఆ సాంబయ్యగాడు ఏదైనా ప్రలోభానికి లొంగి గూడుపుఠాణీ చేస్తున్నాడేమో! వాడిని ఇహ నాగుమ్మం తొక్కనివ్వను" అన్నాడు క్రిష్ణ ఆగ్రహంగా.

"వాడిని గుమ్మం తొక్కనివ్వరు సరే. రేపు లాయరూ పోలీసు వచ్చేస్తారు కొంప మీదికి. ఏం చేద్దాం!" అంది శారద భయం భయంగా.

"తెల్లారుజామున లేచి సింహపురి పట్టుకుని బాపట్ల వెళ్దాం. ప్రస్తుతానికి తప్పుకుంటే అక్కడినించే మా ఫ్రెండుకి ఫోన్ చేసి ఆపద గట్టెక్కించమంటాను. వాడికి డి.జి.పి బాగా తెలుసు" అన్నాడు క్రిష్ణ.

ఇంటికి చేరగానే ఇరుగుపొరుగులు పరుగున వచ్చారు. "ఏంటీ అప్పుడే వదిలేశారా? అసలెందుకు పట్టుకున్నారు?" అన్నారు కంగారుగా.

"అటువంటిది ఏమీలేదు. పెళ్ళిచూపులకి వెళ్ళాం. వియ్యాలవారు మర్యాదగా పోలీసు వ్యాను పంపించారు" అని చెప్పారు వీళ్ళు.

"అలాగా. ఇంకా ఏమిటో అని బెదిరిపోతున్నాం. మంచి శుభవార్తే చెప్పారు. పోలీసువాళ్ళతో వియ్యం అందితే అంతకంటే ఇంకేం కావాలి. మీ అబ్బాయికీ మీకూ కూడా కొండంత అండ. మీతో పాటు మాకూ, మా కాలనీకి కూడా దొంగల భయం వుండదు. ఈ సంబంధమే ఖాయం చేసుకోండి" అని చెప్పి వెళ్ళిపోయారు.

"పిల్లికి చెలగాటం, ఎలక్కి ప్రాణ సంకటం అంటే ఇదే" విసుక్కున్నాడు క్రిష్ణ.

"...మరి సింహపురికి వెళ్ళాలా, సంచీ సర్దనా?" అడిగింది శారద జాలిగా చూస్తూ. సూర్యహా మాత్రం రానన్నాడు.

"నాకు ఆఫీసులో పనుంది. నేన్రాను. అయినా ఆ వెధవలకి భయపడి పారిపోవడం ఏమిటీ? మా కిష్టం లేదు.. నీ దిక్కున్న చోట చెప్పుకో అందాం. ఏంచేస్తారు? అంతగా అవసరం అయితే మనమూ దౌర్జన్యానికి దిగుదాం. మీడియా వాళ్ళని పిలుద్దాం. మా ఫ్రెండ్స్‌ని రంగంలోకి దింపుతాను" అన్నాడు ఆగ్రహంగా.

ఎవరికీ తిండి ధ్యాసలేదు. సూర్యహా హోటలుకి వెళ్ళి అందరికీ మసాలా దోసెలు తీసుకొచ్చాడు. తినమని బలవంతపెట్టాడు. "ఏం భయంలేదు పడుకోండి" అని ధైర్యం చెప్పి మేడ మీదికి వెళ్ళిపోయాడు.

"భయపడకండి అన్నింటికీ ఆ భగవంతుడే వున్నాడు" అని చెప్పి వెళ్ళిపోయింది బాలమ్మ.

"భయపడకండి.. భయపడకండి.. అని అందరూ ధైర్యం చెప్తున్నారు బాగానే వుంది. తీరా తెల్లారి పొద్దున్నే ఆ బావా, బామ్మరిదీ వచ్చి నా పీకల మీద కూర్చుంటారేమో. పోలీసు వేనెక్కి పెళ్ళిచూపులకి వెళ్తేనే నా పరువు బజార్నపడింది. రేపు మళ్ళీ వ్యానులో వాళ్ళొచ్చి అల్లరీ ఆగం చేస్తే నేను ఈ కాలనీలో తలెత్తుకుని తిరగలనా!" అన్నాడు క్రిష్ణ.

"ఏం ఫర్వాలేదులెండి" అని ధైర్యం చెప్పింది శారద.

కాలింగ్ బెల్ మోగింది. "ఇంత రాత్రి వేళ ఎవరబ్బా?" అంది కంగారుగా శారద. ఆ వెంటనే పార్థసారథి గొంతు

వినిపించింది, "అమ్మాయీ శారదా".

"అన్నయ్యగారొచ్చారు" అంటూ పరుగున వెళ్ళి తలుపు తీసింది.

"ఏమిటమ్మా మనవాడిని పోలీసులు పట్టుకెళ్ళారుట. బెయిల్ ఇచ్చి విడిపించుకురావాలా? " కంగారుగా లోపలికివచ్చిన పార్థసారథికి క్రిష్ణ ఎదురుగా కనబడే సరికి ప్రాణం లేచి వచ్చింది.

'ఏరా బెయిలిచ్చేశారా! వచ్చేశావా? ' అన్నాడు ఆనందంగా.

"అప్పుడే నీదాకా వచ్చిందిట్రా ఈ విషయం? " అడిగాడు క్రిష్ణ.

"అవున్రా.. ఇప్పుడే ఊర్నించి వచ్చాను. వచ్చీరాగానే ఈ విషయం తెలిసి కాళ్ళూ చేతులూ ఆడలేదు. పరిగెత్తుకుని వచ్చేశాను. ఇంతకీ నిన్నెందుకు పట్టుకున్నార్రా పోలీసులు? " అడిగాడు.

"శ్రీరామచంద్రా! అదికాదురా" అని అసలు విషయం చెప్పాడు క్రిష్ణ.

"బాగానే ఉంది సంబడం. ఎంత పోలీసాఫీసరైతే మాత్రం పోలీసు వేను పంపిస్తాడా? ఏ టవేరానో, ఇన్నోవానో పంపించవచ్చు కదా! ఆయన పంపేడే అనుకో నీ వివేకం ఏమైంది? " విసుక్కున్నాడు.

"...సర్లే. ఇంతకీ సంబంధం నచ్చిందా? " అడిగాడు.

"నాబొంద అదో పిచ్చి సంబంధం. పిల్ల తండ్రి లాయరు. ఆయనకో పోలీసు బావ" విసుగ్గా చెప్పాడు క్రిష్ణ.

"లాయరూ, పోలీసూనా. కొంపతీసి హనుమంతరావు కూతుర్ని చూడ్డానికి గానీ వెళ్ళావేమిట్రా? " సందేహంగా అడిగాడు.

"అవున్రా.. అతడి పేరు హనుమంతరావే. నీకు తెలుసా? "

"తెలియకపోవడం ఏం? నాకు దూరపు బంధువు కూడానూ. వాడో పిచ్చివెధవ. వాడి కూతురేమో ఒకర్ని ప్రేమించింది. అతన్ని తప్పించి పెళ్ళి చేసుకోనని భీష్మించుకుని కూర్చుంది. వాడేమో వినిపించుకోడు. నయానా భయానా పెళ్ళి చెయ్యాలని వీడి ఆశ. పెళ్ళి చూపులకు వచ్చిన వాళ్ళందరికీ మర్యాదలు చేసి పాటలూ పద్యాలూ వినిపించి పంపిస్తుంది ఆ అమ్మాయి. ఇంతకీ ఈ తలతిక్క సంబంధం నీకెవరు చెప్పార్రా? " అడిగాడు పార్థసారథి.

"ఆ ఒకాయన వున్నాడులే. సాంబయ్య అనీ!"

"చంపావు పో. ఆ సాంబయ్యగాడా నీకు సంబంధం చూపించింది. ఇదొక్కటేనా.. ఇంకేమైనా సంబంధాలు సూచించాడా? " అడిగాడు. వివరంగా చెప్పాడు క్రిష్ణ.

"ఆ సాంబయ్యకి చేతుల్లో ఉన్నదంతా లాగేసుకున్నారు కొడుకులు. ఏదైనా సంబంధాలు కుదిరి వాళ్ళ ద్వారా డబ్బు

## అదే రైతు

ఓసారి శ్రీశ్రీ మిత్రులతో కలిసి ఓ నాటక ప్రదర్శనకు వెళ్లారు. అందులో ఓ నటుడు 'పాతాళంబున' అని పద్యం చెదువుతూ చెయ్యి పైకెత్తి చూపాడు. పక్కనున్న వారంతా శ్రీశ్రీతో అతనలా నటించడం తప్పే




కదా అంటే శ్రీశ్రీ 'అదే శుద్ధరైతు' అన్నారు. తర్వాత ఆయనే నవ్వుతూ 'ఎంచేతంటే ఆంధ్ర నాటకరంగం పాతాళానికి దిగువన ఉంది కాబట్టి ఆ నటుడు పాతాళం అంటే చేయి పైకిచూపాడు' అని చమత్కరించారు.

రాబట్టాలని ఇలాటి పిచ్చికేసులన్నీ పట్టుకుంటాడు. ఖర్మ, నేను పది రోజులు ఊరెళ్లడంతో వచ్చింది ఈ గొడవంతా!" అన్నాడు.

"నిజమే అన్నయ్యగారూ! కాస్త మావాడి పెళ్ళయ్యేదాకా మీరు ఈయన్ని వదిలి ఊర్లాగ్రా వెళ్ళకండి" బ్రతిమాలింది శారద.

"ఒరే, రేపు ఇంటిమీదికి గానీ వస్తారా ఆ పోలీసూ, లాయరూనూ? " భయంగా అడిగాడు క్రిష్ణ.

"వాడి మొహం.. వాడు కాయితంపులి .. అంతే" అన్నాడు పార్థసారథి.

"మరి ఆ సాంబయ్య విషయం ఏం చేద్దాం? ఎలా వదిలించుకుందాం? " అంది శారద.

"వాడికి నేను చెప్తాను. రేపు నిన్నోచోటికి తీసుకెళ్తాను. వాళ్ళు చాలా మంచి సంబంధాలు చూపిస్తారుట" అన్నాడు.

మర్నాడు ఇద్దరు మిత్రులూ వెళ్ళారక్కడకి. అంతా డాబుగావున్న వాళ్ళే కనిపించారు. 'ఇటువంటి వాళ్ళైతే మనకు తగిన మాచ్ చెప్తారు' అనుకున్నాడు క్రిష్ణ.

కానీ వాళ్ళు పెదవి విరిచారు. "మేము అమెరికా పిల్లలకే చూస్తాం ఇండియాలో వుండే పెళ్లికొడుకు అంటే ఎవరూ ఆసక్తి చూపించడం లేదు. అయినా నిరాశపడకండి. చూద్దాం" అన్నారు.

నీరుగారిపోతూ బయటికి వచ్చారు మిత్రులిద్దరూ. అక్కడ ఒకాయన కనిపించి ఒక కరపత్రం ఇచ్చాడు.

బ్రాహ్మణ వధూవరుల పరిచయ వేదిక అంటూ కింద వివరాలన్నీ పొందుపరిచారు. "ఇది మంచి వేదిక. వెళ్ళి ప్రయత్నించి చూడండి? " అన్నాడు.

మొదట్లో విసుగ్గా వున్నా రాన్రాను ఓర్పు అలవడింది క్రిష్ణకి. అందులో ఇచ్చిన నెంబరుకి ఫోన్ చేశాడు ఇంటికొచ్చీ రాగానే. 'వీలైతే ముందు రిజిస్ట్రేషన్ చేయించుకోండి. లేకపోయినా ఫర్వాలేదు. అక్కడికక్కడే కూడా చేసుకోవచ్చు అబ్బాయిని వెంటబెట్టుకు రండి' అంటూ మరి కొన్ని వివరాలు చెప్పారు.

ఆ విషయాల మీద ఇంటికెళ్ళి చర్చించారు. 'మరీ పిల్లాడిని వెంట బెట్టుకుని ఏం వెళ్తాంలే? అసలా వ్యవహారం ఎలా వుంటుందో చూసొద్దాం' అనుకున్నారు. మళ్ళీ మిత్రులిద్దరూ బయలుదేరారు.

ఒక కమ్యూనిటీ హాల్‌లో జరుగుతుంది పరిచయ వేదిక. సందడిగా వుంది.

బయటే నాలుగు బల్లలు వేసుకుని కూర్చున్నారు నిర్వాహకులు.

'ముందుగా రిజిస్టర్ చేసుకోలేదా' అన్నారు. లేదని చెప్తే, 'అక్కడికి వెళ్ళి మీ వివరాలు చెప్పండి!' అని మరో బల్ల దగ్గరికి పంపించారు.

అక్కడ కూర్చున్నాయన వీళ్ళ వంక చూసి "ఆ! చెప్పండి మీలో పెళ్ళి కొడుకు ఎవరు? " అడిగాడు. వీళ్ళిద్దరూ తడబడిపోయారు. "ఛ ఛ.. మాక్కాదు. మా అబ్బాయికి" చెప్పారు.

"మరి అబ్బాయిని తీసుకురాలేదేం? అన్నాడాయన అసహనంగా. "అంటే వాడికి ఆఫీసుంది. అందుకే రాలేదు" చెప్పాడు పార్థసారథి.

"ఆదివారం ఆఫీసేమిటండీ.. అదో సాకు కాకపోతేనూ. మేము ఎన్నో ఆలోచించి ఈ ఏర్పాటు చేస్తే, మీరంతా పాత పద్ధతిలో ఆలోచించి ఇదుగో ఇలా వచ్చేస్తారు. సరే కానివ్వండి.. ఏం చేస్తాం? లోపలికి వెళ్ళండి" అని పంపించాడు.

లోపల స్టేజి మీద పదిమంది పెద్ద మనుషులు కూర్చున్నారు. ఒక అబ్బాయి వివరాలు చదివి, ఆ తర్వాత ఒక అమ్మాయి వివరాలు వంతుల వారీగా

చదువుతున్నారు.

ఆ వివరాలు తమకు సరిపోతే కింద జనంలో వాళ్ళు లేచి నిలబడటమో, చేతు లెత్తడమో చేస్తున్నారు. క్రిష్ణ మనసు చివు క్కుమంది. కాస్త ముందు జాగర్తపడి ముందే పేరు నమోదు చేయిస్తే అక్కడు న్నవాళ్ళు తన కొడుకు పేరు చదివే వాళ్ళు. చేతులెత్తే అగత్యం తప్పేది అనుకున్నాడు.

పది మంది పేర్లు చదివాక ఒక అమ్మాయి వివరాలు వీళ్లకి సరిపోయేలా వున్నాయి. 'అయిదూ ఆరు పొడుగు. ఎమ్.సీ.ఏ.'

క్రిష్ణా 'చెయ్యెత్తు' అంటూనే, లేచి నిల బడి చెయ్యెత్తేశాడు పార్థసారథి. మరో ఆరేడుగురు చేతులెత్తేరు.

"ఈ అమ్మాయి తరపువాళ్ళు మేడమీద నాలుగో నెంబరు గదిలో వుంటారు. మీరందరూ వెళ్ళి వాళ్ళను కలుసుకోండి. దయచేసి క్యూ పద్ధతిని పాటించండి" చెప్పారు మైకులో. వెంటనే అందరూ మేడ మీదికి వెళ్ళారు. పైన ఆరు గదులు న్నాయి. అదిగాక పెద్ద హాలు. హాల్లో కుర్చీలు.

హాల్లో ఒక మూల బల్ల దగ్గర కూర్చుని వున్నాడు జ్యోతిష్యుడు. అక్కడ అందరూ క్యూలో నిలబడి ఉన్నారు. వీళ్ళిద్దరూ వెళ్ళి నిలబడ్డారు. తమ వంతు రాగానే సూర్యహో జాతకం ఇచ్చి నాలుగో నెంబరు అమ్మాయి అని చెప్పారు.

ఆయన రెండు జాతకాలూ చూపించి పచ్చజెండా ఊపాడు. హమ్మయ్య అను కుంటూ వెళ్ళి నాలుగో నెంబరు గది ముందు నిలబడ్డారు. అక్కడ ఇంకో ఆరుగురు వున్నారు. ఒక్కొక్కరినీ లోపలికి పిలుస్తున్నారు.

అయిదుగురు అయిపోయారు. "హమ్మయ్య! అదుగో వాళ్ళు వెళ్ళగానే మనవంతు వస్తుంది" అన్నాడు పార్థసార థి ఆనందంగా.

**కొత్తగాలి...**

**వ్రతానికి కొత్త**
**చీర అడిగిందామె**
**వరకట్నం బ్యాలెన్స్**
**ఫ్లాష్.. ఫ్లాష్...**

*– యన్.కె.నాగేశ్వరరావు,*
*పెనుగొండ, ప.గో.జిల్లా*

కానీ అక్కడా చుక్కెదురు అయింది. వీళ్ళ కంటే ముందున్నవాళ్ళు ఆ సంబంధం ఖాయం చేసేసుకున్నారు. వాళ్ళు తెలివిగా పిల్లాడిని వెంటబెట్టుకొ చ్చారు. అక్కడికక్కడే కుదిరిపోయింది.

"సర్లే, రాసిపెట్టి లేదు. కిందికెళ్ళి కూర్చుందాం. మళ్ళీ మనకు కావలసిన వాళ్ళు ఎవరైనా తటస్థ పడతారేమో?" అంటూ బయలుదేరాడు పార్థసారథి.

క్రిష్ణకి కడుపులోంచి దుఃఖం తన్నుకొ చ్చింది, "ఎందుకురా నన్నిలా ఏడిపించుకు తింటావ్? నీకు నేనేం అన్యాయం చేశాను? ఇలా అని ముందే చెప్తే నేనూ మా వాడిని వెంటబెట్టుకొచ్చేవాడిని" అన్నాడు దీనంగా.

"ఒరి నీ మొహం సంతకెళ్ళా? నా మీద పడి ఏడుస్తావేంరా? మొదటి నించి నీది ఇనప పాదం. చిన్నప్పుడూ అంతే. సిని మాకెళ్ళి క్యూలో నుంచుంటే సరిగ్గా నీ దగ్గ రికి వచ్చేసరికి కిటికీ మూసేసి హాలు నిండినది అని బోర్డు తగలించేవాళ్ళు. రైల్లో రిజర్వేషన్ కోసం వెళ్తే నీ ఛాన్సు వచ్చేసరికి వాళ్ళు భోజనాల టైం అయిం దని వెళ్ళి పోయేవాళ్ళు" పార్థసారథికీ విసుగొచ్చింది.

క్రిష్ణ మొహం మరీ మాడిపోయింది. "అవన్నీ ఇప్పుడెందుకులే పద ఇంటికి వెళ్దాం" అన్నాడు.

"ఇప్పుడు ఇంటికెళ్ళి మాత్రం ఏం

చేస్తాం? ఇక్కడ లక్షణంగా పులిహోర, పరవాన్నం వేసి భోజనాలు పెడతారు. తిని సాయంత్రం నాలుగింటి దాకా కూచునే వెళ్దాం" అన్నాడు పార్థసారథి.

"నాకంత ఓపిక లేదు. నేనుండను. వెళ్దాం పద" అన్నాడు క్రిష్ణ విసుగ్గా.

ఇప్పుడు వీడి వెంటవెళ్తే కార్లో తిట్టిపో స్తూనే ఉంటాడు. దానికి బదులు భోజనం చేసి ఇక్కడే కూర్చుంటే మరికాసిని వివ రాలు తెలుస్తాయి. వీడి కొడుక్కి కాకపో యినా ఇంకెవర్కైనా ఉపయోగపడతాయి అనుకుని, 'నేన్రాను, నువ్వెళ్ళు' అనేశాడు.



శారద హాల్లోనే ఉంది. భర్తని చూసి ఏం జరిగింది. కాయా పండా అని అడగ బోయి మొహం చూసి మానేసింది. "అన్నం పెట్టనా" అంది. చిరాగ్గానే భోజనం ముగించాడు, జరిగినదంతా ఆగ్రహంగా చెప్తూనే.

"అయితే ఈసారి కూడా ఏమీ సాను కూలం అవలేదన్నమాట" అంది బాలమ్మ.

"ఈసారి కూడా అన్నయ్యగారిని అక్కడ వదిలేసి మీరొచ్చేశారా? చూస్తుంటే మీకు ఆయన సాయం చేస్తున్నట్లుగా లేదు.. మీరే ఆయన్ను ఉద్ధరిస్తున్నట్లుగా ఉంది. ఏ మాటకామాటే చెప్పుకోవాలి. అన్నయ్య గారికెలాగయినా ఓపిక ఎక్కువ. ఎదుటి వాళ్ళ పనులు కూడా తన స్వంత పనుల లాగా శ్రద్ధగా చేస్తారు. పదిచోట్లకి తిరుగు తారు పదిమందితోనూ మాట్లాడతారు" అంది శారద.

"వాడి మొహం. అసలు రహస్యం వేరే ఉంది. వాడితో వేగలేక ఆ ఇల్లాలు తెల్లా రగానే ఇంత టిఫిను చేసి వాడి మొహాన వేసి, వాడిని బయటకు తోలేస్తుంది. ఇంకేం చేస్తాడు? ఊరిమీద పడి కాకిలాగా తిరుగుతాడు. వాడేదో ఉపకారం చేస్తున్నా డని ఊరివాళ్ళు మెచ్చుకుంటారు" అన్నాడు క్రిష్ణ. భార్య అతడిని మెచ్చుకోటం ఇతనికి నచ్చలేదు.

"ఏదో ఒకటి! పరోపకారం చేస్తున్నారు కదా! మీరు అలా వదిలేసి వచ్చినందుకు పాపం ఆయన నొచ్చుకుంటారేమో!"

"ఏం నొచ్చుకోడు. తెల్లారేసరికి మనింటి కొచ్చేస్తాడు. రాకపోతే నా చెవి తెగ్గోయిం చుకుంటాను" అన్నాడు ధీమాగా.

క్రిష్ణ అంచనా తప్పింది. ఆ సాయంత్రమే వచ్చేశాడు పార్థసారథి.

"నువ్వు తొందరపడి వెళ్ళిపోయావు. నువ్వెళ్ళాక రెండు దివ్యమైన సంబంధాలు వచ్చాయి. నేను పూనుకుని మన వివ రాలు ఇచ్చేలోగా అక్కడున్నవాళ్ళు ఎగరేసు కుపోయారు" అన్నాడు కాఫీ తాగుతూ.

"అంత మంచి సంబంధాలా అన్నయ్య గారూ" దీనంగా అడిగింది శారద.

"చాలా మంచి సంబంధాలమ్మా. పిల్లలూ బావున్నారు. మంచి ఉద్యోగాలు. మంచి కుటుంబాలు" నోరూరేలా చెప్పాడు.

"ఏవిటో అన్నయ్యా! ఈయనకి అక్కర్లేని దగ్గర అమిత హడావిడీ, కావాల్సిన దగ్గర అమిత నిదానం" అంది బాధగా.

"ఒరే నువ్వు నా స్నేహితుడివా? శత్రు వువా? అసలే ఈ కొంపలో నాకున్న విలువ అంతంత మాత్రం. అది కూడా ఊడిపోయేలా చెయ్యకు" కసురుకున్నాడు క్రిష్ణ.

స్నేహితుడు వెళ్ళాక చాలాసేపు ఆలో చించాడు క్రిష్ణ. కొడుకు పెళ్ళికి సహాయం అర్థించబట్టి గదా ఆ సాంబయ్య నుండి ఈ సారథి దాకా నన్ను కాల్చుకు తింటోంది. ఇక లాభం లేదు. ఏదో పెద్దరికంగా పూనుకుని చెయ్యబోయాను. నావల్లకా

లేదు. ఇక ఒక్కటే మార్గం. అవును ఆపనే చెయ్యాలి.

సూర్యహా రాత్రి పదకొండింటికి ఇంటి కొచ్చి హాల్లో కూర్చుని టి.వి. చూస్తున్న తండ్రిని చూసి ఆశ్చర్యపోయాడు. క్రిష్ణ సాధారణంగా తొమ్మిదింటికే పడుకుంటాడు.

"నాన్నగారూ! ఇంకా పడుకోలేదేం?" అడిగాడు.

"నీతో ఓ ముఖ్యమైన విషయం మాట్లాడాలి" చెప్పాడు.

"అలాగా.. స్నానంచేసి వస్తాను" అంటూ పైకెళ్ళి స్నానం చేసి వచ్చి వంటింట్లోంచి భోజనం వేడి చేసుకొచ్చి కూర్చున్నాడు. "చెప్పండి నాన్నగారూ" అన్నాడు.

"అదేరా నీ పెళ్ళి విషయంలో నేనో నిర్ణయానికి వచ్చాను"

"ఏవిటదీ? మళ్ళీ పెళ్ళి చూపులకి వెళ్ళాలా?"

"ఆ వెళ్లాంగా అరడజనుసార్లు. ఇక ఈ పెళ్లి చూపుల్తో లాభం లేదురా. నువ్వే పూనుకుని ఎవరైనా మంచి అమ్మాయిని చూసి ప్రేమించేయ్. పెళ్ళి చేసేస్తాను!"

ఆశ్చర్యపోయాడు సూర్యహా "అదేవిటి నాన్నగారూ! ఈ ప్రేమలూ దోమలూ మన ఇంటావంటా లేవు. అలాంటి పిచ్చి వేషాలు వేస్తే కాళ్ళిరగ్గొడతానని మీరేగా చెప్పారు."

"అప్పట్లో అలా అనుకున్న మాట నిజమే. కానీ పరిస్థితులు చూస్తుంటే నువ్వు ప్రేమిస్తేనే బావుండేట్లుగా వుందిరా?"

"ఇప్పటికిప్పుడంటే కష్టం కదా నాన్నగారూ!"

"ఇప్పుడంటే అర్జెంటేం లేదు. ఓ నెల్రోజులు అటూ ఇటూగా అయినా ఫర్వాలేదు. అసలిప్పటికే నువ్వెవరినైనా ప్రేమించి వుంటే మొహమాటపడకుండా చెప్పెయ్" ప్రేమగా అడిగాడు.

"ప్రేమిస్తే మొహమాటం వుండదు కదా నాన్నగారూ! అలాటిది ఏమీలేదు. వుంటే ముందే చెప్పేవాడిని. అప్పట్లో చదువు మీద వుండేది నా దృష్టి అంతా. పైగా నా చదువు చాలా భాగం పొరుగు రాష్ట్రంలోనే జరిగింది. ఆ తర్వాత ఉద్యోగం ఒత్తిడి. ప్రేమించే అవకాశం రాలేదు మరి!"

"పోనీ. ఇప్పుడైనా నీ ఆఫీసులో నీతో బాటు పనిచేసే వాళ్ళలో నీకు నచ్చిన వాళ్ళెవరైనా వున్నారా? ఉంటే ప్రేమించేసెయ్"

"ప్చ్. ఎవరూ లేరండీ. అదీగాక నాకు ప్రేమ వివాహం ఇష్టం లేదు."

"ఎందుకని?"

"మనది ఉమ్మడి కుటుంబం. నేను నా ఇష్టప్రకారం నాకు నచ్చిన అమ్మాయిని పెళ్ళి చేసుకున్నాననుకోండి. బాధ్యత నామీద పడుతుంది. రేపు ఏకాస్త తేడా వచ్చినా నేను నలిగిపోతాను. అదే మీరు కుదిర్చిన సంబంధం అయితే తేడా వస్తే మీరు సర్దుకుపోతారు. అందుకే మీరే చూడండి!"

'ఓరి వీడి తెలివి తెల్లవారా? వీడు నాకంటే అసాధ్యుడు' అని మనసులో అనుకున్నాడు క్రిష్ణ. "సర్లే మేమూ వెతుకుతూనే వున్నాం మావల్ల కావటం లేదు. నువ్వూ కాస్త ప్రయత్నం చేసి చూడు!"

"ఏదో చదువుకొంటూ దిలాసాగా వుండే రోజుల్లో ఆ ప్రేమలూ, ఇష్టపడడాలూ వుంటాయిగానీ ఇప్పుడు ఇక కష్టం నాన్నగారూ! ఆఫీసులో ప్రాజెక్టులతో పీకల దాకా మునిగి వున్నాను. మళ్ళీ ఈ ఇష్టపడడం అవీ అంటే ఇదో ప్రాజెక్టు కష్టం నాన్నగారూ".

"సర్లే, ప్రయత్నించడంలో తప్పేం లేదుగా! నీకు ఎవరైనా నచ్చితే మాత్రం వెంటనే నాతో చెప్పు."

"అలాగేలెండి!" అనేసి గుడ్‌నైట్ చెప్పి వెళ్ళిపోయాడు.

జరిగిన సంభాషణ ఇంతే. కాకపోతే రెండున్నర గంటల హిట్ సినిమా టి.వి.లో నాలుగున్నర గంటలు చూసినట్లు మధ్య మధ్యలో సెల్ మోగినప్పుడల్లా కలిగిన అంతరాయాల వల్ల ఈ నాలుగు ముక్కలూ మాట్లాడ్డానికి పక్కా గంటన్నర సమయం పట్టింది. కొడుకు వెళ్లిపోయాక నిరాశగా నిట్టూర్చాడు క్రిష్ణ. 'తనకై తాను నీ ఇష్టం వచ్చిన అమ్మాయిని వెతుక్కో' అని చెప్తే, ఎగిరి గంతేసి ఒప్పుకుంటాడనుకున్నాడు. కానీ కొడుకు ఆలోచనా విధానం చూస్తే ఇదేమీ తేలిక వ్యవహారంలా అనిపించలేదు. 'సర్లే, నా ప్రయత్నం నేను చేశాను' అనుకుని వెళ్లి నిద్రపోయాడు.

మర్నాడు పొద్దున భార్యకి తనీ విధంగా కొడుకుతో చెప్పినట్లు చెప్పాడు. "మంచి పని చేశారు. వాడు ఇష్టపడిన భార్య అయితే అన్యోన్యంగా వుంటారు. ఈ మధ్యన చూస్తూనే వున్నాంగా, పెళ్ళయ్యాక భార్యాభర్తల మధ్య ఏదో చిన్న విషయం మీదే తగవులు వచ్చి విడాకుల దాకా పోతున్నారుట.." అంది శారద.

"అవును. అందులోనూ మన అదృష్టం కలిసొచ్చి మంచి అమ్మాయినే ప్రేమిస్తే మనం కూడా ఆ వెంకట్రావులాగా దర్జాగా వుండచ్చు" అన్నాడు క్రిష్ణ.

ఆ వెంకట్రావు క్రిష్ణకి కొలీగ్. మంచి స్నేహితుడు ఆయనకి ఒక కొడుకు, కూతురు. కొడుకు తనతో ఉద్యోగం చేస్తున్న అమ్మాయిని ప్రేమించాడు. వీళ్ల కులం కాదు. అయినా కొడుకు పట్టుదల చూసి సరేనన్నారు. అటువైపు వాళ్ళు బాగా వున్నవాళ్లు. గాయత్రీ గార్డెన్స్‌లో ఘెళ్ళున పెళ్ళి చేశారు. పిల్ల కూడా చక్కగా చిలకలా వుంది.

పెళ్ళైన కొద్ది రోజులకే ఆ అబ్బాయి అమెరికా వెళ్ళాడు. భార్య మాత్రం ఇక్కడే వుంది. అతన్తో వెళ్తే మళ్ళీ అక్కడ ఉద్యోగం చెయ్యకూడదు అని ఏవిటేవిటో మడత పేచీలున్నాయిట. దాని బదులు మరో మూడు నాలుగు నెలలు ఆగితే కంపెనీవాళ్ళే ఆ అమ్మాయిని పంపిస్తారుట. అందుకే అత్తారింటికీ, పుట్టింటికీ తిరుగుతూ వుంది ఆ పిల్ల.

ఆమధ్యనెప్పుడో ఫోన్ చేసినప్పుడు శారద, 'కోడలు ఎలా వుంది?' అంటే.. 'మంచిపిల్ల, మాతో బాగా కలిసిపోయింది' అని చెప్పిందిట అత్తగారు.

కొడుకుకి ఆ సలహా ఇచ్చిన క్రిష్ణ ఆ రోజు చాలాసార్లు వెంకట్రావుని తల్చుకున్నాడు. అనుకోకుండా ఆ సాయంత్రం

## బాబోయ్.. అదృష్టం!

ఓసారి గుర్రపు పందెంలో అయిదారులక్షలు పొందిన ఒకానొక మిత్రుడిని కలిసిన శ్రీశ్రీ, 'అయ్యా, అదృష్టవంతుడయ్యేందుకు ఆ కిటుకేమిటో చెప్పండి!' అన్నారు.

దానికి అతడు, 'ఏముంది.. మా ఇంట్లో గోడకు వేలాడే ఫొటోలో ముగ్గురం పెద్ద



వాళ్లం, ఏడుగురు పిల్లలం ఉండటం చూశా. ఏడు ఇంటూ మూడు ఈక్వల్ టూ ట్వంటీ వన్ అని లెక్కగట్టి, దానిపైన పందెంకాసి రమ్మని పెద్దబ్బాయికి డబ్బు ఇచ్చి పంపాను. ఎక్కాలు సరిగ్గా రాని వాడు 21కి బదులుగా 27 అంకెపై పందెం కాస్తే.. గెలిచాను.. అదృష్టవంతుడినయ్యాను' అన్నాడు.

'అంటే అజ్ఞానం ఇంటూ అమాయకత్వం ఈజ్ ఈక్వల్ టూ అదృష్టం అన్నమాట.. అదృష్టవంతుడయ్యే అర్హతలు నాకు లేవు స్వామీ' అన్నాడు శ్రీశ్రీ.

వెంకట్రావు వీళ్ళింటికి వచ్చాడు.

"రండి రండి.. మీకు నిండా నూరేళ్ళు ఆయుర్దాయం. పొద్దుటి నుంచి మిమ్మల్ని కనీసం పదిసార్లు గుర్తు చేసుకున్నాను" సంభ్రమాశ్చర్యాలతో ఆహ్వానించాడు క్రిష్ణ.

"ఎందుకండీ అన్నిసార్లు తల్చుకోవడం? " అడిగాడాయన.

మంచినీళ్ళు తెచ్చి ఇచ్చి, "బావున్నారా? సావిత్రిగార్ని కూడా తీసుకు రాకపో యారా? " పలకరించింది శారద.

"బావుండకపోవడానికేం? దర్జాగా వుంటారు. బాధ్యతలు తీరిపోయాయి. మీ అబ్బాయి చక్కగా ప్రేమవివాహం చేసుకు న్నాడు. నాలాగా వెతుక్కునే పని లేకుండా చేశాడు" అన్నాడు క్రిష్ణ కాస్త అసూయగా.

"కోడలు ఇక్కడే వుందా? " అడిగింది శారద మాట మారుస్తూ.

"అటూ ఇటూ తిరుగుతూ వుంటుంది. ప్రస్తుతం ఇక్కడే వుంది" చెప్పాడు వెంక ట్రావు.

"మీతో చనువుగా వుంటుందా? " అడి గాడు క్రిష్ణ.

"చనువు కాస్తా ఎక్కువై చచ్చిపో తున్నాం" అన్నాడు వెంకట్రావు దీనంగా.

"అదేవిటండీ? కొత్త కోడలు మొహం మొటమొటలాడించుకుంటూ ఉంటే కష్టంగానీ చనువుగా వుంటే సంతోష మేగా? " క్రిష్ణకి ఆయన బాధేవిటో అర్థం కాలేదు. ఆశకి అంతులేదు. కొడుకు ప్రేమించి పెళ్ళిచేసుకున్నా ఇంకా ఏదో బాధపడుతున్నాడు అనుకున్నాడు.

"ఆ ఏవుంది లెండి? ఇవన్నీ చెప్పుకు నేంత పెద్ద సమస్యలూ కావు. దాచుకు నేంత చిన్న సమస్యలూ కావు. పెళ్ళై కాపు రానికి వచ్చింది. వారం తిరక్కుండానే ఓరోజు పొద్దున నేను పేపరు చదువు కుంటూ వుంటే వచ్చి వీపు మీద ఒక దెబ్బ వేసింది" చెప్పాడు వెంకట్రావు.

నోరావలించారు శ్రోతలు.

"ఎవరూ? కోడలే? ? మామగారి వీప్మీదే? ? " నమ్మలేకపోయింది శారద.

"అవును. దెబ్బవేసి.. మామ య్యగారూ నేను మీతో ఇలా చను వుగా వుంటే మీరేం అనుకోరు కదా? అని అడిగింది" చెప్పాడు వెంకట్రావు.

"ఇది మరీ బావుంది. ఆ మాట అడిగి మీరు సరే అంటే.. అప్పుడు దెబ్బ వేసినా అందం చందం గానీ ముందు దెబ్బ వేసేశాక ఆ తర్వాత అడి గితే ఏం చేస్తారు? " క్రిష్ణకి చాలా చిరాకే సింది.

"అవును. అయినా నేను కాస్త ఆలో చించి, మరీ ఇంత చనువు వద్దులేమ్మా అంటే బావుండేది. కొత్తకోడలు మనసు కష్టపెట్టుకుంటుందేమోనని ఫర్వా లేదులేమ్మా అనేశాను. అదుగో అది మొదలు అటొచ్చీ ఇటొచ్చీ ఓ దెబ్బ వేస్తూనే వుంటుంది. ఓసారి మా వియ్యం కుడి ముందరే ఫెడీమని నా వీపు మీద చరిచింది. అదేవిటే అమ్మాయ్! మావయ్య గార్ని అట్లా కొట్టచ్చా? అని మందలిస్తా డేమో అనుకున్నాను. అదేమీ లేదు సరి కదా మా అమ్మాయి చిన్నతనం నించీ ఇంతే. అల్లరి పిల్ల అని మురిసిపోయాడు" తన బాధ వెళ్లబోసుకున్నాడు వెంకట్రావు.

"మరి మీ ఆవిడ ఏం చెప్పడంలేదా? అత్తగారు కదా కాస్త మంద లించి దార్లో పెట్టొచ్చుగా? " అన్నాడు క్రిష్ణ.

"సరే లే! దాన్ని మరీ చంపేస్తోంది చను వుతో. పొద్దున్నే కాఫీ వద్దు రాగి జావ తాగమం



టుంది. మీ ఆరోగ్యమే నాకు మహాభాగ్యం కాబట్టి రోజూ కోడిగుడ్డు తినమంటుంది. బొజ్జ కనిపించేలా ఆ చీరలేవిటి, పంజాబీ డ్రెస్‌లు వేసుకోమంటుంది.

మా కోడలొస్తోందంటే చాలు మాకు కాళ్ళూ, చేతులూ వణుకుతున్నాయి.

ఆ ఫారిన్ ట్రిప్ ఏదో త్వరగా తేలితే బావుండునని మొన్ననే చిలుకూరు వెళ్ళి పదకొండు ప్రదక్షిణలు చేసి వచ్చాం" చెప్పుకున్నాడు దీనంగా.

"ఏవిటో ఈ విచిత్రం! అంతా వింతగా వుంది" అన్నాడు క్రిష్ణ.

"ఏం చెప్తాం? మీరివ్వాళ ఇంట్లోనే వుంటారా? ఎక్కడికైనా వెళ్తారా? " అడిగాడు వెంకట్రావు.

"ఎక్కడికీ వెళ్ళం.. ఎందుకడిగారు? " అన్నాడు క్రిష్ణ.

"ఏం లేదు. మిమ్మల్ని పలకరించినట్లూ వుంటుంది.. క్రికెట్టు మేచ్ చూసినట్లూ వుంటుందని వచ్చాను"

"దానికేం భాగ్యం? మహారాజులా చూడచ్చు. నేనెలాగూ చూస్తాను కదా? ఊరికే అడుగుతున్నాను. మీ ఇంట్లో టి.వి. పాడైపోయిందా? " అడిగాడు క్రిష్ణ.

"టి.వి. బానే వుంది. కోడలింట్లో వుంది. ఇద్దరం కలిసి సరదాగా మేచ్ చూద్దాం మావయ్యగారూ అంటుంది. నాలాగే ఆ అమ్మాయీ ధోనీ అభిమాని. ధోనీ చూడబోతే మంచి ఫాంలో ఉన్నాడు. అతగాడు షాట్ కొట్టడం ఆలస్యం ఈ పిల్ల నన్ను బాదేస్తుంది. ఆ బాధ భరించలేక ఇలా వచ్చాను" అన్నాడు దీనాతి దీనంగా వెంకట్రావు.

వెంకట్రావు క్రికెట్ మ్యాచ్ దెబ్బలు తినకుండా చూసి ఇక్కడే భోజనం చేసి వెళ్ళిపోయాడు.

"చూశావా శారదా! ఎందుకైనా మంచిది, మనం కాస్త ముందుగానే జాగ్రత్త పడాలి. మొక్కై వంగనిది మానై వంగుతుందా? " అన్నాడు క్రిష్ణ.

"అవునండీ.. ఈ అనుభవాలన్నీ వింటూ ఉంటే నాకు దడ వచ్చేస్తోంది. రేపు మన అదృష్టం ఎలా వుంటుందో ఏమో!" అంది శారద భయంగా. వెంటనే ఇంట్లోకి వెళ్ళి అత్తగారితో ఈ విషయం చెప్పింది.

"అవునే అమ్మా చనువుకాదూ చట్టుబండలూకాదు. కడుపులో వున్న కసి ఈ విధంగా తీర్చుకుంటుంది. వెనకటికి మా ఊళ్ళో వర్ధనమ్మ అని ఒకావిడ ఉండేది. ఆవిడ అత్తగారు ఈ వర్ధనమ్మని కాల్చుకు తినేది. కోడలు నోరెత్తేదికాదు. ఏ నెలకో రెండు నెలలకో ఆ కోడలికి గాలి సోకేది. అప్పుడు అత్తని పట్టుకుని బాదేసేది. ఎన్ని తాయెత్తులు కట్టినా గుణం కనిపించలేదు. అత్త చచ్చిపోయాక ఆ గాలీ ధూళీ చక్కాపోయాయి. అప్పుడావిడ గాలిపేరు చెప్పి అత్తగారిని బాదినా, ఇప్పుడీ వెంకట్రావు కోడలు చనువుపేరుతో మామగారిని బాదినా కారణం ఒకటే.. శాణాతనం. నువ్వు నా మేనకోడలివి. నీకూ నాకూ సఖ్యత కుదిరింది. మరి నీ పరిస్థితి తల్చుకుంటేనే బాధగా వుంది నాకు" అంటూ తనూ బాధ పడింది బాలమ్మ.

"ఏవిటో అంతా నా ఖర్మ. నాకూ ఓ మేనకోడలుంటే ఇన్ని అవస్థలు వుండేవి కాదు" అంది శారద దీనంగా.

"ఉంటే బాగానే ఉండేది. నా బామ్మరుదులు ఇద్దరూ ఇద్దరే. ఆ పెద్ద వెధవకేమో ఒకటే హడావిడి. వీడికన్నా రెండేళ్ళు ముందరే కూతుర్నికని కూర్చున్నాడు. ఇక రెండో వెధవ ఉన్నాడంటే నత్తనడకల వెధవ. వీడు పుట్టిన తొమ్మిదేళ్ళ దాకా నిద్రపోయి అప్పుడు కన్నాడు కూతుర్ని" అంటూ బావమరుదులని నిందించాడు క్రిష్ణ. ఆ క్షణాన గతం గుర్తురాలేదు.

అలక పాన్పు మీదినించి భయపడి పారి పోవడమూ గుర్తురాలేదు. మేనరికం వద్ద నడమూ గుర్తురాలేదు.

ఏది ఏమైనా తన పుట్టింటి వాళ్ళను ఆడిపోసుకోవడం శారదకీ నచ్చలేదు. బాల మ్మకీ నచ్చలేదు.

"ఆడలేక మద్దెల ఓడు అంటే ఇదే. కొడుక్కి సంబంధం వెతకలేక మా వాళ్ళను ఆడిపోసుకుంటావేం? అయినా మేనరికం చేసుకుని చాలా నష్టపోయానని ఇన్నాళ్ళూ మొత్తుకున్నావుగా. ఇప్పుడు నీ కొడుక్కి మేనరికం కావలసి వచ్చిందా" అని రుసురుసలాడారు. "మంచి మాటలు గుర్తుండవుగానీ ఇలాటి పిచ్చివన్నీ బాగానే గుర్తుపెట్టుకుంటారు" అన్నాడు. అంతలో ఫోన్ మోగింది. ఎవరో మ్యారేజి బ్యూరో వాళ్ళు ఫోన్ చేశారు.

"మేము ఇంక ఆ పెళ్ళి చూపులూ అవీ చూడదల్చుకో లేదండీ" చెప్పేశాడు.

"ఏం సంబంధం కుదిరిపోయిందా? " అడిగారు.

"కుదర్లేదు. మా వాడు ప్రేమించి పెళ్ళి చేసుకుంటాడు."

"మరి ప్రేమ వివాహం అయితే మా బ్యూరోలో పెట్టారేం? " నిలదీశారు వాళ్ళు.

"అప్పటికి ఇంకా ప్రేమించలేదు కాబట్టి పెట్టాం. మా వాడు ఇవ్వాళ రేపో ప్రేమిం చేస్తాడు. మా వాడికి మీరేం సంబంధాలు చూడక్కర్లేదు" చెప్పేసి ఫోన్ పెట్టేశాడు.

'పాపం సరైన సంబంధం దొరక్క కాస్త మతి చలించింది ఈయనకి' అనుకున్నారు అవతలివాళ్ళు, ఫోన్ పెట్టేసి. "ఏడీ వీడు? ఇంట్లో వున్నాడా? ప్రేమించరా అంటే విని పించుకోడేం? నేను బరువు లెత్తమ న్నానా.. బండలు దొర్లించమన్నానా? ప్రేమించమంటే ప్రేమించడానికేం మాయ రోగం? " ఆయనకి చాలా విసుగ్గా ఉంది.

"ఇది మరీ బావుంది వాడికి నచ్చిన మ్మాయి దొరికితే ప్రేమిస్తాడు గానీ వెంట బడి వేధిస్తే ప్రేమిస్తాడా? చంపుకు తింటున్నారు వాడిని" అంది శారద.

"వీడికే పని చెప్పినా ఇంతే. ఓ పట్టాన చెయ్యడు. సినిమాల్లో చూడు పదో క్లాసు వాళ్ళు కూడా ప్రేమించేస్తూ ఉంటారు" అన్నాడు క్రిష్ణ.

"సినిమాల సంగతి మనకెందుకు లెండి. అక్కడ పిల్లాడు ప్రేమిస్తే వాడి తల్లిదండ్రు లని తీసుకెళ్ళి చావగొడతారు. ఆ అవ స్థలన్నీ మనం ఎక్కడ పడతాం. ఏదో లెండి ఆ కల్యాణ ఘడియ వస్తే అదే కుదురుతుంది" అంది.

భర్తకి ధైర్యం చెప్పింది గానీ శారదకీ లోలోపల దిగులుగానే ఉంది.

ప్రతీసారీ అయిపోతుంది.. అయిపో తుంది అనుకోడం. ఏదో అడ్డంకి వచ్చి ఆగిపోవడం జరుగుతోంది. మాటల మధ్య ఈ సంగతులన్నీ ఒక స్నేహితురా లితో చెప్తే ఆవిడ ఒక సలహా ఇచ్చింది.

"నిజంగానా! ప్రయోజనం ఉంటుందం టావా? " ఆశగా అడిగింది శారద.

"ఒకసారి నీ కళ్ళతో నువ్వే చూడు" అంది ఆ ఫ్రెండు.

"సరే వెళ్లొద్దాం! ఏ పుట్టలో ఏ పాము వుందో? " అంది శారద.

"నేను ఒక చోటికి వెళ్తున్నాను. వచ్చేస రికి ఆలస్యం అవ్వొచ్చు. నాకోసం కంగారు పడొద్దు. ఎక్కడికెళ్తున్నావ్? ఎందుకెళ్తు న్నావ్ అని నన్ను అడగద్దు. తిరిగొచ్చాక అన్నీ వివరంగా చెప్తాను" అని ఇంట్లో చెప్పి పొద్దున్నే బయలుదేరి వెళ్ళింది.

కంగారు పడొద్దని చెప్పి వెళ్ళినా, రెండు దాటాక కూడా రాకపోయేసరికి కంగారు పుట్టింది క్రిష్ణకి. బాలమ్మ కూడా కంగారు పడిపోతోంది.

"ఒంటరిగా ఎక్కడికీ ఓ పట్టాన వెళ్ళే మనిషికాదు. నువ్వొ వెంట వెళ్ళాల్సిందిరా"

బాలమ్మ కొడుకుని మందలించింది.

"నేనొస్తాననే అన్నాను. వద్దంది. తన ఫ్రెండ్స్‌తో కలిసి వెళ్ళిందిలే.. వస్తుంది" అన్నాడు కంగారు దాచుకుని.

చివరికి అయిదు గంటలు దాటాక వచ్చింది శారద. మొహాన ఇంత పెద్ద కుంకుమ బొట్టు. మొహంలో ఆనందం తొణికిసలాడుతోంది.

"హమ్మయ్య వచ్చావా? " ఊపిరి పీల్చు కున్నాడు క్రిష్ణ.

"అవును ఇవ్వాళ నాకు అద్భుతమైన అనుభవం కలిగింది. వివరంగా చెప్తాను. ముందు ప్రసాదం తీసుకోండి" వెంట తీసి కెళ్ళిన సంచీలోంచి కొబ్బరి చిప్పా, పూలూ తీసి ఇచ్చింది. "ఇదుగో ఇదీ అసలైన ప్రసాదం" అంటూ ఓ ప్లాస్టిక్ కవర్‌లోంచి ఓ చెప్పుల జత తీసింది. రెండేళ్ళ పిల్లలకు సరిపోయే కొత్త రబ్బరు చెప్పులు అవి. దానిమీద పసుపు, కుంకుం బొట్లు పెట్టి ఉన్నాయి. "ఇదుగో ప్రసాదం కళ్ళకద్దు కోండి" అంది తను భక్తితో కళ్ళకు అద్దు కుంటూ.

తల్లీకొడుకులు తెల్లబోయారు.

"చెప్పులు చూపించి ప్రసాదం అంటావే మిటే పిచ్చిమొహమా? ఎండలో తిరిగి తిరిగి పైత్యం ప్రకోపించిందా ఏం? " అన్నాడు క్రిష్ణ.

"అయ్యో రామా! పైత్యం కాదండీ! ఇది ప్రసాదమే. సాక్షాత్తూ శ్రీశ్రీశ్రీ చెప్పు బాబా వారి ప్రసాదం!"

"చెప్పు బాబాగారా? ఆయనెవరూ? "

"ఊరి చివర ఓ చిన్న ఊళ్ళో ఉంటారు. బాబా మహిమగలవారు. ఆయన దగ్గరికి వెళ్తే మన కోరికలన్నీ తీరిపోతాయని మా ఫ్రెండు సరస్వతిగారు చెప్పింది. నేనూ, ఆవిడా, ఆవిడ ఫ్రెండు భారతిగారు, వాళ్ల పక్కింటావిడా కలిసి మారుతీ వ్యాను మాట్లాడుకుని వెళ్ళాం. ఏమో అనుకు న్నాను కానీ చాలా గొప్పవారండీ ఆ చెప్పు బాబాగారు. దివ్యదృష్టి వుందిట భూత భవిష్యత్ వర్తమానాలన్నీ ఆయనకి స్పష్టంగా కనిపిస్తాయిట."

"అదంతా సరేనే శారదా! ఆ పేరేమిటి చెప్పు బాబా అనీ? చెప్పుకీ బాబాకి ఏంటి సంబంధం? " అంది బాలమ్మ.

"అవును మరి! అసలు కిటుకంతా చెప్పు లోనే ఉంది" అంది శారద భక్తిగా.

"అదేవిటో మాకూ చెప్పు.. ఆనం దిస్తాం!" అన్నాడు బాబాలంటే అసలు నమ్మకంలేని క్రిష్ణ.

"ఆ బాబా గతంలో మామూలు మనిషే నట. కరెంటు సామాన్లు రిపేరు చేసు కుంటూ ఉండేవాడుట. రెండేళ్ళ కిందట ఆయనకి దేవుడు కల్లో కనిపించి 'ఒరే భక్తా.. నువ్వు కారణజన్ముడివి. ఈ కరెంటు పనులు నీకొద్దూ! నువ్వు మానవ కళ్యాణం చెయ్యాలి" అని చెప్పాడుట. అంతేకాదు ఆయనేం చెయ్యాలో కూడా సూచించారుట.

ఆ క్షణం నుండీ ఆయనలో దివ్యశక్తులు ప్రవేశించాయట. సోమవారం, బుధవారం మాత్రమే ఉంటాయట ఆ దివ్యశక్తులు. ఆ సమయంలో భక్తులు వెళ్తారు. బయట ఓ చెప్పుల దుకాణం ఉంది. అక్కడ మన సమస్యని బట్టి ఆ సైజు చెప్పులు కొను క్కుని బాబాగారి దగ్గరికి వెళ్ళాలి. ఆయన ఆ చెప్పులని మంత్రిస్తారు. మంత్రించాక ఆ చెప్పు తీసుకుని 'ఏవిటీ నీ బాధ.. చెప్పు చెప్పు చెప్పు' అని భక్తుల తలమీద కొడ తారు. అప్పుడు భక్తులు తమ సమస్యలు చెప్పుకుంటే అవి చిటికెలో పరిష్కారం అయిపోతాయట" వీలైనంత వివరంగా చెప్పింది.

నవ్వాలో ఏడవాలో అర్థంకాలేదు క్రిష్ణకి.

"అయితే అమ్మాయ్ మరి నిన్ను కూడా మంత్రించిన చెప్పెట్టి కొట్టాడా ఆ చెప్పు

# సంగీత దర్శకుడైన సేవకుడు




ఓ సంగీత వాద్యాల అంగడి యజమాని ఉస్తాద్ గురుబత్ ఆలీ వాయిద్యాలపైన దుమ్ము దులుపుతున్నాడు. అంగడి తెరచిన లగాయతూ వీధికటువైపు నిలబడి అంగడిలో ఓ మూలనున్న హార్మోనియంవైపే చూస్తున్నాడు ఓ బాలుడు. 'ఆ హార్మోనియంనే చూస్తున్నావ్, కొంటావా, ఏం?' అడిగాడు యజమాని. తన దగ్గర అంత డబ్బులు లేవని కుర్రాడు చెప్పాడు. అంగడిలో పనిచేస్తే డబ్బులిస్తానన్నాడు యజమాని. ఆ పిల్లవాడు పనిలోకి చేరాడు. నమ్మకంగా పని చేసేవాడు. యజమాని ఉదయమే తాళంచెవులు ఇచ్చి పంపితే, ఆయన వచ్చేటప్పటికి అంతా శుభ్రంచేసేవాడు. ఓరోజు కొద్ది దూరంనుంచే హార్మోనియం శబ్దం వినబడింది ఆయనకు. ఎవరో గిరాకి వచ్చారేమోనని ఆత్రంగా వచ్చాడు. చూస్తే పని పిల్లవాడు హార్మోనియం వాయిస్తున్నాడు.

"ఇంత చక్కగా వాయిస్తున్నావ్, ఎలా నేర్చుకొన్నావ్?" అంటూ వాత్సల్యంతో ప్రశ్నించాడు.



'మీ అంగట్లోనే సొంతంగా నేర్చుకొన్నాను' అని సమాధానం చెప్పాడు, భయపడుతూనే.

'భయపడొద్దు. నిన్ను చూస్తే గర్వంగా ఉంది. నీకొక హార్మోనియం ఇస్తా. కోరుకున్న ఘరానాలో సంగీత పాఠం చెప్పిస్తాను' అన్నాడా యజమాని.

ఆ పిల్లవాడు సంతోషానికి అంతే లేదు. యజమాని చేతులు కళ్ళకద్దుకొన్నాడు.

అతను పెరిగి పెద్దయ్యాక గొప్ప సినిమా సంగీత దర్శకుడయ్యాడు. ఆయనే సంగీత దర్శకుడు నౌషాద్.

బాబాగారూ?" అడిగింది బాలమ్మ.

"అవును. వెళ్ళిన కాసేపటికే పిలిచారు. అసలు కొంతమందినైతే నాలుగైదుసార్లు వెళ్ళినా పిలవనే పిలవరుట. నన్ను పిలిస్తే అందరూ ఆశ్చర్యపోయారు. బాబాగారి కరుణ మీపై ఉంది. మీరు అదృష్టవంతులు- అన్నారు. పిలిచి నాలుగుసార్లు చెప్పుతో కొట్టేసరికే నా సమస్య చెప్పేశాను. ఏం ఫర్వాలేదమ్మా నీకు బంగారం లాంటి కోడలొస్తుంది త్వరలోనే. ఈ చెప్పులు తీసికెళ్ళి బీరువాలో పెట్టుకో ప్రసాదంగా అన్నారు" చెప్తూ ఆగిపోయింది శారద.

క్రిష్ణ పగలబడి నవ్వుతున్నాడు.

"నాకు తెలుసు మీరిదంతా ఎగతాళిగా కొట్టిపారేస్తారని. కానీ ఆయన మహిమ నా కళ్ళారా చూశాను. పాపం ఒకావిడ వచ్చింది. ఆవిడ కొడుక్కి ఏదో పెద్ద జబ్బు చేసిందిట. పదకొండో నెంబరు చెప్పులు కొనుక్కుని పదిరోజులుగా తిరుగుతోందిట బాబాగారి చుట్టూ. అయినా బాబాగారు కరుణించలేదట" అంది శారద కినుకగా.

"నీలాంటి పిచ్చి సన్నాసులు ఉన్నంత కాలం ఇటువంటి బాబాల ప్రభ వెలిగిపోతూనే ఉంటుంది. నేను ఒక్క మాట అంటేనే ఆర్రోజులు ఏడుస్తావుకదా! ఆ బాబాగారు చెప్పెట్టి కొట్టినా కోపం రాలేదా నీకు? ఇంతకీ ఈ మొత్తం తతంగానికీ ఎంత వసూలు చేశారు?" నవ్వుతూనే అడిగాడు క్రిష్ణ.

"ఆ! ఎంతోనా? చెప్పులకి మూడొందలు. ఆయనకి కానుకగా ఇంతని అడగలేదు. నేనే రెండొందలు ఇచ్చాను. మిగిలినవాళ్ళు ఇంకా చాలా ఘనంగా ఇస్తున్నారు.. తెలుసా?" చెప్పింది శారద.

"బయట ముప్పైకి దొరికే చెప్పులు చెప్పు బాబాగారి దగ్గర మూడొందలు.

అదిగాక దక్షిణ. రానూపోనూ టాక్సీ ఖర్చు మొత్తానికి ఒక వెయ్యి రూపాయలు చెప్పు బాబాకి సమర్పించావు" ఎగతాళి చేశాడు క్రిష్ణ.

"చాల్లే ఊరుకోండి. డబ్బుపోతే పోయింది. ఆ చెప్పు బాబాగారి దయవల్ల మనవాడికి మంచి సంబంధం కుదిరి పెళ్ళయితే అదే పదివేలు" అంది శారద.

"నిజమేనే. ఏ పుట్టలో ఏ పాము ఉందో ఎవరికి తెలుసు. పన్లోపనిగా నీ మోకాళ్ళ నెప్పుల గురించి కూడా చెప్పాల్సింది. మరో రెండు దెబ్బలు వేసేవారు" అంది బాలమ్మ.

బాబాగారిచ్చిన ప్రసాదం చెప్పులు భద్రంగా బీరువాలో పెట్టి సోమవారం బుధవారం బయటికి తీసి వాటికి బొట్టు పెట్టి, పండో ఫలమో నైవేద్యం పెట్టి, హారతి ఇస్తూనే వుంది శారద. బాబాగారి ఆదేశానుసారం.

అయినా ఏమీ ఫలితం కనిపించలేదు. "పోనీ సరస్వతిగార్ని తీసుకుని మరోమారు వెళ్లిరానా చెప్పు బాబాగారి దగ్గరికి!" అంది శారద.

"నోరుమూసుకుని ఇంట్లో కూర్చో. ఇంకోసారి ఇలాంటి పిచ్చిపనులు చేస్తే చెప్పెట్టి కొడతాను. చేసింది చాలు. చెప్పు బాబా వద్దూ.. ఉప్పు బాబా వద్దు. ఎలా జరగాల్సింది అలా జరుగుతుంది" అని తీవ్రంగా కోప్పడ్డాడు క్రిష్ణ.

ఆయనకు కోపం వస్తే అన్నంత పనీ చేసినా చేస్తాడు. అందుకే భయపడి ఊరుకుంది. కానీ మనసులో కొండంత బరువు. ఎవరి కోడలిని చూసినా మనసు చివుక్కుమంటుంది.

ఏవో సంబంధాలు వస్తూనే ఉన్నాయి. కానీ వ్యవహారం ఏ మాత్రం ముందుకి సాగడం లేదు. మగపిల్లాడి పెళ్ళికి ఇన్ని తంటాలుపడాలని కల్లో కూడా అనుకోలేదు.

ఒకరోజు హఠాత్తుగా శారదకు పెద్ద నాన్న వరసైన ఆయన వాళ్ళింటికి వచ్చాడు. భోజనాలూ అవీ అయ్యాక "ఏవిటే శారదా? కొడుకు పెళ్ళి ఎప్పుడు చేస్తావ్? " అన్నాడు.

అనడమే తడవుగా తన అవస్థలన్నీ ఏకరువు పెట్టుకుంది శారద. అంతా విని తల పంకించాడు ఆయన. "ఏదీ వాడి జాతకం ఇలా పట్రా. చూస్తాను" అన్నాడు. ఆయనకు జ్యోతిష్యంలో బాగానే ప్రవేశం వుంది. అదో సరదా ఆయనకి. బయటివాళ్ళకి చెప్పడుగానీ ఇంట్లోవాళ్ల జాతకాలు చూస్తాడు.

శారద కొడుకు జాతకం తెచ్చి ఇచ్చింది. దాన్ని క్షుణ్ణంగా పరిశీలించి ఏవో లెక్కలు వేశాడు. కాసేపు వేళ్ళమీద ఏవో గుణించి చిటికె వేశాడు.

"అదీ సంగతి జాతకంలో చిన్న దోషం వుందే అమ్మాయ్! అందుకే ఏదీ కలిసిరావడంలేదు. నువ్వు ఒక పనిచెయ్. వాడి చేత మూడు శనివారాలు శనీశ్వరుడికి తైలాభిషేకం చేయించు. దోషం తొలిగిపోతుంది" అన్నాడు.

"వాడికివన్నీ నమ్మకంలేదు పెద్దనాన్నా. తండ్రిని మించిన తనయుడు. చెప్తే వినడు. పైగా నన్ను ఆటపట్టిస్తాడు" అంది శారద దీనంగా.

"అది కూడా దుష్టగ్రహ ప్రభావమే మరి! నువ్వు చెప్పేవిధంగా చెప్పిచూడు. నీ మాట వింటే సరేసరి. లేకపోతే నువ్వే వాడి పేరున చెయ్యి. అసలు మానుకోవడం కంటే ఎవరో ఒకరు చెయ్యడం మంచిదేకదా! ఈ విషయంలో అశ్రద్ధ చెయ్యకు. వాడు స్వయంగా చేస్తే చాలా ఉత్తమం. కాదంటేనే ఈ మార్గాంతరం" అన్నాడాయన.

ఆ రాత్రి కొడుక్కి అన్నం పెడుతూ ఈ

విషయం చెప్పింది.

"అలాగా! మరి ఆ తాతయ్యగారు తన పెళ్ళికి ముందు ఇలాగే పూజలవీ చేశారా? నాన్నా, నువ్వూ చేశారా? పోనీ బామ్మ చేసిందా? మరి మీరెవరూ చెయ్యనప్పుడు నేనెందుకు చెయ్యాలి? "

"నేనేం చేశానని ఆ శనీశ్వరుడికి నామీద కోపం వచ్చి పెళ్ళికి అడ్డం పడుతున్నాడు? నా పెళ్ళాగిపోతే ఆయనకేం లాభం? నేను అభిషేకం చేస్తే కోపంపోయి నాకు పెళ్ళి జరిగేలా చూస్తాడా? చెయ్యలేద నుకో... ఇక నాకు జీవితాంతం పెళ్ళి కాదా? చేస్తే వెంటనే పెళ్ళవుతుందా? " అంటూ పిచ్చి ప్రశ్నలు వేసి వేధించాడు.

శారద ఓర్పు నశించిపోయింది. "తలా తోకా లేకుండా మాట్లాడకు. ఏదో పెద్దా యన నీ మంచికోరి చెప్పాడు. నీకిష్టం వుంటే చెయ్యి. లేకపోతే మానెయ్. అంతే గానీ ఇలా భేతాళ ప్రశ్నలు వేసి నన్ను విసిగించకు" అనేసి చివాల్న లేచి వెళ్ళిపో యింది. మర్నాడు కూడా కొడుకుతో ముభావంగానే వుంది.

తల్లిని చూస్తే జాలీ, ప్రేమా ముంచుకొ చ్చాయి. పాపం తన కోసం తెగ తాపత్ర యపడిపోతుంది పిచ్చితల్లి. ఆ మధ్యన ఆ బాబాగాడెవడి దగ్గరకో వెళ్ళి చెప్పుదెబ్బలు కూడా తిని వచ్చింది. అమ్మకోసం అయినా ఈ పూజలు చెయ్యాలి. ఆ దేవుడు సంతో షించినా సంతోషించకపోయినా అమ్మ తృప్తిపడుతుందని అనుకున్నాడు సూర్యహా.

"సర్లే అమ్మా.. ఆ పూజ ఏవిటో, ఎలా చెయ్యాలో చెప్పు. చేసేస్తాను" అన్నాడు. ఆవిడ మొహం వికసించింది. అలా ఒప్పు కోడం శుభసూచకంగా అనిపించింది.

"శనివారం పొద్దున్నే లేచి స్నానంచేసి టిఫిన్ కూడా తినకుండా శివాలయానికి వెళ్ళాలి. పూజ సామాగ్రి అంతా అక్కడే దొరుకుతుంది. డబ్బుకడితే వాళ్ళే పూజ చేయిస్తారు. అలా వరసగా మూడు వారాలు చెయ్యాలి. అంతే!" అని చెప్పింది.

"ఓస్ ఇంతేనా? నేనింకేవిటో అనుకు న్నాను. చేసేస్తానులే" హామీ ఇచ్చాడు.

"వచ్చే శనివారమే మొదలెట్టు" అంది.

"అలాగే" అన్నాడు.

అన్నాడేగానీ ఆ శనివారం పొద్దున తల్లీ కొడుకులిద్దరూ మర్చిపోయారు ఆ విషయం. పూటుగా పూరీకూరా తిన్నాక అప్పుడు గుర్తుకొచ్చి 'అరెరే' అనుకున్నారు.

మరుసటి శనివారం జాగర్తగా గుర్తుపె ట్టుకుని వెళ్దామనుకుంటే శుక్రవారం సాయంత్రంనించీ జలుబు పట్టుకుంది. శనివారం తెల్లారేసరికి ఆగకుండా ఒకటే తుమ్ములు.

"ఇప్పుడు వాడిని పంపించినా తుమ్ముతూ వీడేం పూజ చేస్తాడు? ఇలా తుమ్మేవాడిచేత వాళ్ళేం పూజ చేయిస్తారు? అయినా శుభమా అని పూజకి వెళ్తూ తుమ్మడం అంత మంచి శకునం కాదు. ఈ వారం వదిలెయ్ వచ్చేవారం వెళ్తాడు" అన్నాడు క్రిష్ణ.




ముచ్చటగా మూడోవారం ముడిప డింది. అతనికి ఆవేళ శనివారం అయినా ఆఫీసులో పనుంది. "పూజ ముగించి అటునించి ఆఫీసుకి వెళ్తాను" అన్నాడు.

అతనితో పనిచేసే ఆదిత్య, "సూర్యహా నాకూ పనుంది ఆఫీసులో. మళ్ళీ రెండు కార్లెందుకు. నీ దగ్గరకి వస్తాను. కలిసి వెళ్దాం" అన్నాడు. అతని ఇల్లు వాళ్లింటికి దగ్గరే.

"అలాగే. కాకపోతే నేను కొంచెం ఎర్లీగా బయలుదేరతాను. గుడికి వెళ్ళి పూజ చేయించాలిట. అమ్మ చెప్పింది" అన్నాడు సూర్యహా.

"అలాగేలే నేనూ ఎర్లీగానే వచ్చేస్తాను. గుడికి వెళ్ళే వెళ్దాం" అన్నాడు ఆదిత్య.

ఇద్దరూ బయలుదేరారు.

ఊరికి చివరగా చిన్న కొండమీద వుంది ఆ శివాలయం. భక్తుల తాకిడి అంతగా వుండదు. చాలా పురాతనమైన ఆలయం. వాళ్ళింటికి దూరమే. కానీ ఆఫీసుకు వెళ్ళే దార్లోనే వుంది.

కారు ఆపి గుడివైపు నడిచారు. కింద నించి యాభైమెట్లు పైకి ఎక్కాలి. మెట్లెక్కి పైకి వెళ్తే అంతా ప్రశాంతంగా వుంది. చుట్టూ ప్రకృతి సౌందర్యం. మంచి గాలి.

శివాలయం దగ్గర వున్నాడు పూజారి. ఇలా శనిపూజ కోసం అని చెప్తే, 'పదండి టికెట్ ఇస్తాను' అని ఆయనే స్వయంగా వచ్చి డబ్బు తీసుకుని రసీదు పుస్తకం తీశాడు. "గోత్రం ఏమిటండీ? " అడిగాడు.

"కౌండిన్యస" చెప్పాడు సూర్యహా.

"పేరు? " అడిగాడు.

బుర్ర గోక్కున్నాడు. "సూర్యహా" చెప్పాడు.

"ఏమిటన్నారు.. సూర్యహానా? " అడిగాడాయన.

"పోనీ అది వద్దులెండి, శ్రీనివాస్ అని రాసుకోండి"

"తడవకో పేరు చెప్తున్నారు. ఇంతకీ మీ అసలు పేరు ఏమిటి? "

"పూర్తిపేరు చాలా పొడుగు. అందుకే ఇలా చెప్తున్నాను."

"మామూలు సమయాల్లో ఏ పేరు చెప్పినా ఇలా పూజలవీ చేయించే సమయంలో పూర్తి పేరు చెప్పడం విధాయకం. పూర్తిపేరే చెప్పండి" నవ్వేడు పూజారి.

'సరే మీ ఖర్మ రాసుకోండి' అని మనసులో అనుకుని "నాగసత్య సూర్య హనుమత్ శంకర సాయి వేణుగోపాల దుర్గా శ్రీనివాస్.." అన్నాడు.

ఆ పూజారికి ఏడుపొచ్చింది. రసీదులో రెండువైపులా పేరురాసి అతని చేతులో పెట్టాడు. "అక్కడ పూజ సామాన్లుంటాయి కొనుక్కొచ్చుకోండి. ప్రదక్షిణ చేసి ఆ పక్కన కూర్చోండి. నేనొచ్చి పూజ చేయిస్తాను" చెప్పి, చెయ్యి ఝాడించుకుంటూ శివుడి దగ్గరికి వెళ్ళాడు.

ఆయన చెప్పిన పనులన్నీ పూర్తి చేసుకొని కూర్చున్నారు సూర్యహా, ఆదిత్య.

అంతలో గబగబ అక్కడికి వచ్చారు ఇద్దరు అమ్మాయిలు.

"శనిపూజ చేయించాలి. ఎక్కడ చేస్తారండీ!" అంటూ అడిగింది ఒకమ్మాయి.

మంత్రాలు మధ్యలో ఆపి "అక్కడ పూజ సామాన్లు కొనుక్కొచ్చుకోండి. ప్రదక్షిణ చేసి వచ్చి కూర్చోండి. టికెట్టు తర్వాత తీసుకోవచ్చు" అరిగిపోయిన రికార్డులా చెప్పి, 'విశ్వేశ్వరాయ మహాదేవాయ త్రయంబకాయ త్రిపురాంతకాయ' అంటూ మంత్రాలు కొనసాగించాడు పూజారి.

వాళ్ళిద్దరూ వెళ్ళి పూజకి కావాల్సిన సామాగ్రి కొనుక్కొచ్చి వీళ్ళిద్దరికీ కాస్త దూరంలో కూర్చున్నారు.

"ఏమిటి మా అమ్మ చాదస్తం? ఏమైనా అంటే బాధపడుతుంది. నా పెళ్ళి ఆలస్యం అవుతోందిట. కుదిరినట్లే అనిపించి తప్పిపోతుందిట. అందుకే శనిపూజ చేయించమంది!" అంది అమ్మాయి.

చివాల్న తలతిప్పి తన సహ బాధితురాలి వంక చూశాడు సూర్యహా. సన్నగా

# పుస్తక ప్రచురణలో కల్లూరు




అనంతపురం జిల్లా హిందూపురానికి చెందిన కల్లూరు సుబ్బారావును స్వతంత్ర పోరాట కాలంలో కాంగ్రెస్ సేనానుల్లో భీష్మాచార్యుడితో పోల్చే వారు. అంతటి గొప్ప అజాత శత్రువు, పరిణత నేత ఆయన. 1957 ఆగస్టులో ఓ రోజు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో పనివుండి ఆచార్య లక్ష్మీరంజనంవద్ద కూర్చుని మాట్లాడుతూ ఉన్నారు.



అంతలోనే ఆచార్యులనుంచి పిలుపు అందుకుని పోణంగి శ్రీరామ అప్పారావు అక్కడికొచ్చారు. ఆచార్యులు అతనిని కల్లూరుగారికి పరిచయం చేస్తూ, 'వీరు ఇంతకు ముందు మీ రాయలసీమలోని కడప కాలేజీలో పనిచేశారు. ప్రస్తుతం ఇక్కడ రీసెర్చి చేస్తున్నారు. భరతుడి నాట్యశాస్త్రాన్ని తెనిగించారు. ప్రచురించేవాళ్లు కరవయ్యారు' అన్నారు. అది విని వెంటనే అతడి వెన్ను తట్టి, వివరాలన్నీ కనుక్కున్న కల్లూరు సుబ్బారావు, 'నువ్వు మంచి గ్రంథమే అనువాదం చేశావు. తప్పకుండా అచ్చవుతుంది' అని అభయహస్తమిచ్చారు.

కల్లూరు సుబ్బారావు చొరవవల్ల కేంద్ర సాహిత్య అకాడెమీ ఆ పుస్తకాన్ని ప్రచురించింది. దీంతో డా. పోణంగి ఆ గ్రంథాన్ని ఆయనకే అంకితమిచ్చారు. తర్వాత దానికి జాతీయ అవార్డు కూడా రావడం విశేషం.

నాజూకుగా వుంది. పొడిగా వున్న జుట్టుని క్లిప్ పెట్టి వదిలేసింది. ఎరుపూ పసుపూ రంగులు కలిసిన పంజాబీ డ్రెస్ వేసుకుంది. పక్కనున్న ఫ్రెండ్‌తో మాట్లాడుతూ నవ్వుతుంటే చూడ్డానికి బావుంది.

ఆ అమ్మాయి ఇటు చూసేసరికి మొహం తిప్పుకున్నాడు సూర్యహా.

పూజారి వచ్చాడు. "ఏవండీ మేము తొందరగా వెళ్ళాలి. పనుంది. ముందు మా పూజ చేయించేస్తారా? " అంది ఆ అమ్మాయి.

"అది కాదండీ. ముందు మేము వచ్చాం. మాకూ పన్లున్నాయి. ముందు మా పూజ చేయించండి" అన్నాడు ఆదిత్య.

"మేము ఆఫీసుకెళ్ళాలి" విసురుగా చెప్పిందా అమ్మాయి.

సూర్యహాకి కోపం వచ్చింది. "మేమేం ఈగలు తోలుకోడంలేదు. మేమూ వెళ్ళాలి ఆఫీసుకి" అన్నాడు చిరాగ్గా.

పూజారి కలగజేసుకున్నాడు. "వాదించుకోకండి సార్. ఇద్దరి పూజలూ కలిసే చేయించేస్తాను" అన్నాడు.

ఇద్దరూ శాంతించారు.

"ఆ! అమ్మ ఇటురండి. ఆ సార్! మీరటు నిలబడండి. చేతులు కడుక్కోండి" అంటూ పూజా కార్యక్రమం ప్రారంభించాడు.

"చెప్పండమ్మా మీ గోత్రం!" అడిగాడు.

"భారద్వాజస"

"పేరు? "

"శిల్పారామం!" చెప్పగానే, సూర్యహా, ఆదిత్య పక్కున నవ్వేశారు.

"ఇంకా నయం హైటెక్ సిటీ అని పేరు పెట్టుకోలేదు" అని వెంటనే గంభీరంగా అయిపోయారు.

చురచుర చూశారు ఆడపిల్లలు.

"ఏవిటన్నారు శిల్పారామమా? " పూజ

## కొత్తగాలి...

**నేతలు**
**మహా దాతలు**
**అందినంత తిని**
**చివరికి మిగిలేది నీకిస్తారు**

–ఎస్.జగన్ మాధవరావు,
బోయిన్‌పల్లి, కరీంనగర్ జిల్లా

ఆపేశాడు పూజారి.

"అవునండీ. శిల్పారామం" మళ్ళీ చెప్పింది.

"అమ్మా క్షమించాలి. ఆడపిల్లలకి ఇలా ప్రదేశాల పేర్లుండవు కదా! మరి మీ పేరు!" సంకోచంగా అడిగాడు పూజారి.

"మేము మొదట్నించీ తమిళనాడులో వుండేవాళ్ళం. శిల్ప నా పేరు. మా నాన్న గారి పేరు రామం. చిన్నప్పటినించే శిల్పా రామం అనే అంటారు అందరూ" వివరించింది.

"అదా అసలు విషయం. ఇక్కడ శిల్ప అనండమ్మ చాలు. నాన్నగారి పేరు వద్దులెండి. భారద్వాజస గోత్రోద్భవస్య శిల్పా నామధేయవతీ."

"ఆ సార్ మీ పేరు.. అన్నట్టు నా దగ్గరుందిగా" అంటూ రసీదు తీశాడు.

"కౌండిన్యస గోత్రోద్భవస్య నాగసత్య సూర్యహనుమత్ శంకరసాయి వేణుగోపాల దుర్గాశ్రీనివాస్ నామధేయస్య" అని చదివేసరికి ఆడపిల్లలు పడీపడీ నవ్వేసి బదులు తీర్చుకున్నారు.

అంతటితో ఆగక "ఇంకా నయం అప్పట్లో అయ్యప్పస్వామీ, సంతోషీ మాతా అంత ప్రాచుర్యంలో లేరు కాబోలు. వుంటే ఆ పేర్లు కూడా పెట్టేసేవాళ్ళే" అన్నారు.

సూర్యహా మొహం ఎర్రబడిపోయింది. ఏదో అనబోయాడు. కానీ పూజారి వారించాడు. "చూడండీ. మీరు పూజ చేయించుకునేందుకొచ్చారు. దేవుడి మీద దృష్టిపెట్టి భక్తి శ్రద్ధలతో పూజ చేసుకుంటే బావుంటుంది" అన్నాడు.

దాంతో వాదనలు ఆపేసి భక్తిగా చేతులు జోడించారు.

సంకల్పం చెప్పించి, "ఆ పూజ సామాన్ల లోంచి నువ్వుల నూనె, పాలూ, నువ్వులూ, వసుపు, కుంకుమ, పువ్వులూ తీసుకుని శనీశ్వరుడి దగ్గరకు వెళ్ళండి" అని చెప్పాడు.

ఆయన చెప్పినట్లు అటు వెళ్ళారిద్దరూ. కటకటాల మధ్యన వున్నాయి నవగ్రహాల విగ్రహాలు. ఇద్దరూ శనీశ్వరుడి విగ్రహం దగ్గర కాస్త దూరంగా నిలబడ్డారు.

"నేను మంత్రాలు చదువుతుంటాను ముందు నూనె, తర్వాత పాలు, తర్వాత నువ్వులూ శ్రద్ధగా అభిషేకం చెయ్యండి" అని చెప్పాడు.

కటకటాల్లోంచి చేతులు లోపల పెట్టి అభిషేకం ప్రారంభించారు ఇద్దరూ. భక్తితో చేస్తూనే అతని తెల్లని చేతివంక చూసి 'ఇతను చాలా మంచి కలర్' అనుకుంటూ ఒక్కక్షణం అతని మోహంవంక చూసింది. 'రంగేకాదు.. మంచి ఫీచర్స్' అనుకుని, 'ఛ ఇదేమిటో' అని దృష్టి మరల్చుకుని శ్రద్ధగా అభిషేకం చేసింది శిల్పా.

సూర్యహా పరిస్థితీ అలాగే వుంది. నాజూకైన చెయ్యి. ముదురు రంగు గోళ్ళ రంగు. వేలికి ముత్యపు ఉంగరం. రెండు బంగారు గాజులు. మెల్లిగా తలపక్కకి తిప్పి చూశాడు. పెద్ద కళ్ళు. చెక్కినట్లున్న ముక్కు. ఇలా చూడడం మర్యాద కాదు కాబట్టి దృష్టి మరల్చి దేవుడి మీద కేంద్రీకరించాడు.

అభిషేకం పూర్తయింది. ఇటురండని అన్నాడు పూజారి. వచ్చేశారు ఇద్దరూ.

మళ్ళీ పేర్లతో అవసరం పడిందేమో రసీదు తీసి నాగసత్య అని మొదలెట్టేసరికి వారించి, "అదంతా వద్దులెండి, సూర్యహా

అనండి చాలు" అన్నాడు. శిల్ప మళ్ళీ నవ్వుకుంది.

"మీ పేరేమిటమ్మా అన్నారు.. సాంప్ర దాయ వేదికా" అంటూ తడబడిపోయాడు పూజారి.

ఎంత ఆపుకున్నా నవ్వాగలేదు సూర్య హాకి. శిల్పకి కోపం వచ్చింది. "ఏమిటండీ మీ అయోమయం. ఆ పేరు ఎవరైనా పెట్టుకుంటారా? నా పేరు శిల్పారామం!" అంది.

"మన్నించాలి. సంప్రదాయ వేదికలో చాలా కార్యక్రమాలు చేయించాం. మీరు శిల్పారామం అంటే ఆ పేరే గుర్తొచ్చింది" అన్నాడు పూజారి.

ఆ తర్వాత కూడా "సార్, మీ పేరేమి టన్నారూ.. బుధహా కదూ!" అన్నాడు.

"కాదండీ బాబూ సూర్యహా.. తెలి యకపోతే అడగొచ్చుకదండీ" విసుక్కు న్నాడు.

"అయ్యా క్షమించాలి. కింద ఎవరో పెద్ద వాళ్లింట్లో హోమాలూ, జపాలూ వుంటే మా వాళ్ళంతా కట్టకట్టుకుపోయారు. నన్నొకడినే వదిలేశారు. ఆ టికెట్లు ఇచ్చే కుర్రాడు కూడా ఇదుగో ఇప్పుడే కాఫీ తాగొస్తా అని అటే పోరిపోయాడు. టికెట్లి వ్వడం దగ్గర్నుంచి తీర్థం ఇవ్వడం దాకా అన్ని పన్లు నేనే సమర్థించుకు రావలసి రావడంతో నాకూ హైరానా అయిపో తుంది. దానికితోడు మీ పేర్లు కూడా కాస్త తికమకగా వుండటం వల్ల ఏదో పొర బాటు జరుగుతుంది. అయినా పూజ మాత్రం యథావిధిగా చేయించానులెండి" అన్నాడు. ఆయనకి దక్షిణా తాంబూలం ఇచ్చి నమస్కారం చేశారు విడివిడిగా.

"శీఘ్రమేవ కల్యాణ ప్రాప్తిరస్తు" దీవిం చాడు ఇద్దరినీ విడివిడిగా.

పూజ ముగిసింది. శివాలయంలో దర్శనం చేసుకుని ఆకలి దంచేస్తూ వుండ డంతో పులిహోర పొట్లాలు కొనుక్కుని మెట్లమీద కూర్చున్నారు సూర్యహా, ఆదిత్య. శిల్పారామం, ఆవిడ ఫ్రెండూ మాత్రం వెంటనే వెళ్ళిపోయారు.

కారెక్కాక "పూజ బాగా జరిగింది. పులి హోర కూడా చాలా రుచిగా వుంది కదూ సూర్యహా పసివేదలా? " అన్నాడు ఆదిత్య.

"అవును అన్నీ చాలా బావున్నాయి" చెప్పాడు సూర్యహా.

ఆఫీసుకి వెళ్ళి రెండు మూడు గంటలు పనిచేసుకుని భోజనం టయానికి ఇంటికొ చ్చేశాడు.

"ఏంరా? పూజ బాగా జరిగిందా? బాగా చేయించాడా? " అంటూ ప్రశ్నలు వేసింది శారద.

సమాధానం చెప్పి భోజనంచేసి తన గదిలోకి వెళ్ళి పడుకున్నాడు. మనసులో ఏదో అలజడి. ఇదీ అని చెప్పలేని భావన. పుస్తకం తీసి చదవాలని ప్రయత్నించాడు. కాసేపు కంప్యూటర్ ముందు కూర్చు న్నాడు. గది సర్దాలని ప్రయత్నించాడు. దేనిమీదా మనసు వెళ్ళడంలేదు. విసుగ్గా వుంది. మూడింటికి లేచి, కారు వేసుకుని వెళ్ళిపోయాడు. సాయంత్రం పొద్దుపో యాక తిరిగొచ్చాడు.

"శలవు రోజునైనా ఇంటి పట్టున వుండ వుకదా? ఎక్కడికెళ్ళావురా? " అని మంద లించింది శారద.

"ఫ్రెండ్‌ని కలవడానికి వెళ్ళాను" అన్నాడు. ఆ తర్వాత కాసేపు బామ్మని ఆటపట్టించాడు. తండ్రి దగ్గర కూర్చుని కబుర్లు చెప్పాడు. వంటింట్లోకి వెళ్ళి తల్లికి సాయం చెయ్యబోయి, పంచదార సీసా పగలగొట్టి ఆవిడచేత చివాట్లు తిన్నాడు.

రాత్రి ఎంతసేపైనా నిద్రపట్టంలేదు. కళ్ళు మూసినా తెరిచినా శిల్పారామం కళ్ళ ముందు కదులుతోంది. మళ్ళీ శనివారం తనూ వస్తుందా పూజకి. కొంపతీసి ఇదే

ఆఖరి వారం కాదుకదా తనకి! కంగారుప డ్డాడు.

అంతలోనే గుర్తువచ్చింది.. శిల్పారామం రాగానే శనిపూజ చేయించేది ఎక్కడా? అని అడిగింది. అంటే ఆవిడికీ కొత్తే. తన లాగా వాళ్ళ అమ్మ అయిదు వారాలు పూజ చేయించమందేమో. ఇదే మొద టివారం కాబట్టి వచ్చే శనివారం తప్ప కుండా వస్తుంది. పన్లోపనిగా తనూ అయిదు వారాలూ చేసేస్తే సరి.

మళ్ళీ వచ్చే శనివారం కోసం వెయ్యికళ్ళతో ఎదురు చూడసాగాడు. కాలం అతి మెల్లిగా నడుస్తూ అతని ఓర్పునూ పరీక్షించింది. శుక్రవారం వచ్చేసింది. తెల్లవారితే శనివారం. ఆవేళ పగలంతా ఊపిరి సలపనంత పని. అక్కడినించి క్లయింట్ బుర్రతిం టున్నాడు. ఆ చిక్కు సమస్యలన్నీ తీర్చుకుని ఇంటికొచ్చేసరికి అర్ధరాత్రి దాటింది. అప్పుడు వచ్చి స్నానం చేసి కాసిని పాలు తాగి పడుకున్నాడు. వెంటనే నిద్రపట్టలేదు. తెల్లవారుజా మున నిద్ర ముంచుకొచ్చింది.

ఎండ మొహాన పడుతూవుంటే తుళ్ళిపడి లేచాడు. ఆవేళ శనివార మని గుర్తు వచ్చింది. ఆ వెంటనే గుడి, గుళ్ళో పూజ, శిల్ప గుర్తుకురావ డంతో వెంటనే లేచి పది నిముషాల్లో స్నానం చేసి తయారై కిందికి వచ్చాడు.

కొడుకుని చూసి జాలిపడింది శారద. పాపం పిచ్చిసన్నాసి. నా మాటమీద గౌరవంతో వాడికంతగా నమ్మకం లేకపోయినా పూజకోసం పరుగులు పెడుతున్నాడు అనుకుంది.

చాలా ఆలస్యం అయిపోయింది. ఆ అమ్మాయి వచ్చి పూజ ముగించుకుని వెళ్ళి పోతోందేమో అని దారంతా కంగారు పడుతూనే వున్నాడు. గుడికి చేరుకుని కారు పార్క్ చేసి వెళ్ళబోతుంటే మెట్లుదిగి వస్తోంది శిల్ప.

గబగబా ఎదురువెళ్ళాడు. "వెళ్ళిపోతు



న్నారా? పూజ అయిపోయిందా?" దీనంగా ప్రశ్నించాడు.

"లేదండీ. పైన కొట్లో పూజ సామాన్లు లేవు. అయిపోయాయిట. అయిదు నిము షాల్లో తెప్పిస్తాం అన్నారు గానీ అరగంట



దాటినా అతీగతీ లేదు. కింద షాపులో దొరుకుతాయిట. వెళ్తున్నాను" అంది శిల్ప.

"అలాగా.. నేను వెళ్ళి ఇద్దరికోసం తీసుకొస్తాను. మీరు గుళ్ళోకి వెళ్ళండి" అని వెనక్కి తిరిగాడు. ఇద్దరికీ పూజసామాగ్రి కొని మెట్లెక్కి గుళ్ళోకి వెళ్ళాడు. నేరుగా టికెట్ తీసుకునేందుకే వెళ్తుంటే వెనక నించి పిలిచింది శిల్ప. "మీ టికెట్ నేను తీసుకున్నాను" అంది.

థాంక్స్ అంటూ టికెట్ తీసుకుని డబ్బులిచ్చేశాడు. శిల్ప అతని దగ్గర్నించి పూజసామగ్రి తీసుకుని డబ్బులిచ్చేసింది.

ప్రదక్షిణ చేసి నవగ్రహాల గుడి దగ్గరికి వెళ్ళారు. ఆవేళ జనం చాలామంది వున్నారు. పూజకోసం వేచివున్నారు.

"ఇవ్వాళ ఏదో విశేషం ఉందేమో చాలా మంది వున్నారు. మన వంతు వచ్చేసరికి చాలా సమయం పట్టేలా వుంది. ఆ పక్కన కూర్చుందాం" అన్నాడు.

"సరే పదండి. ఎండలో నిలబడే బదులు నీడలో కూర్చుందాం" అంది శిల్ప.

ఇద్దరూ పక్కనే వున్న మండపంలో కూర్చున్నారు.

"మీరు ఎక్కడ వుంటారు? " అడిగాడు.

"ఆనంద్‌బాగ్‌లో. మరి మీరు? "

"ఎ.ఎస్.రావ్‌నగర్. ఇక్కడే పని చేస్తున్నారా? " మరో ప్రశ్న.

"అవునండీ. ఎమ్.బీ.ఎ. ఫైనాన్స్ చేశాను. ఐ.సి.ఐ.సి.ఐ. బ్యాంక్‌లో పని చేస్తున్నాను. సైబర్ టవర్లో మా ఆఫీసు" చెప్పింది.

"నేను గౌహతిలో ఐ.ఐ.టి. చేశాను. కేంపస్ ఇంటర్వ్యూలో సెలక్ట్ అయ్యాను. విప్రోలో పని చేస్తున్నాను. హైటెక్ సిటీలో మా ఆఫీసు" చెప్పాడు సూర్యహా.

"మీరు మొదటి నించీ హైదరాబాద్‌లోనే వున్నారా? " అడిగింది శిల్ప.

"అవునండీ. నాన్నగారు డి.ఆర్.డి.ఎల్‌లో పనిచేసి రిటైర్ అయ్యారు. ఇక్కడే వుంటున్నాం. మరి మీరు? "

"నాన్నగారి సర్వీస్ అంతా తమిళనాడులో. నైవేలీలో పనిచేసి రిటైర్ అయ్యారు. ఆ తర్వాత ఇక్కడికే వచ్చాశాం. మా బంధువులందరూ ఈ ఊళ్లోనే వున్నారు" చెప్పింది శిల్ప.

"మీకు అన్నదమ్ములూ, అక్కచెల్లెళ్ళూ వున్నారా? "

"ఆ ఒక్కడే తమ్ముడు. మెడిసిన్ చేస్తున్నాడు. మరి మీకో? "

"ఎవరూ లేరు. నేనొక్కడినే"

"అందుకేనా మీకు అంత పెద్ద పేరు పెట్టారు మీ పెద్దవాళ్ళు" నవ్వుతూనే అడిగింది. నవ్వేశాడు సూర్యహా.

ఇక ఆ తర్వాత సినిమాలూ, రాజకీయాలూ, ఏవిటేవిటో మాట్లాడుకుంటూ వుండిపోయారు.

పూజ కోసం వచ్చిన వాళ్ళంతా పూజ చేసుకుని వెళ్ళిపోయారు. వీళ్ళ తరవాత వచ్చినవాళ్ళూ వెళ్ళిపోయారు.

"ఆc ఇంకా ఎవరైనా శనిపూజ కోసం టికెట్ తీసుకున్న వాళ్ళున్నారా అండీ? ఉంటే రావాలి త్వరగా. గుడి మూసేసే టైం అవుతోంది" అంటూ పూజారి కేక పెట్టేసరికి ఉలిక్కిపడి లేచి వెళ్ళారు ఇద్దరూ.

మరింత శ్రద్ధాసక్తులతో పూజ చేశారు. పులిహోర కొనుక్కుని తిన్నారు. మెట్లు దిగి కిందికి వచ్చారు. 'మీరు ఎలా వచ్చారు? " అడిగాడు.

"నా ఏక్టివా సర్వీసింగ్‌కి ఇచ్చాను. ఆటోలోనే వచ్చాను" చెప్పింది శిల్ప.

"నేను కార్లో వచ్చాను. రండి మిమ్మల్ని మీ ఇంటిదగ్గర దిగబెడతాను" అన్నాడు.

"వద్దు. ఆటోలు దొరుకుతాయి. నేను వెళ్తాను" అంటూనే మరో మాటకు ఆస్కారం ఇవ్వకుండా వెళ్ళి ఇతను చూస్తుండగానే ఆటో ఎక్కి బై చెప్పేసి వెళ్ళిపోయింది.

బరువుగా నిట్టూర్చాడు సూర్యహా.

మళ్ళీ ఆ వేళంతా మనసులో శిల్ప చొరబడి చెప్పుకోలేని అలజడి రేపుతోంది. దీన్నే ప్రేమంటారా? ఒక్కసారి చూసేసరికి, ప్రేమ కలగటం సాధ్యమా? కాదు, నాలుగు మాటలు మంచిగా మాట్లాడింది కాబట్టి కలిగిన ఆకర్షణ అని సరిపెట్టుకుందాం అంటే అదివరకు పెళ్ళిచూపుల్లో ఆ అమ్మాయిలతోనూ బాగానే మాట్లాడడం జరిగింది.

అప్పుడు ఇటువంటి భావన కలగలేదు. ఆ అమ్మాయికీ పెళ్ళి కాలేదని తెలుస్తూనే వుంది. నిన్ను చూస్తుంటే నాకలా వుంది. కాబట్టి నువ్వు నన్ను పెళ్ళి చేసుకుంటావా అని అడగడం మంచిదేనా? ఆవిడ అపార్థం చేసుకోదు కదా?

మండపంలో కూర్చున్నప్పుడు కలివిడిగా మాట్లాడింది. కానీ కారులో దింపుతాను రమ్మంటే వద్దు ఆటోలో వెళ్ళిపోతానని కచ్చితంగా చెప్పింది.

అటువంటి వ్యక్తిని నేరుగా పెళ్ళి విషయం ఎలా అడగటం? అడగకుండా వూరుకుంటే ఒక మంచి అవకాశాన్ని చేతులారా జారవిడుచుకున్నట్లు అవుతుందా? ఎటూ తేల్చుకోలేక తికమకపడిపోతున్నాడు.

పరాకుగా వుంటున్న కొడుకులోని మార్పు గమనించింది శారద.

"ఏవిట్రా చిట్టీ.. అలా వున్నావ్? "అని వెంటబడి వేధించింది కూడా.

"ఏవో ఆఫీసులో సమస్యలు" అని తప్పించుకున్నాడు.

మళ్ళీ శనివారం వచ్చింది. ఎంతో ఉత్సాహంగా గుడికి వెళ్ళాడు. శిల్ప కనిపించలేదు. పూజ చేయించాక కూడా గుడి మూసేసేదాకా అక్కడే కూర్చున్నాడు. శిల్పారామం అనే భక్తురాలు వచ్చి వెళ్ళిందా అని టికెట్లు ఇచ్చే అతన్ని అడు

# మానవత్వానికి మచ్చు తునక

అక్షరాల నిజం

విజయవాడలో 1934లో కాం|గ్రెస్ మహాసభలు జరుగనున్నాయి. అందులో పాల్గొనాలని కల్లూరు సుబ్బారావు హిందూపురం నుంచి బయలు దేరారు. రైల్వే స్టేషన్‌కు వెళ్ళి టిక్కెట్టుకోసం ఒక శిష్యునికి డబ్బులు ఇవ్వబోతున్నారు. అంతలో ఆయనకు ఓ హృదయ విదారక దృశ్యం కంటబడింది చలించి పోయారాయన.



ఒక పిల్లవాడు చేతిలో పలక, పాత పుస్తకంతో ధనిక వ్యక్తి దగ్గర ఏదో యాచిస్తున్నాడు. అతడేమో పిల్లాడిని చూసి విసుక్కుంటున్నాడు. వెంటనే శిష్యునితో ఆ పిల్లవాడిని పిలుచుకు రమ్మన్నారు. తన దగ్గరకు రాగానే అన్ని వివరాలు కనుక్కున్నారు. పిల్లాడికి చదువుకోవాలనే ఆశవుందిగాని, పుస్తకాలు కొనే స్థోమత లేదు. అతడి దీన పరిస్థితిని గమనించిన ఆయన తన దగ్గరున్న సొమ్ము మొత్తం తీసి ఆ పిల్లవాని చేతిలో పెట్టి తన చేతిని అతని తలపై దీవెన రీతిలో పోనిచ్చి 'పుస్తకాలు కొనుక్కుని బడికి వెళ్లు. మిగిలిన దానితో ఒక అంగీ నిక్కరు కొనుక్కో' అన్నారు. అనంతరం ఎవరి దగ్గరో అప్పుచేసి విజయవాడ వెళ్లారు.

గుదామనుకుని, నవ్వుకుంటారేమో అని మానేశాడు.

ఎందుకు రాలేదు? కారణం ఏమై వుంటుంది? అన్యమనస్కంగానే ఇంటికొచ్చాడు.

వచ్చీ రాగానే తండ్రి పిలిచాడు. "మంచి సంబంధం వుందిట. రేపు పెళ్ళి చూపులకి వెళ్దామా? " అని అడిగాడు.

"అబ్బ. ఏం పెళ్ళిచూపులు నాన్నా? నాకు విసుగేస్తోంది. కొన్నాళ్ళు నా పెళ్ళి ప్రయత్నాలు మానెయ్యండి" అన్నాడు కాస్త విసుగ్గా.

"ఇది మరీ బావుందిరా? నీకై నువ్వు వెతుక్కోరా అంటే ఆర్నెల్లు గడిచినా ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్నట్లుగా వుంది నీ వ్యవహారం. నేను చచ్చి సతమతమై సంబంధాలు వెతుకుతుంటే కూడా చిరాకు పడితే నేనే గంగలో దూకేదిరా? " క్రిష్ణకీ విసుగేసింది.

శారద కల్పించుకుంది "వాడు ఆఫీసు పని ఒత్తిడితో సతమతం అవుతున్నాడు. పది రోజులుగా చూస్తున్నాను. పగలూ రాత్రీ తేడా లేకుండా కాలుగాలిన పిల్లిలా పచార్లు చేస్తున్నాడు. వాడి అవస్థ చూడలేకపోతున్నాను. ఆ పనులన్నీ సర్దుబాటు చేసుకున్న తర్వాత వాడే స్థిమితపడతాడు. ఈ వారం కాకపోతే తర్వాత వెళ్దాం పెళ్ళి చూపులకి. అబ్బాయికి తీరికలేదు. వచ్చే వారం వెళ్దామని చెప్పండి ఆ మేరేజి బ్యూరో వాళ్ళకి" అంది.

"ఆ! అయ్యగారు వచ్చేదాకా అమావాస్య ఆగుతుందా? మనం ఇలా మీనమేషాలు లెక్కపెడుతూ వుంటే మంచి సంబంధాలు చెయ్యిదాటి పోతాయి" క్రిష్ణ మళ్ళీ విసుక్కున్నాడు.

సూర్యహా మనసు చివుక్కుమంది.

శిల్పకి కూడా పెళ్ళి ప్రయత్నాలు ముమ్మరంగా చేస్తున్నట్టూ అర్థం అవుతూనే వుంది. వాళ్ళూ శనిపూజలవీ చేయిస్తున్నారు. సాధారణంగా పెళ్ళిచూపులు సెలవు రోజుల్లోనే ఏర్పాటు చేస్తున్నారు.

ఈ శని ఆదివారాల్లో శిల్పని చూడ్డానికి ఎవరైనా వస్తారా? సరేనంటారా? ఆలోచనలతో బుర్ర వెడెక్కిపోయింది. ఆదివారం గడిచిపోయింది.

శిల్పతో మాట్లాడుదామంటే ఆవిడ ఫోన్ నెంబర్ లేదు. ఫోన్‌లో మాట్లాడేంత చనువూ లేదు. మళ్ళీ శనివారం దాకా ఆగాలి. అప్పుడైనా వస్తుందో లేదో మరి!

మనసు ఉగ్గబట్టుకోలేక సోమవారం నాడు లంచ్ టైమ్‌లో సైబర్ టవర్స్‌లో వున్న ఐ.సి.ఐ.సి.ఐ. బ్యాంకుకు వెళ్ళాడు. ఎక్కువ శ్రమ పడకుండానే కనిపించింది శిల్ప! ఇతన్ని చూసి తెల్లబోయింది!

"ఇలా వచ్చారేం?" అడిగింది.

"మొన్న వారం గుడికి రాలేదేం?" ఉక్రోషం దాచుకోలేకపోయాడు.

"పొద్దున్నే వెళ్ళివచ్చాను. అమ్మా నేనూ వెళ్ళాం. ఈ విషయం కనుక్కునేందుకు వచ్చారా?" అడిగింది ఆశ్చర్యంగా.

హఠాత్తుగా మొహమాటం వేసింది అతనికి.

"కాదు. నాకు లోన్ కావాలి. మీ బ్యాంకు వాళ్ళు ఇస్తారేమో అడుగుదామని వచ్చాను" ఏదో తోచిన సమాధానం ఇచ్చాడు.

"ఎందుకివ్వం? మహారాజుల్లా ఇస్తాం. అందుకేగా మేమున్నది! చెప్పండి ఏ లోన్ కావాలి మీకు?" అడిగింది.

బుర్ర గోక్కున్నాడు. 'వాహనం వుంది. ఇల్లుంది. అసలిప్పుడు అతనికి అప్పెందుకూ?' అతని వ్యవహారం చూసి ఇది అప్పుకోసం వచ్చిన వ్యవహారం కాదని అర్థం అయిపోయింది. ఆట పట్టించాలనిపించింది.

"మీరోపని చెయ్యండి. అటుగా ఆ మూల వున్నారు చూడండి సుధాకర్. అతను ఈ లోన్ల విషయం చూస్తారు. వెళ్ళి అడిగితే వివరంగా చెప్తారు" అంది అతి మర్యాదగా.

"ఆ వద్దొద్దు. మీరే విషయాలు చూస్తారు?" అడిగాడు.

"ఇన్సూరెన్స్‌లు చూస్తుంటాను" చెప్పింది శిల్ప.



"అయితే నాకూ ఇన్సూరెన్స్ కావాలి. వివరాలు చెప్పండి?"

"మీకే విధమైన పాలసీ కావాలి చెప్తే వివరాలు చెప్తాను" అంది.

మళ్ళీ బుర్ర గోక్కున్నాడు. లైఫ్ కవరేజి, హెల్త్ ఇన్సూరెన్స్ అప్పటికే వున్నాయి. ఏదో ఒక సమాధానం చెప్పాలి కాబట్టి.

"పిల్లల ఉజ్వల భవిష్యత్తు కోసం ఏదైనా ప్లాన్ వుంటే చెప్పండి!" అన్నాడు.

"మంచి మంచి పథకాలున్నాయి. మీ పిల్లల వయసెంతో చెప్తే ఏది మీకు సరిపోతుందో చెప్తాను" సాధ్యమైనంత గంభీరత తెచ్చిపెట్టుకుని గంభీరంగానే సమాధానం చెప్పింది.

"నాకింకా పెళ్ళే కాలేదు. పిల్లలెక్కడున్నారు?" అన్నాడు అయోమయంగా.

"పుట్టని పిల్లల కోసం మా దగ్గర ఏమీ లేవు. పిల్లలు పుట్టాక రండి!" అంది శిల్ప.

"పోనీ వృద్ధాప్య ఫించను కోసం ఏదైనా బీమా వుందా? " అడిగాడు దీనంగా.

"ఆ... వుంది" అంటూ వివరించింది శిల్ప. దానికి సంబంధించిన వివరాలున్న కరపత్రం కూడా అందించింది.

అదంతా విన్నాడో లేదో ఆ భగవంతుడికి ఎరుక!

చెప్పాల్సిందంతా చెప్పేసి. "ఓకే థాంక్యూ! హేవ్ ఎ నైస్ డే!" అంది ఇక నువ్వు దయచెయ్ అని చెప్పకుండా!

లేచి నిలబడ్డాడు సూర్యహా. "మీ ఫోన్ నెంబరు ఇస్తారా? " అడిగాడు.

"ఎందుకు? "

"ఈ ప్లాన్ గురించి ఇంకేమైనా సందేహాలుంటే అడిగి తీర్చుకోడానికి!" అన్నాడు. కాస్త తటపటాయించింది శిల్ప.

"నేను అల్లరి చిల్లరి వాడిని కాదు. చాలా మంచివాడిని. మీరు నిరభ్యంతరంగా నాకు నెంబరు ఇవ్వచ్చు" అన్నాడు. నవ్వేసి నెంబరిచ్చింది శిల్ప.

అలా శిల్ప నెంబర్ అడిగి తీసుకున్న తర్వాత ఆరు రోజులకి మళ్ళీ మరో ఫోన్ నెంబరు అడిగాడు.

"శిల్పా మీకు అంగీకారం అయితే మీ నాన్నగారి ఫోన్ నెంబర్ ఇస్తారా? " అని అడిగాడు.

"ఎందుకూ? " తెలిసినా తెలియనట్లే అడిగింది. ఈ ఆర్రోజులూ రోజుకి కనీసం గంటసేపు ఫోన్లో మాట్లాడుకుంటూనే వున్నారు వాళ్ళిద్దరూ. ఎవరికివారే గట్టి నిర్ణయానికి వచ్చారు.

మగవాడు కాబట్టి తనే చొరవ తీసుకున్నాడు సూర్యహా!

ఆడపిల్ల కాబట్టి వగలుపోయింది శిల్ప. అందుకే ఎందుకూ అని అడిగింది.

"మా నాన్నగారికి ఇస్తాను. ఆయన మీ నాన్నగారితో మాట్లాడతారు. మనిద్దరూ ఇష్టపడినా ముందు జరగవలసినదంతా పెద్దవాళ్ళు జరిపిస్తేనే బావుంటుంది కదా!" అన్నాడు.

చిన్నగా నవ్వింది శిల్ప. "ఇస్తాను తీసుకోండి.." అంటూ తండ్రి నెంబరు ఇచ్చింది.

అప్పుడు రాత్రి పది గంటలు అయింది.

ఇప్పుడే చెప్పడమా అనుకుని వద్దులే రేపు పొద్దున్నే చెప్పొచ్చు అనుకున్నాడు. కానీ మనసు ఆగలేదు. చివరికి పదకొండింటికి గదిలోంచి బయటికి వచ్చి తండ్రి గది తలుపు తట్టాడు.

క్రిష్ణ నిద్రపోతున్నాడు. శారద పుస్తకం చదువుకుంటోంది. "ఎవరూ! చిట్టీ! లోపలికి రా!" అంది.

లోపలికి వచ్చాడు సూర్యహా. మంచం మీద కూర్చున్నాడు.

"ఏవిట్రా ఈ వేళప్పుడు వచ్చావు? " అనుమానంగా అడిగింది.

"మీతో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడాలమ్మా. నాన్నగారినీ లేపుతాను" అంటూ క్రిష్ణని తట్టి లేపాడు. లేచి కళ్ళు తెరిచాడు క్రిష్ణ. "ఏవిట్రా? " అన్నాడు నిద్ర మత్తుగా.

కాస్త సిగ్గుపడి, మరికాసేపు సంకోచించి చివరకు తన మనసులోని మాట చెప్పేశాడు. ఆవలించి పక్కకు తిరిగి పడుకుని నిద్రలోకి జారుకున్నాడు క్రిష్ణ.

శారద చివాల్న లేచి కూర్చుంది. "ఏవిట్రా. నిజంగానా? ఎవరా అమ్మాయి? మన వాళ్ళేనా? నువ్వు తొందరపడి నిర్ణయించుకోలేదుకదా" అంటూ ప్రశ్నల వర్షం కురిపించింది.

అన్నింటికీ ఓపిగ్గా సమాధానాలు చెప్పి బయటకు వచ్చేశాడు.

ఎగిరి గంతేస్తారనుకున్న నాన్నగారు ఏ రియాక్షనూ లేకుండా వుండిపోవడం, అమ్మ కంగారుపడడం కాస్త వింతగా అనిపించింది అతనికి.

సెప్టెంబరు -09

## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. పి.సుబ్బారావు - సంగారెడ్డి, మెదక్ జిల్లా
2. జి.శంకర్ - పెందుర్తి, విశాఖ జిల్లా
3. యల్లాప్రగడ ఉదయశ్రీ - పెదపల్లి, గుంటూరు జిల్లా
4. మోడి స్వర్ణ - కూకట్‌పల్లి, హైదరాబాద్
5. కె.జయప్రకాశ్ రెడ్డి - సిద్ధార్థకాలనీ, నల్గొండ



### సరైన జవాబులు

1. రమేష్ 2. మేజర్ వర్మ 3. మధు 4. సువర్ణ 5. అఖిల్ 6. లై డిటెక్టర్ 7. స్మృతి సత్తా భవిష్యత్ 8. కాజల్ 9. రూపాదేవి 10. లోకేష్

శారదకి నిద్ర ఎగిరిపోయింది. కొడుకు వివాహం ఒక కొలిక్కి వచ్చిందనే ఆనందం ఒక పక్క, ఇక జీవితంలో పెద్దమార్పు వస్తుంది.. కోడలు వచ్చేస్తోంది. ఆ తర్వాత ఇంటి వాతావరణంలో ఎటువంటి మార్పులు వస్తాయో అనే చిన్న దిగులు ఒకపక్క. ఎన్నో ఆలోచనలు చుట్టుముడుతూ వుంటే నిద్రకూ దూరం అయింది శారద.

తెల్లవారుజామున కునుకు పట్టింది.

మామూలుగా ఆరింటికే లేచిన క్రిష్ణ, దైవాన్ని తల్చుకున్నాక పక్కకు తిరిగి, భార్య భుజం తట్టి లేపాడు.

"శారదా నిన్నే.. లే!" అన్నాడు.

బద్ధకంగా కళ్ళువిప్పింది "ఏవిటండీ? " అంది.

"నాకు నిన్న రాత్రి మంచి కల వచ్చింది. అబ్బాయి నా దగ్గరికి వచ్చి- నాన్నా నేను ఒక అమ్మాయిని ఇష్టపడుతున్నానూ- అని చెప్పాడు. వాడలా చెప్తున్నప్పుడు కలలో నువ్వు కూడా నా పక్కనే వున్నావు" అన్నాడు సంబరంగా.

విషయం అర్థం అయింది శారదకి. నవ్వేసింది.

"శ్రీరామచంద్రా అది కల కాదు. నిజమే" మీరు మంచి నిద్రలో వున్నారు. నిజానికీ, కలకీ తేడా తెలియలేదు మీకు" అంది.

క్రిష్ణ మొహం దివిటీలా వెలిగిపోయింది. "ఏవిటి శారదా? నువ్వు చెప్తోంది నిజమేనా? మన అబ్బాయి ప్రేమించాడా? నువ్వు నన్ను తమాషా చెయ్యడం లేదు కదా? " అన్నాడు.

"తమాషా కాదు. అక్షరాలా నిజం" చెప్పింది.

క్రిష్ణకి కళ్లవెంట ఆనందబాష్పాలు. "ఇన్నాళ్టికి వీడికి మంచి బుద్ధి పుట్టింది. ఏడీ? ఏడీ నా బంగారు తండ్రి!" అంటూ చివాల్న మంచందిగి కొడుకు గదిలోకి వెళ్లాడు. సూర్యహాని కావలించేసుకున్నాడు. "నా నెత్తిన పాలుపోశావురా. ఇప్పుడు చెప్పు" అన్నాడు.

వివరాలన్నీ విన్నాడు. ఫోన్ నెంబరు

తీసుకున్నాడు. వెంటనే ఫోన్ చేస్తానని లేవబోతే శారద వారించింది. "ఇంకా నాలుగు మూలలా తెల్లవారలేదు. కాసేపు ఆగి కాఫీలూ, పలహారాలూ అయ్యాక ఏ తొమ్మిదింటికో చెయ్యండి" అంది.

కాఫీ ఇచ్చాక, "ఎందుకైనా మంచిది ఒక ఫోను పార్థసారథి అన్నయ్యగారికి కూడా చేస్తారా? " అంది.

"ఏం అవసరం లేదు. వాడి మాట సాయం మనకు అచ్చిరావడంలేదు" అన్నాడు క్రిష్ణ. అతను వద్దనుకున్నా తప్ప లేదు.

తలచినంతనే ప్రత్యక్షం అయ్యే దైవం లాగా తనే వచ్చేశాడు పార్థసారథి.

"ఆ! ఏవిట్రా విశేషాలూ? ఎంతదాకా వచ్చింది మనవాడి పెళ్ళి విషయం? నిన్ననే నాకు ఒక మంచి సంబంధం తట స్థపడింది. నీచెవిన వేసి వెళ్దామని వచ్చేను" అంటూ వచ్చి కుర్చీలో కూర్చున్న మిత్రుడిని చూసి, గర్వంగా నవ్వేడు క్రిష్ణ.

"నీకా శ్రమ అవసరం లేదు. మావాడే ఎంపిక చేసుకున్నాడు" అన్నాడు ఠీవిగా.

"అలాగా మరి చెప్పవేం? " అని సంతో షపడ్డాడు పార్థసారథి.

వివరాలు అడిగి "తొమ్మిది కావస్తోంది. ఇంకా ఆలస్యం ఎందుకు? ఫోన్ చేసేయ్" అని తొందరపెట్టాడు.

ఫోన్ నెంబర్ తీసుకుని డయల్ చేశాడు క్రిష్ణ.

అవతల ఫోన్ తీశారు "హల్లో"

"అది శిల్పారామంగారి ఇల్లేనా అండీ!"

"అవునండీ. నేను శిల్ప తండ్రిని మాట్లా డుతున్నాను"

"నమస్కారం. మీ అమ్మాయి పెళ్ళి విషయం మాట్లాడాలని ఫోన్ చేశాను"

"అలాగా. ఒక్కక్షణం లైన్లో వుంటారా? కాయితం, కలం తెచ్చుకుని మీ వివరాలు రాసుకుంటాను" అంటూ వెళ్ళి పెళ్ళి సంబంధాలకోసం కేటాయించిన పుస్తకం, కలం తెచ్చుకున్నాడు.

"ఆ చెప్పండి!" అన్నాడు.

"నా పేరు పసివేదల క్రిష్ణమోహన్. సంబంధం మా అబ్బాయికి"

మధ్యలో అడ్డుతగిలాడు అవతలిమనిషి. "ఏవిటీ పసివేదల క్రిష్ణమోహన్‌గారా? "

"అవునండీ"

"క్షమించాలి. మీరు గుంటూరు హిందూ కాలేజిలో పి.యు.సి. చది వారా? " అడిగాడు.

ఆశ్చర్యపోయాడు క్రిష్ణ. "అవునండీ!"

"మీరు అరండల్‌పేట నాలుగోలైన్లో వుండేవాళ్ళు కదూ!" మరో ప్రశ్న.

"అవును. ఇంతకీ మీరెవరండీ!" కుతూ హలంగా అడిగాడు.

"నేను పీసపాటి సీతారామాన్ని. క్రిష్ణా.. గుర్తు పట్టావా? మనిద్దరం క్లాస్‌మేట్స్‌మి. కలిసి కాలేజీకి వెళ్లేవాళ్ళం" ఆయన గొంతులో స్నేహం తొణికిసలాడింది.

"రామం నువ్వా! నిజమేనా! ఎన్నాళ్ళకె న్నాళ్ళకి? " ఇంకా సంభ్రమాశ్చర్యాలనుండీ పూర్తిగా తేరుకోలేదు క్రిష్ణ. ఓ నిముషం పాటు ఇరువైపులా మౌనం.

ఏనాడో నలభై, ఏభై ఏళ్ళ కిందటి పాత స్నేహితుడు హఠాత్తుగా ఎదురైతే సంభా షణ ఎలా కొనసాగించాలి? అసలెక్కడి నుంచి మొదలుపెట్టాలి? అయోమయావ స్థలో వుండిపోయారు.

చివరికి రామం ముందు తేరుకున్నాడు.

"చెప్పరా క్రిష్ణా. ఎలా వున్నావ్ ఏమిటి? " అని అడిగాడు.

తన ఉద్యోగం గురించి చెప్పాడు క్రిష్ణ. రామం కూడా తన ఉద్యోగం వివరాలు చెప్పాడు.

"క్రిష్ణా. నీకు పోడూరి ప్రసాద్ గుర్తు న్నాడా? " హఠాత్తుగా అడిగాడు.

"ఆ! గుర్తే. బాగా చదివేవాడు వెధవ"

చెప్పాడు క్రిష్ణ.

"వాడి చెల్లెలు సరళనే నేను పెళ్ళి చేసుకున్నాను. నీకు గుర్తుండే వుంటుంది. పెద్ద జడ, చామనఛాయ" తన వివాహం గురించి చెప్పాడు రామం.

"ఆ! అవునవును గుర్తుంది. ఓసారి మనిద్దరం ఆ అమ్మాయిని ఏడిపించాం కదూ!"

"అవున్రా అప్పుడు నేను తనని ఏడిపించానని ఆ తర్వాత జీవితాంతం తను నన్నేడిపిస్తోంది" నవ్వుతూ చెప్పాడు.

"మరి నీ సంగతి ఏమిటీ? " అడిగాడు.

"నేను మా పెద్ద మామయ్య కూతురినే చేసుకున్నానురా!" చెప్పాడు క్రిష్ణ.

"మామయ్య కూతురంటే మీ ఇంట్లో వుండి చదువుకునేది.. శారద అని.. ఆ అమ్మాయేనా? "

"అబ్బ.. నీకెంత గుర్తురా! అవును శారదే!"

"అయితే మీ శారదా, మా సరళా కూడా క్లాస్‌మేట్లే కదురా!"

మరింత ఆశ్చర్యపోయాడు క్రిష్ణ.

"అలాగా? "

"అలాగా ఏమిట్రా? అంతేగా మరి. వాళ్ళిద్దరూ బండ్లమూడి హనుమాయమ్మా హైస్కూల్లో ఫోర్త్‌ఫారం చదివేవాళ్ళు కదూ!" పార్థసారథికి అంతా అయోమయంగా ఉంది.

"అవును" చెప్తూ ఉన్న క్రిష్ణ చేతిమీద తట్టాడు పార్థసారథి.

"ఎవ్రిట్రా.. ఎవరూ? " సస్పెన్స్ భరించలేకపోతున్నాడు.

"రామం నీకు గుర్తుందా.. పార్థసారథి అని మన ఫ్రెండు. ఏ.సీ. కాలేజీలో చదువుతూ వుండేవాడు. అదేరా! మా పక్క పోర్షన్‌లో వుండేవాడు!"

"ఆ! ఆ! అడిగినా అడగకపోయినా జోరబడిపోయి ఉచిత సలహాలు ఇచ్చేవాడు.. అతనేనా? " గుర్తు తెచ్చుకున్నాడు రామం.

## అది 'వేరే' మరి!

సుప్రసిద్ధ రచయిత ముదిగొండ శివప్రసాద్ రాసిన 'మహాసర్గ' కావ్యం శ్రీశ్రీ మహాప్రస్థానానికి అనుకరణ అని ఆరోజుల్లో చాలా మంది వ్యాఖ్యానించారు. ఈ వ్యాఖ్యలు చేసిన వాళ్లగురించి శివప్రసాద్ మాట్లాడుతూ 'వాళ్ల మొహం. అబ్బే అది వేరు' అన్నారు. దానిపై శ్రీశ్రీసరసమైన వ్యాఖ్య- 'అవును, అది వేరు'




## ఇంకెక్కడికి పొమ్మంటారు?

'గో టు హెల్' అని రేడియోవాళ్లకి నిన్న రాశానని చలం శ్రీశ్రీతో అన్నారు. దానికాయన, 'అయ్యో! అట్లా ఎందుకు రాశారండి. వాళ్లు ఉన్నదే హెల్ కదా! వాళ్లనింకెక్కడికి పొమ్మన్నారు?' అన్నారు హాస్యంగా.




"అవునవును వాడే. ఆ ఉచిత సలహాలు ఇచ్చే అలవాటు ఇప్పటికీ అలాగే వుంది. ఆ.. టచ్‌లో వుండడం ఏమిటీ, ఇడుగో ఇక్కడే వున్నాడు. మాట్లాడు" అని చెప్పి,

"మన పాత ఫ్రెండ్ సీతారామం" అని ఫోన్ అందించాడు.

శారదని పిల్చి ఈ విషయాలన్నీ చెప్తే తెల్లబోయిందామె. "అయ్యో సరళ నాకు మంచి ఫ్రెండ్. అప్పట్లో చాలా సన్నిహితంగా వుండేవాళ్ళం" అని సరదా పడిపోయింది.

పార్థసారథి, రామం ఓ అరగంట మాట్లాడుకున్నారు. ఆ తర్వాత సరళా శారదా మరో అరగంట కబుర్లు చెప్పుకున్నారు. మళ్ళీ క్రిష్ణ, రామం పావుగంట

మాట్లాడుకున్నారు. మధ్యలో బాలమ్మ ఓ అయిదు నిముషాలసేపు మాట్లాడి పాత చుట్టరికాలు తిరగేసింది.

ఫోను సంభాషణ ముగించేసరికి పది న్నర అయింది. 'ఇంకా ఇప్పుడు టిఫిన్ ఏం చేస్తాం నువ్వు హోటల్‌కి వెళ్ళి తీసు కురా' అని సూర్యహాని తరిమారు.

టిఫిన్లు తింటూ కూడా ఆ విషయాలే నెమరు వేసుకున్నారు.

తను ఎంపిక చేసుకున్న అమ్మాయి తండ్రి, తన తండ్రి బాల్యమిత్రుడు కావటం, అంతేకాకుండా తల్లి తన తల్లికి స్నేహితురాలు కావడం చాలా విచిత్రంగా అనిపించింది. ఆ తర్వాత ఆనందంగా అని పించింది. అంతలోనే ఒక సందేహం వచ్చింది.

"అన్నీ మాట్లాడారు సరే! అసలు విషయం మాట్లాడారా? " అని అడిగాడు.

"అసలు విషయమా? ఏ అసలు విషయం? " అడిగాడు క్రిష్ణ.

"నా పెళ్లి విషయం!" గుర్తు చేశాడు.

"ఓ అదా! వాడిమొహం. వాడు నా బాల్యస్నేహితుడు? వాడిని ఈ విషయం ప్రత్యేకంగా అడగాలా? వాడెక్కడికి పోతాడు? " అంటూ నవ్వేశాడు క్రిష్ణ.

"ఆయనెక్కడికీ పోడు. అంత పోయినా ప్రమాదం ఏమీలేదు. బాల్యమిత్రుడిని కలుసుకున్న ఆనందం కాస్తా అయోమ యంగా మారిపోయి కూతురికి మరో సంబంధం ఖాయం చేసేస్తాడేమో అని భయం" చెప్పాడు సూర్యహా.

"భయం ఎందుకురా? ఏదైనా తేడా వస్తే వాడి భరతం పట్టనూ! అయినా ఓమారు చెప్పేస్తానులే" అని ఫోన్‌తీసి నెంబరు కలిపాడు.

అటువైపునించి మిత్రుడు హల్లో అంటే ఈయన ఏంచేసేవాడో! ఆయనలా అన్లేదు.

"క్రిష్ణా నీకు తెలుసా.. శేషగిరి కూడా ఈ ఊళ్ళోనే వున్నాడు" అంటూ మళ్ళీ అటే మళ్ళించాడు సంభాషణని.

పైకెళ్ళి స్నానపానాలు ముగించుకుని తయారై కిందికొచ్చాడు సూర్యహా. అప్పటి దాకా నలభై నిముషాలు ఏకధాటిగా మాట్లాడేసి సంభాషణ ముగించిన తండ్రి వంక చూశాడు.

"నాన్నగారూ! నా విషయం ఏమీ చెప్ప లేదుకదా!" నిలదీశాడు.

"ఏముందిరా చెప్పడానికి? సాయంత్రం నేను వాళ్ళింటికి వెళ్తున్నా. అప్పుడన్ని విష యాలూ వివరంగా మాట్లాడేసి ఏకంగా ముహూర్తాలు పెట్టించేసుకోవడమే" అన్నాడు. అంతేకాదు కొడుకుని కావలించే సుకున్నాడు. "నా బంగారు తండ్రి. ఎటు వంటి సంబంధం ఎంచుకున్నావో చూడు" అన్నాడు ప్రేమగా మళ్ళీ కొడుకుని కావలిం చుకోబోతూ.

సూర్యహా వారించాడు. "పెళ్ళి సెటిల్ అవనివ్వండి. అప్పుడు ఏకంగా ఒకేసారి కావలించేసుకుందురుగాని" అన్నాడు.

"సరేలేరా నీకెందుకు? నువ్వు ఇంకా విషయం మర్చిపో" అన్నాడు తండ్రి.

"మీకెలాగూ గుర్తుండడంలేదు. ఇక నేనూ మర్చిపోతే అయినట్లే నా పెళ్ళి!" అనేసి వెళ్ళిపోయాడు సూర్యహా. ఆఫీసుకె ళ్ళగానే కంప్యూటర్ ఆన్ చేసేముందు ఎందుకైనా మంచిదని శిల్పకు ఫోన్ చేశాడు.

"ఆ ఏవిటీ పొద్దున్నే ఫోన్? " అంది శిల్ప.

"శిల్పా చూశావా ఈ విచిత్రం!" అన్నాడు.

"ఏ విచిత్రం? " అడిగింది శిల్ప.

"అయ్యో అదేవిటి? మన సంగతే! ఎంత తమాషాగా వుందో కదూ!" అన్నాడు సంభ్రమంగా.

"తమాషానా? ఇందులో తమాషా ఏం

వుంది? " అర్థంకాలేదు శిల్పకి.

"నీకింకా అసలు విషయం తెలియదన్న మాట!" అడిగాడు.

"విచిత్రం అంటావు కాసేపు, తమాషా అంటావు కాసేపు. అసలు విషయం తెలీదా అంటే ఏం చెప్పను, అసలు ఏ విషయం? " కాస్త చిరాకేసింది శిల్పకి.

"మీ నాన్నగారు చెప్పలేదా నీతో? " ఆశ్చర్యంగా అడిగాడు.

"ఏవిటి! నాన్నగారు ఏం చెప్పలేదు? " శిల్పకి ఒక్కముక్క కూడా అర్థం కావడం లేదు.

"పొద్దున మా నాన్నగారు మీ ఇంటికి ఫోన్ చేశారుకదా!" అడిగాడు.

"నేనివ్వాళ ఇంట్లోంచి త్వరగా వచ్చేశాను, కాస్త పనుండి. మరి మీ ఫోన్ సంగతి తెలీదు" అంది.

"అదీ సంగతి. అందుకే అలా వున్నావ్! అసలు విషయం విను" అంటూ తమ తల్లిదండ్రుల ఫ్లాష్‌బేక్ చెప్పేశాడు.

ఆశ్చర్యపోయింది శిల్ప. "నిజమా సూర్యహా? " అంది సంభ్రమాశ్చర్యాలతో.

"అవును" అన్నాడు.

"నాకెంత సంతోషంగా వుందో చెప్పలేను. ఈ మధ్య జరుగుతున్న పెళ్ళిళ్ళు చూస్తుంటే భయం వేస్తోంది. మరీ కొత్త వాళ్ళు అయితే వాళ్ళతో మనమ్మాయి కలిసిపోగలదా అని అమ్మ చాలా భయపడేది. తీరా చూస్తే ఎంత దగ్గరవాళ్ళతో సంబంధం కుదిరింది. అమ్మతో ఓ సారి మాట్లాడి మళ్ళీ ఫోన్ చేస్తానేం? " అంది.

అమ్మతో మాట్లాడితే ఆవిడ ఆనందం వర్ణనాతీతం. "శారద నాకు బాల్యస్నేహితురాలు. దాని మనసు చాలా మంచిది. నిన్ను దాని చేతుల్లో పెట్టేసి నిశ్చింతగా వుండగలను నేను. దానికి పుణుకులంటే ఇష్టం. మల్లెపూలంటే పడి చచ్చిపోతుంది. వంకాయకూర వుంటే ఇంకేం అక్కర్లేదు దానికి" అంటూ శారద పుట్టుపూర్వోత్తరాలన్నీ చెప్పింది సంబరపడిపోతూ. ఇంకా చాలా చెప్పేదే కానీ శిల్ప వారించింది.

"అమ్మా నాకు వేరే పనుంది. మళ్ళీ మాట్లాడతాలే. ఇక ఫోన్ పెట్టేయ్!" అంది.

మళ్ళీ కాస్త ఖాళీ దొరికాక సూర్యహాకి ఫోన్ చేసింది. "మా అమ్మ ఎంత సంతోషంగా వుందో చెప్పలేను" అంది.

"అవును మా ఇంట్లోనూ అదే పరిస్థితి. వాళ్ళ పాత స్నేహాలు తిరగేసుకోడం తప్ప మన గురించి పట్టించుకోటంలేదు. ఎందుకైనా మంచిది నువ్వో కన్నువేసి వుంచు. ఈ సరదాలో నీ పెళ్ళి వేరే వాళ్ళతో ఖాయం చేస్తారేమో అని భయంగా వుంది నాకు" అన్నాడు.

"నవ్వేసింది శిల్ప. నువ్వు భలే మాట్లాడతావ్" అంది.




ఆ సాయంత్రం ఇంటికొచ్చాడు సూర్యహా! ఎవరూ లేరు. డూప్లికేట్ తాళం చెవితో తాళం తీసుకుని లోపలికి వెళ్ళాడు. తల్లికి ఫోన్ చేస్తే "మీ కాబోయే మామగారూ, మేమూ కలిసి బయటికొచ్చాంరా! వచ్చేసరికి ఆలస్యం అవుతుందేమో.. నువ్వు తినేసెయ్" అంది.

రాత్రి బాగా పొద్దుపోయాక వచ్చారు. చాలా సంతోషంగా వున్నారు!



"ఏమిటి నాన్నా.. అంత సంతోషంగా వున్నారు? వాళ్లతో మాట్లాడారా? " అడిగాడు.

"మాట్లాట్టం ఏమిటిరా.. డేట్ కూడా నిర్ణయం అయిపోయింది. రేపు పదిహేడు? " అన్నాడు క్రిష్ణ.

"పదిహేడునా? అంటే వారం రోజులు కూడా లేదు. ఎలా? ఎలా చేస్తాం? " కంగారు వేసింది సూర్యహాకి.

"ఏం చెయ్యాలిరా? ప్రయత్నాలన్నీ రామం చేసేశాడు. పెట్టె సర్దుకు వెళ్ళిపోవటమేగా!" చెప్పాడు క్రిష్ణ.

"పెట్టె సర్దుకుని వెళ్ళాలా? ఎవరు? ఎక్కడికి? " సూర్యహాకి ఏమీ అర్థం కావడంలేదు.

"నైమిశారణ్యం, అయోధ్యా? " చెప్పాడు క్రిష్ణ.

"ఏమిటండీ మీరు చెప్పేది? నాకొక్క ముక్క అర్థమై చావటంలేదు" విసుక్కున్నాడు.

శారద అందుకుని చెప్పింది. పొద్దున రామం వాళ్ళూ వీళ్ళింటికొచ్చారుట. అంతా కలిసి ఇంకెవరో పాత ఫ్రెండుంటే వాళ్ళింటి కెళ్ళారుట. ఆయన పేరు సత్యంట. వీళ్ళని చూసి అనందంతో పిచ్చివాడై పోయాడుట. అక్కడినించే అందరూ కలిసి మూర్తి అనే ఇంకో ఫ్రెండ్ దగ్గరికి వెళ్ళారుట. ఆయన ఇంకా చాలా చాలా సంతోషించాడుట. ఆయన యాత్రలు నిర్వహిస్తాడుట. ట్రావెల్ ఏజన్సీ వుంది వాళ్ళకి. లక్నోకెళ్ళి అక్కడినించి నైమిశారణ్యం అయోధ్యా టూర్ ప్లాన్ చేశాడట. ఇంకా ఎనిమిదే సీట్లున్నాయిట. ఇలా మనం కలవడం చాలా ఆనందంగా

వుంది. మీరూ రండి టూర్‌కి అన్నాడట. అలాగే అని వెంటనే ఒప్పుకున్నారుట. వీళ్ళు ఆరుగురు, బాలమ్మ, పార్థసారథి. మొత్తం ఎనిమందికీ డబ్బు కట్టేశారుట!

"అంతా విని మరి పెళ్ళి విషయం ఏం చేశారు? " నిలదీసి అడిగాడు సూర్యహా!

"పెళ్ళా? ఎవరి పెళ్ళీ? " ముక్తకంఠంతో అడిగారు క్రిష్ణా శారద.

"ఆ రామంగారి అమ్మాయి శిల్పతో నా వివాహ విషయం మాట్లాడాలి కదా! గుర్తు లేదా? "

నాలిక కరుచుకున్నాడు క్రిష్ణ. "అరెరె. ఆ సంగతే మర్చిపోయాం. పోతేపో యాంలే.. ప్రయాణంలో ఈ విషయాలన్నీ మాట్లాడుకుని అన్నీ సెటిల్ చేసేస్తాం! పదిహేడున వెళ్ళి ఇరవైతొమ్మిదిన వస్తాం కదా! అప్పుడు వెంటనే ముహూర్తాలు పెట్టేసుకోడమే" అని హామీ ఇచ్చాడు.

ఆ వారం రోజులూ ప్రయాణం హడా విడి. ఊరెళ్ళిపోయారు. శిల్పారామం, సూర్యహా రోజూ ఫోన్‌లో మాట్లాడుకుంటు న్నారు. ఒకటి రెండుసార్లు ఐమాక్స్‌లోనూ, లైఫ్‌స్టైల్‌లోనూ కలుసుకుని కాఫీ తాగారు.

"శిల్పా మన పెద్దవాళ్ళ విషయం చూస్తుంటే నాకేదో అనుమానంగా వుంది. చాలా కాలం తర్వాత కలుసుకున్న ఆనం దంలో ఎంతసేపూ పాతస్నేహితులని వెతికి పట్టుకునే సంబరంలోనే వున్నారు గానీ అసలు వాళ్ళెందుకు కలుసుకున్నారు. ఆ కారణం మర్చిపోతున్నారు. ఈ సంతో షంలో ఇంకే సంబంధమో కుదిర్చినా ఆశ్చర్యం ఏమీలేదు. ఇటు మా నాన్న



## కొత్తగాలి...

**బాధలు సృష్టించేవాడు**
**కాదు**
**భర్త**
**భరించేవాడు**

– పెరుకరాజు,
నర్సింగాపూర్, కరీంనగర్ జిల్లా

విషయం నేను చూసుకుంటాను. అటు మీ నాన్నమీద ఓ కన్నేసి వుంచు" అని హెచ్చరించాడు సూర్యహా.

పెద్దవాళ్ళందరూ నైమిశారణ్యాం, అయోధ్యా వగైరాలన్నీ తిరిగి వచ్చారు. సూర్యహా స్టేషన్‌కి వెళ్ళాడు. సామాన్లన్నీ కూలీలచేత బయటికి చేరవేశాక "నాన్నగారూ సీతారామంగారు ఏరి? నాకు పరిచయం చెయ్యండి!" అని అడిగాడు.

"ఒరే రామం!" అని పిలిచాడు క్రిష్ణ.

"ఇదుగోరా మా అబ్బాయి.. చిట్టిగాడు" అని పరిచయం చేశాడు.

"అలాగా చక్కగా ఉన్నాడు. ఏం చేస్తున్నావు నాయనా? పెళ్ళయిందా?" ఆదరంగా అడిగాడు. సూర్యహాకి ఏడుపొచ్చింది! "ఏమిటి నాన్నగారూ ఈ అన్యాయం?" అన్నాడు.

"పవిత్రా రామం నీ అయోమయం.. నువ్వూనూ! వీడికేగా మీ అమ్మాయి నిచ్చి చేద్దామనుకుంటోంది?" గుర్తు చేశాడు.

నాలిక కరుచుకున్నాడు రామం? "అవును కదూ! ఏమీ అనుకోకు నాయనా! ఏదో పొరబడ్డాను. ఈ రైలు ప్రయాణం వల్ల ఇంకా అయోమయంగానే ఉంది" క్షమాపణ చెప్పుకున్నాడు.

"పోన్లెండి! దానికేముందిగానీ ఇక మీరిద్దరూ పూనుకొని మా పెళ్ళి విషయం మీద కాస్త శ్రద్ధ పెడితే బావుంటుంది!" అన్నాడు.

"అయ్యో అంతకంటేనా నాయనా! అప్పుడే చేసేసే వాళ్ళం. సరిగ్గా అదే సమయానికి మా మూర్తి ఈ యాత్రలు ఏర్పాటుచేసి వస్తావా.. చస్తావా అని పీకల మీద కూర్చుని తీసుకుపోబట్టి అటు వెళ్ళాల్సి వచ్చింది. ఇదిగో వచ్చేశాంగా? ఇక నీ పెళ్ళి ప్రయత్నంలోనే ఉంటాం" అన్నాడు రామం.

అన్నాడే గానీ పట్టించుకుంటేనా? యాత్రలకి వెళ్ళొచ్చాం కదా! నలుగుర్నీ పిలుచుకుని చిన్న సైజు సమారాధన చేసుకుందాం అనుకుని ఆ ఫంక్షన్ హడావుడిలో పడిపోయారు.

ఆ తరువాత వీళ్ళ కాలేజీలో పూర్వ విద్యార్థుల సమావేశం జరిగింది. ఆ హడావుడిలో కొంతకాలం గడిచిపోయింది.

ఏం చేద్దాం మన చేతుల్లో ఏముందని తమ దోవన సినిమాలకీ, షికార్లకీ తిరగసాగారు సూర్యహా, శిల్పా!

ఓ రోజు నెక్లెస్ రోడ్‌లో ఓ బెంచీమీద కూర్చున్నారు. అంత సన్నిహితంగా ఏం కూర్చోలేదు. కాస్త దూరదూరంగానే కూర్చున్నారు. పోలీసు వ్యాన్ అటు ఇటూ తిరుగుతోంది. వీళ్ళకి కాస్త దూరంలో ఆగింది. వీళ్ళను చూశారు.

న్యాయంగా చూస్తే అంత అసభ్యకరంగా ఏం లేదాదృశ్యం. 'సర్లే ఇలా వదిలేస్తే మరీ విజృంభిస్తారు. కాస్త మందలిద్దాం!' అనుకుని ఆ వ్యాన్‌లోని ఇన్‌స్పెక్టర్, ఒక కానిస్టేబుల్‌ని పిల్చి 'అటువెళ్ళి ఆ కుర్రాడిని పిల్చుకురా! మందలించి పంపుదాం!' అని చెప్పి పంపించాడు.

అతను వెళ్ళి వాళ్ళు కూర్చున్న బెంచీమీద లాఠీతో శబ్దం చేశాడు. సూర్యహా ఉలిక్కిపడి వెనక్కి తిరిగాడు. "ఏమిటి? ఏం కావాలి?" అని అడిగాడు.

"మా సార్ మిమ్మల్ని పిలుస్తున్నారు!" చెప్పాడా కానిస్టేబుల్!

"ఎందుకు మేమేం చేశాం?" మళ్ళీ అడి

# బీద బాలుడిలోనే దైవ దర్శనం




భూదానోద్యమం చేపట్టి దేశవ్యాప్తంగా కాలినడకన తిరిగిన వినోబా భావె తల్లి రుక్మిణీ దేవి గొప్ప మాతృమూర్తి. ఆమె ఓ బీద బాలుడికి ఇంట్లో ఆశ్రయమిచ్చింది. తిండికి, బట్టకు, చదువుసంధ్యలకు సహాయపడుతోంది. ఆమె తన పుత్రుడు వినోబాకు చల్లని పదార్థాలను తిండి, భోజనాలుగా ఎల్లప్పుడూ పెట్టేది. కానీ తను



పెంచుకున్న పరాయి పిల్లవాడికేమో వేడివేడిగా వడ్డించేది.

ఒకరోజు ఆ పక్షపాత ధోరణికి తల్లిని కారణ మడిగాడు వినోబా. దానికి, 'విను, నేను అందరు పిల్లలను ఒకే విధంగా చూడలేకపోతు న్నాను. నీ విషయమే తీసుకుంటే నువ్వు నా కొడుకనే భావన నా మదినిండా చేరి నా ప్రవ ర్తనను నిర్ణయిస్తుంది. అదే ఆ బీద పిల్లవాడిని చూడగానే దైవాన్ని చూస్తున్న భావన కలుగు తుంది. అందుకే ఈ తారతమ్యం! నిన్ను దైవంతో సమానంగా ఎప్పుడు చూడగలుగు తానో అప్పటినుండి ఈ పక్షపాత భావన నశించి పోగలదు' అందామె.

గాడు.

"అదంతా మాకు తెలీదు సార్! తీసుకు రమ్మన్నారు. మీరొచ్చి నేరుగా వారితోనే మాట్లాడండి!" అన్నాడు హుకుం చలా యిస్తూ.

"వస్తాను, నాకేమైనా భయమా? " అని లేచి నిలబడ్డాడు.

"నేనూ రానా? " అంది శిల్ప.

"వద్దు నువ్విక్కడే ఉండు" అని చెప్పి,

"పదండి" అని విసురుగా ఆ ఇన్‌స్పెక్టర్ దగ్గరికి వచ్చాడు.

అప్పటిదాకా ఠీవిగా నిలబడిన ఇన్‌స్పె క్టర్ ఇతణ్ణి చూసి కాస్త తడబడ్డాడు.

"ఏవిటండీ? ఇదేమైనా మర్యాదగా ఉందా? " కోపంగా అడిగాడు సూర్యహా.

"లేదు. మర్యాద కానేకాదు. కానీ ఏం చెయ్యం? మా చేతుల్లో ఏమీలేదు కదా!" అన్నాడు దీనంగా.

"ఏమిటి మీ చేతుల్లో లేనిది? మీరు పిలిస్తేకదా నేనొచ్చాను" మళ్లీ నిలదీశాడు.

"పిల్చాం. మీరు మాకెంతో నచ్చారు. మిమ్మల్ని వదులుకోవాలనుకోలేదు. కానీ ఏం చేస్తాం.. అంతా మా ఖర్మ. పిల్ల కాస్తా పారిపోయింది" అన్నాడు తప్పుచే సిన వాడిలా తలవంచుకుని.

"పిల్ల పారిపోవడం ఏమిటి? ఏ పిల్ల? " అడిగాడు సూర్యహా తెల్లబోతూ.

"ఇంకే పిల్ల? మీరు పెళ్లిచూపులు చూసిన పిల్లే. మా మేనకోడలు" అన్నాడు ఇన్‌స్పెక్టర్. అప్పుడు గుర్తొచ్చింది సూర్య హాకి, తమని పోలీసువేనులో పెళ్లిచూపు లకి తీసికెళ్లిన పోలీసు మామయ్య ఇతనే నని. నవ్వొచ్చినా దాచుకొని గాంభీర్యం నటించాడు.

"మరి పారిపోయే పిల్లని మాకెందుకు చూపించారు. అనవసరంగా మమ్మెల్నెం దుకు హైరానా పెట్టారు? " కచ్చితంగా అడిగాడు.

"ఇలా జరుగుతుందనుకోలేదు. ప్రేమించాను. పెళ్లి చేసుకుంటానంది. వీల్లేదు.. మేము చూసిన సంబంధమే చేసుకోవాలన్నాం. సరేనంది. మీరు వచ్చినప్పుడు సరదాగా పాటలూ అవీ పాడితే సంతోషించాం. ఏవిటే అంటే.. మీ ఇష్టం అంది. తెల్లవారి మీ దగ్గరికి వద్దామనుకున్నాం. ఆ రాత్రే పారిపోయింది. అందుకే మీ ఇంటికి రాలేదు. ఫోన్ చేద్దామన్నా మొహం చెల్లలేదు. మీరు నన్ను మన్నించాలి" అన్నాడు బతిమాలుతూ.

"సర్లేండి. మీ ఇంట్లో ఇంకెవరైనా ఇలా ప్రేమిస్తే పెళ్లి చూపులు అవీ అంటూ ఇతరులని ఇబ్బంది పెట్టకండి!" అని మందలించాడు సూర్యహా.

"ఆ అమ్మాయి ఎవరూ.. మీ భార్యా? " అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"అవును" చెప్పాడు సూర్యహా.

"చాలా సంతోషం. విష్ యూ హేపీ మేరీడ్ లైఫ్" విష్ చేసి వెళ్లిపోయాడు.

తిరిగి వచ్చి శిల్పతో ఈ విషయం అంతా చెప్పాడు. పగలబడి నవ్వింది శిల్ప. ఆవేళ ఇంటికి రాగానే తండ్రి దగ్గర కూర్చున్నాడు సూర్యహా.

"నాన్నా మీతో ఓ ముఖ్యమైన విషయం మాట్లాడాలి" అన్నాడు.

"చెప్పరా! ఏవిటది? " ఆదరంగా అడిగాడు క్రిష్ణ.

"నాన్నగారూ.. నీకు సంబంధం చూడ్డం నా వల్ల కావడంలేదు. నువ్వే ప్రేమించు అన్నారు. ప్రేమించాను. ఆ విషయం మీకు చెప్పాను. నా అదృష్టమో దురదృష్టమో నాకు కాబోయే మామగారు మీ బాల్య స్నేహితుడే అయ్యారు. ఇక ఆ తర్వాత మీరు మీ గొడవల్లో పడి నా పెళ్లి విషయం పక్కన పడేశారు.

ఎన్నోసార్లు ఎన్నోవిధాలా చెప్పి చూశాను. అయినా చీమ కుట్టినట్లు అయినా లేదు మీకు. ఇవ్వాళ నేనూ శిల్ప పార్కులో కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ ఉంటే పోలీసులు పట్టుకున్నారు. ఈ తలనొప్పులు భరించడం నావల్ల కాదు.

మీరు మంచి మనసుతో మాకు పెళ్లి చేశారా సరేసరి. లేకపోతే నేనూ శిల్పా వచ్చే నెల్లో జరిగే కళ్యాణమస్తు కార్యక్రమంలో పేర్లు నమోదు చేసుకుంటాం. లేదా రిజిస్టర్ మ్యారేజి చేసుకుంటాం! మళ్లీ మాతో మాటమాత్రం చెప్పలేదని నిష్ఠూరాలు ఆడతారని ముందే చెప్తున్నాను. ఇక మీ ఇష్టం" అన్నాడు.

క్రిష్ణ నాలిక కరుచుకున్నాడు. "అవున్రా పాపం. నాదే తప్పు. ఇక ఆలస్యం చెయ్యనులే. వెంటనే ముహూర్తాలు పెట్టించేస్తాం' ' అన్నాడు.

అన్నట్లుగానే వెంటనే ముహూర్తం పెట్టించారు. నెలా పదిహేనురోజుల తరువాత పెళ్లి.

"మరీ దూరం అయిపోయింది ముహూర్తం" అన్నాడు సూర్యహా.

"కాదులే పెళ్లి ఘనంగా చేసుకోవాలంటే ఆ మాత్రం వ్యవధి ఉండాలి" అంది శిల్ప.

శుభలేఖల దగ్గర కాస్త పేచీ వచ్చింది. పెళ్లి శుభలేఖల్లో పూర్తి పేరు రాయాల్సిందే. లేకపోతే ఆయా దేవుళ్లు కోపగిస్తారని పట్టుబట్టింది బాలమ్మ.

నాగ సత్య సూర్య హనుమత్ శంకర సాయి వేణుగోపాల దుర్గా శ్రీనివాస్ వెడ్స్ శిల్ప అని అచ్చేయమంటే శుభలేఖల కొట్టువాళ్లు తలపట్టుకున్నారు. ఫాంట్ కుదరటం కష్టం అన్నారు. ఇన్ని సంవత్సరాలుగా ఈ వ్యాపారం చేస్తున్నాం గానీ ఇటువంటి క్లిష్ట సమస్య ఎప్పుడూ ఎదురవలేదు అన్నారు. ఏదో విధంగా చూస్తాంలేండని అన్నారు.

సూర్యహా తన ఫ్రెండ్స్‌కోసం మాత్రం నాగసత్య సూర్యహా పసివేదల అనే పేరు




తోనే వేయించుకున్నాడు శుభలేఖలో.

శిల్పా తన ఫ్రెండ్స్‌కోసం భర్త పొట్టి పేరు తనే వేయించుకుంది.

ఇరువైపుల వాళ్లూ జోరుగా షాపింగులు చేసేశారు. అంతా సాఫీగానే సాగింది, ఒకటి రెండుచోట్ల తప్పించి.

పురోహితుడు వధూవరుల పేర్లు చూసి, "అమ్మా ఈ పేరు పూర్తిగా కన్యావర్గాల దగ్గర చదవాలంటే మరో రెండువేలు అదనంగా ఇప్పించాలి" అన్నాడు.

పూల డెకరేషన్ వాళ్లూ అంతే.

కళ్యాణ మండపం ఎంట్రన్స్ ఎదురుగా కట్టే పూల ఆర్చీ దగ్గర కాస్త పేచీ పెట్టారు.

కళ్యాణ మండపం పూలదండలూ, పూల జడా, మామూలుగా 'సూర్యహా వెడ్స్ శిల్పా' అని ఆర్చీ అయితే ముప్పై వేలు. పూర్తిపేరు రాయాలంటే యాభైవేలు కావాలన్నారు.

సర్లే, సూర్యహా అని రాస్తే చాలు అన్నారు.

అంగరంగ వైభవంగా సూర్యహా, శిల్పల వివాహం జరిగిపోయింది. వాళ్ల జంట సరే.. ఎలాగూ చూడముచ్చటగానే ఉన్నారు. వాళ్లకే మాత్రం తీసిపోకుండా వియ్యంకులు, వియ్యపురాళ్లు జంటకవుల్లా తిరుగుతూ కనుల పండుగ చేశారు ఆహూతులకు.

★ ★ ★

పెళ్లై ఏడురోజులు అయింది. క్రిష్ణావాళ్ల మేడమీద వెన్నెల్లో పరుపుమీద పడుకుని ఉన్నాడు సూర్యహా. అతని గుండెమీద గువ్వలా ఒదిగిపోయి కబుర్లు చెప్తోంది శిల్ప.

# మోసగాడిలోనూ మార్పు

వినోబా సంస్కృతం నేర్చుకునేందుకు వారణాసి వెళ్లాడు. ప్రతిదినమూ గంగానదికి వెళ్ళివచ్చేవాడు. ఆ త్రోవలో ఒక తాళాల అంగడి ఉండేది. వినోబా గదికి ఒక తాళం అవసరం అయింది. తనకు ఎలాంటిది కావాలో చూపించి అలాంటి తాళం ఇమ్మన్నాడు. దాని ఖరీదు మూడు అణాలు అని తెలుసు. కానీ అంగడివాడు అతన్నుంచి ఎక్కువ సొమ్ము గుంజేందుకు దాని ఖరీదు పది అణాలన్నాడు. వినోబా వెనుకాముందు చూడక పది అణాలు చెల్లించి తాళం తీసుకొని 'దీని ఖరీదు మూడు అణాలకు మించదని తెలుసు. అయినా కొన్నాళ్ళుగా ఈ వ్యాపారంలో ఉండటంవల్ల మిమ్మల్ని నమ్మి చెప్పిన ధర చెల్లించాను' అని చెప్పి నదికి వెళ్ళాడు.

వినోబా మాటలు ఆ వ్యాపారి గుండెల్లో శూలాల్లా గుచ్చుకొన్నాయి. కొన్నేళ్ళుగా ఈ వ్యాపారంలో తను ఉన్నందున తన మాట నమ్మినట్లు అతను చెప్పాడు. అంటే తను నమ్మకద్రోహం చేసినట్టే. తన తప్పు ఎరిగిన వ్యాపారి మరునాడు వినోబా గంగానదికి వెళ్లి వస్తుండగా అతనిని పిలిచి తన మోసం అంగీకరించి ఎక్కువ తీసుకొన్న ఏడు అణాలను తిరిగి ఇచ్చి క్షమించమని కోరాడు. ఏ కాస్త అయినా మంచి మనస్సు ఉన్న మనుషులు తప్పక స్పందిస్తారని, కాకపోతే వారిలోని మంచితనాన్ని మేల్కొలిపి, వారిని మార్పుకు గురిచేసేటటువంటి ఉన్నత వ్యక్తిత్వం మనకు ఉండాలని దీనిద్వారా తెలుస్తుంది.



ఇంటి మొత్తంమీద వాళ్లిద్దరే ఉన్నారు.

క్రిష్ణా శారదా శ్రీలంక వెళ్లారు. వియ్యాలవారిని వెంటబెట్టుకుని పెళ్లికి పదిరోజుల ముందు క్రిష్ణా కొడుకుని పిల్చి "శ్రీలంక హాలిడే ప్యాకేజ్ చాలా చవగ్గా వస్తుందిరా రెండు టికెట్లు బుక్ చేద్దాం అనుకుంటున్నాను" అన్నాడు.

తండ్రి తమ హనీమూన్ ట్రిప్ స్పాన్సర్ చేస్తున్నాడేమో అని తెగ సిగ్గుపడిపోయాడు సూర్యహా. "ఎందుకు నాన్నగారు ఇవన్నీ" అన్నాడు మెలికలు తిరుగుతూ.

"ఈ ట్రిప్ మూర్తి వేస్తున్నాడురా! ఇన్నాళ్లూ నీ పెళ్లి గొడవలో పడి మేము ఎక్కడికీ వెళ్లడం కుదర్లేదు. వెళ్దొద్దాం అనుకుంటున్నాం. రామం, సరళా కూడా వస్తారుట. మాకు బాధ్యతలు తీరిపోతున్నాయి కదామరి!" అన్నాడు క్రిష్ణ.

నవ్వాలో ఏడవాలో తెలియలేదు సూర్యహాకి.

పెళ్లయ్యాక వాళ్లు అటు వెళ్లారు. బాలమ్మ కూడా ఎవరో పాత బంధువులను చూసొస్తానని వెళ్లింది.

ఇంటి మొత్తంమీద ఈ దంపతులిద్దరే. వాళ్లదే రాజ్యం.

"శిల్పారామం!" తల నిమురుతూ పిలిచాడు.

"మతిగానీ పోయిందా? ఇంకా శిల్పారామం ఏమిటీ? శిల్పా సూర్యహాని అయిపోయాను కదా!" గుర్తు చేసింది.

"అవును కదూ! ఏమిటో పెళ్లయ్యాక ఈ తన్మయత్వంలో పడి అన్నీ మర్చిపోతున్నాను" అన్నాడు మత్తుగా.

శిల్ప ఏమీ మాట్లాడలేదు. అతని క్రాఫ్ చెరుపుతూ ఉండిపోయింది.

"మన పెద్దవాళ్లు అనవసరంగా ఆలస్యం చేశారు. వాళ్లు కాస్త చురుగ్గా ఉంటే మన పెళ్లి ఇంకో రెండు నెలలముందే అయి పోయి ఉండేది!" అన్నాడు కాస్త బాధగా.

"ఇప్పుడు మాత్రం ఏమైంది?" అడిగింది.

"ఈ ఆనందాన్ని మరింత ముందే అనుభవించేవాళ్లం కదా!"

"ఏం కాదు. అలా గబగబా పెళ్లయి పోయి ఉంటే ప్రేమించి పెళ్లి చేసుకున్న వాళ్లని చూసి అయ్యో మాకీ అనుభవం లేదు కదా అని బాధపడే వాళ్లం. ఇప్పుడు మనకు ప్రేమికుల అనుభవం కూడా ఉంది. పార్కుల్లో కబుర్లు చెప్పుకున్నాం. సినిమాలు చూశాం" చెప్పింది శిల్ప.

"అదికాదు శిల్పా సూర్యహా!"

"ఏది కాదు సూర్యహా పసివేదలా? జీవితంలో మరీ అతిగా ఆశపడకూడదు. మనం చాలా అదృష్టవంతులం. మన కుటుంబాల మధ్య మంచి స్నేహం ఉంది. మనిద్దరి మధ్య ఎంతో ప్రేమ ఉంది. అనుకోకుండా కుదిరిన సంబంధం మనది. మనిద్దరం ఒకేరోజు పూజ చేయించాలని గుళ్లోకి రావడం.. మన పరిచయం తలుచుకుంటే ఎంతో ఆశ్చర్యం అనిపిస్తుంది నాకు. మనది దేవుడు కుదర్చిన పెళ్లి. ఆ భగవంతుడి దయవల్ల మనం కలకాలం సుఖంగా ఉంటాం" అంది పరవశంగా.

"నిజమే శిల్పా. ఈ రోజుల్లో భార్యాభర్తల సంబంధాలు చాలా పెళుసుగా ఉంటున్నాయి. ఏమిటో ప్రేమించుకున్నామంటారు.. ఏడాది తిరిగేసరికల్లా విడిపోతున్నాం.. విడాకులు తీసుకుంటున్నాం.. అంటారు. పాపం మా రాజా విషయంలో అంతే అయింది. పాపం వాడిదేం తప్పు లేదు. ఆ అమ్మాయి తమిళ హీరో మాధవన్‌కి వీరాభిమానిట. లేస్తే మాధవన్.. కూర్చుంటే మాధవన్. మా రాజావాళ్ల అమ్మ హాల్లో వెంటకటేశ్వరస్వామి ఫొటో తగిలిస్తే అది తీసేసి మాధవన్ ఫొటో తగిలించిందట. బెడ్‌రూంలో వాడెంతో మనసుపడి లామినేట్ చేయించిన వాళ్ల పెళ్లి ఫొటో పెట్టుకుంటే అదీ తీసేసి మాధవన్ ఫొటో పెట్టిందట. దాంతో గొడవలయ్యాయి. విడాకులదాకా వెళ్లారు.

ఇక మా వీర్రాజు విషయానికి వస్తే వాడు నార్త్ ఇండియా అమ్మాయిని పెళ్లి చేసుకున్నాడు ప్రేమించి. వాళ్లిద్దరికీ తిండి దగ్గర గొడవలొచ్చాయి. ఆవిడ చపాతీలు మాత్రమే తింటుందట. సర్లే నిన్ను నేనేం మార్చను. నేను మాత్రం అన్నమే తింటాను- అన్నాడుట వీడు. కాట్.. వీల్లేదు.. అందిట ఆవిడ. నువ్వు అన్నం తింటే నేను ఆత్మహత్య చేసుకుంటాను .. అందిట. నువ్వు ఆత్మహత్య చేసుకోడం ఎందుకు? నేనే హత్య చేసేస్తాను అన్నాడుట వీడు."

దాంతో శిల్పకి విసుగేసింది. "సూర్యహా! మన పెళ్లై పట్టుమని పదిరోజులు కూడా కాలేదు కదా! ఇప్పుడా విడాకుల చరిత్రలన్నీ ఎందుకు మనకు? ఏమైనా మంచి విషయాలు, మన భవిష్యత్తు గురించిన విషయాలు మాట్లాడుకుంటే బావుంటుందేమో?" అంది.

నాలిక కరుచుకున్నాడు. "నిజమే. అసలే ఏ మాటలూ మాట్లాడుకోకుండా ఉంటే మరీ బావుంటుంది" అంటూ భార్యని మరింత దగ్గరికి తీసుకున్నాడు. ©

## కొత్తగాలి...

నీ ముందు నీతులు
నీ వెనుక గోతులు
వాడే మనిషి!

–ఎన్. శివనాగేశ్వరరావు,
తెనాలి

## కాలాతీతం


ఎలిజబెత్ గాస్కెల్

# మేరీ బార్టన్

**( 1848 )**




ఇంగ్లండులో పారిశ్రామిక విప్లవానికి నాంది పలికింది మాంచెస్టర్. పుట్టగొడుగుల్లా పుట్టుకొచ్చిన జవుళి మిల్లులతో కొద్ది కాలంలోనే నగర రూపురేఖలు మారిపోయాయి. 1800లో డెబ్బై ఐదువేలు వున్న జనాభా 1848కి నాలుగు లక్షలు దాటింది. సంపదతోపాటే దారిద్ర్యమూ పెరిగింది. కార్మికులకోసం రోజుకో మురికివాడ వెలసింది. ఏంగెల్స్, ఫాషర్‌లాంటి ఆలోచనాపరులు కార్మికుల జీవన స్థితిగతులపై ప్రత్యేకంగా పుస్తకాలే రాశారు. 1844లోనే 'కండిషన్స్ ఆఫ్ వర్కింగ్ క్లాస్ ఇన్ ఇంగ్లండ్' పుస్తకాన్ని ఏంగెల్స్ రాశారు. యూనిటేరియన్ ఆదర్శాలతో పేదలను సోదరులుగా భావించిన రచయిత్రి ఎలిజబెత్‌కు మాంచెస్టర్ జీవితమే ప్రేరణ. అందువల్ల ఆమె, 'నాకు రాజకీయాలతో పరిచయం లేదు. ఎకనమిక్స్ తెలియదు' అని చెప్పినప్పటికీ పుస్తక జ్ఞానాన్ని మించిన స్వానుభవమే కథా వస్తువుగా మారింది. తొలి నవల 'మేరీ బార్టన్'కు ఉప శీర్షిక- 'ఏ టేల్ ఆఫ్ మాంచెస్టర్'.

### నవలా నేపథ్యం..

1837-42 మధ్య పరిశ్రమల పుణ్యాన ట్రేడ్ యూనియన్‌లు కూడా పెరిగాయి. పారిశ్రామిక ప్రభువులు, కార్మికుల మధ్య వైషమ్యాలతో సామాజిక వాతావరణం కలుషితమైంది. 1834లో ప్రముఖ సోషలిస్టు, ఓ మిల్లు యజమాని రాబర్ట్ ఓవెన్ నాయకత్వంలో 'గ్రాండ్ నేషనల్ కన్సాలిడేటెడ్ ట్రేడ్ యూనియన్' ఏర్పడింది. ఇప్పటిలాగే 1837లో తలెత్తిన ఆర్థిక సంక్షోభం ఫలితంగా కార్మికుల వేతనాల్లో కోత విధించారు యజమానులు. 'ఈ కూలీతో ఎవరైనా బతకగలరా?' అని ప్రశ్నించారు కార్లైల్ లాంటి మేధావులు. సమ్మెలు చేయటం తప్ప కార్మికుల చేతిలో మరో ఆయుధం లేదు. ఒక సమ్మె విచ్ఛిన్నకుడు

జొనాస్ హిగిన్ బాతాం మొహం మీద యాసిడ్ పోయటం ఆనాటి సంచలన వార్త. 1838లో పీపుల్స్ చార్టర్ 'అందరికీ ఓటు హక్కు', 'రహస్య బ్యాలెట్'వంటి ఆరు మౌలిక హక్కులను డిమాండ్ చేసింది. ఈ ఉద్యమాన్నే చార్టిజం అన్నారు. ఇంగ్లండు చరిత్రలో ఇది 'హంగ్రీ ఫార్టీస్'. అప్పటికే యూరోపులో కార్మికుల తిరుగుబాట్లు రాజకీయ రంగు పులుము కుని విప్లవాలుగా మారుతున్నాయి. ఇంగ్లండులో కూడా 'మౌలికమార్పు' రాక తప్పదన్నారు.

ఎలిజిబెత్‌కు విప్లవ భావాలు లేవు. తన నవలలతో ఎవరినైనా మార్చాలనీ, మార్చగలననీ అనుకోలేదు. సాహిత్య ప్రయోజనం పాఠకుల కళ్ళు తెరిపించటమే. జీవి తానికి అద్దం పట్టిన ఆమె నవల 'మేరీబార్టన్' కార్మి కుల దుర్భర పరిస్థితులను తొలిసారిగా ప్రపంచానికి తెలియజేసింది.




★ ★ ★

మూడేళ్ళు వరుసగా వాణిజ్యం స్తంభిం చింది. బజారులో నిత్యావసర వస్తువుల ధరలు ఆకాశన్నంటాయి. కార్మికులు తమ సంపాదనతో కొనగలిగిన తిండి దినుసు లేవీ మార్కెట్లో లేవు. ఈ నిర్భాగ్యులను రోజూ పలకరించే నేస్తాలు రెండే- ఒకటి అంటురోగాలు, మరొకటి మృత్యువు. ఒకరి ద్దరుకాదు, వాడవాడలా చిన్నాపెద్దా తేడా లేకుండా కుటుంబాలన్నీ రోజుల తరబడి పస్తులున్నాయి. ఇటాలియన్ మహాకవి డాంటే తన కావ్యం 'డివైన్ కామెడీ'లో నరకాన్ని వర్ణించిన తీరు మాత్రమే వీళ్ళ కష్టాలకు అద్దంపడుతుంది. కానీ ఈ బాధల్ని పదాల్లో పట్టుకోవడం ఆయన క్కూడా సాధ్యం కాదేమో!

1839-41లో మనుషులు సృష్టించిన ఈ కృత్రిమ క్షామంలో ఎన్ని లక్షల జీవితాలు ఉసూరుమన్నాయో ఎవరు అంచనా వేయ గలరు? ఆదుకోవాలని వచ్చిన సజ్జనులు, ధర్మదాతలు కూడా ఇది తమ శక్తికి మించినదని గ్రహించారు. అసలు ఎందు కలా జరిగిందో, ఎవరు దీనికి కారణమో ఆర్థిక, సామాజిక శాస్త్రజ్ఞులు విశ్లేషించలేక పోయారు. ఇంతటి సంక్లిష్ట స్థితి నగర చరిత్రలో మునుపెన్నడూ లేదు. కాని కార్మికులు మలమలమాడుతున్నా, ఫ్యాక్టరీ యజమానులు మాత్రం తమకేమీ పట్టన ట్టుగా విందు వినోదాలతో విలాస జీవితం కొనసాగించారు. సహజం గానే కార్మికుల కళ్ళు నిప్పులు చెరిగాయి. సౌభ్రాతృత్వ భావన, సహా నుభూతి కరువైంది. సమ ష్టిగా సంపద సృష్టించా ల్సిన ఇరుపక్షాలు కత్తులు దూసుకున్నాయి. కేవలం యజమానులే కాదు, చట్ట సభల్లోని ప్రతినిధులు, రాజకీయ నాయ కులు కూడా ఈ సమస్యకు కారణమన్నారు కార్మికులు. సమాజంలో వైషమ్య జ్వాలలు రగుల్కొంటే ప్రజలందరూ శలభాల్లా కాలి పోరా? ఇదెక్కడి న్యాయం? 'నేను ఈ మాంచెస్టర్‌ను వర్ణించలేను. నా కలాని కంత పదును లేదు. కాని క్రైస్తవ ఆదర్శా లకనుగుణంగా ఇరుపక్షాలూ సంపదను న్యాయంగా అనుభవించాలని మాత్రమే కోరుతున్నాను. బాధితులు మొదట దుఃఖి స్తారు. తర్వాత కోపం పెరుగుతుంది. వాళ్లలో ప్రతీకారేచ్ఛ రగులుతుంది' అం టారు రచయిత్రి.

చార్టిస్టులు ఆరోపిస్తున్నట్టుగా ప్రభుత్వం నిజంగానే తన బాధ్యతను విస్మరిం

చిందా? శాసన సభలకు, పార్లమెంటుకు ఎన్నికైన 'ప్రజాసేవకులు' కళ్లు మూసుకున్నారా? అణగారిన జనం ఆక్రందనలు వాళ్లకు వినిపించటం లేదా? బాలనేరస్తులను జైళ్లలో పెట్టాలని శాసనాలు చేశారు. కాని వాళ్లు ఆకలికి తాళలేకనే నేరాలు చేస్తున్నారని గ్రహించలేరా? సాటి మనిషి బాధను ఉపశమింపచేయటానికి కావలసింది చట్టం కాదు, ప్రేమించే హృదయం.

ఈ పరిస్థితిలో మార్పుతేవటానికి 1839 లో వేలాదిమంది ఊరేగింపుగా వెళ్లి పార్లమెంటుకు అర్జీ సమర్పించుకున్నారు. ఇది ఇంగ్లండు చరిత్రలోనే అపూర్వం. ఆ వేలాది ఉద్యమకారుల్లో ఒకడు జాన్ బార్టన్. అతడు ఉద్యోగం కోల్పోయిన జవుళి మిల్లు కార్మికుడు. 'రోజంతా రెక్కలు ముక్కలు చేసుకున్నా ఇల్లు గడవటం లేదు. ధనికులు-పేదల మధ్య ఇంత అంతరమెందుకు?' అని రోజూ ఎడతెగక ఆలోచిస్తాడు. 'వాళ్లకింత డబ్బెలా వచ్చింది? చెమటోడ్చకుండానే కొందరు లక్షలు, కోట్లు సంపాదించగలరా? సుఖభోగాలు వారసత్వ హక్కులా? కార్మికులందరూ ఎందుకు అర్ధాకలితో బతుకుతున్నారు? చార్టిస్టు ఉద్యమం సమస్యలకు పరిష్కారం చూపగలదా?' అని ప్రశ్నిస్తాడు. అతడి కూతురే మేరీ. చాలా అందగత్తె. పేద యువతులందరిలాగే ధనవంతులను పెళ్లిచేసుకుంటే సమస్యలు పరిష్కరించుకోవచ్చునని కలగంటుంది. అందుకోసం ఏం చేసిన ఫరవాలేదు. అన్నిరకాల దుర్వ్యసనాలకు ఆలవాలమై, పేదపురుగుల్లాంటి బీదలతో లుకలుకలాడుతున్న మాంచెస్టర్‌లో తన అందానికి మంచి ధర పలుకుతుందనుకుంటుంది.

కుటుంబ పోషణలో తండ్రికి సాయం చెయ్యాలని ఒక దుస్తుల తయారీ సంస్థలో డ్రెస్‌మేకర్‌గా చేరుతుంది. మొదట తండ్రి లాగే ఫ్యాక్టరీలో పనిచేస్తానంటే ఆయన అందుకు సుతరామూ అంగీకరించడు. తను ప్రాణాలతో ఉండగా కూతురు ఫ్యాక్టరీలో ప్రవేశించగూడదని ఆంక్ష విధిస్తాడు. దీనికో కారణం ఉంది.

కొన్నాళ్ల క్రితం అతని మరదలు కూడా ఫ్యాక్టరీలో పనిచేసింది. తరువాత ఆకర్షణీయమైన డ్రెస్సుల కోసం, అలంకరణ కోసం డబ్బులు తగలేసింది. ఆ తర్వాత ఇంటికి ఆలస్యంగా రావటం ప్రారంభించింది. చివరికి ఒకనాడు ఎవరికీ చెప్పకుండా వెళ్లిపోయింది. "నేను ఆమెకు నచ్చజెప్పాలని చూశాను. మంచి భార్యలందరూ గాఢనిద్రలో ఉన్నప్పుడు వాళ్ల భర్తల్ని వెంట తిప్పుకుంటున్నావు, ఎస్తర్. ఇది పాపం- అని వారించాను. నా మాటవినలేదు. ఇప్పుడామె పరిస్థితి ఏమైంది? అందరూ ఆమెను గజ్జికుక్కలా తరిమికొడుతున్నారు. నా భార్య చెల్లెలు రోడ్డుమీద సిగ్గువిడిచి అర్ధనగ్నంగా తిరుగుతుంటే నా గుండె తరుక్కుపోదా?" అంటూ దుఃఖిస్తాడు. చెల్లెలు ఇల్లు విడిచిపోయిందనే బెంగతో అతడి భార్య మరణించింది. అనారోగ్యంతో కొడుకు మరణించాడు. కూతురు వీధిన పడకూడదన్నదే అతని జీవితాశయం.

డ్రెస్ మేకింగ్ పరిశ్రమలో మేరీకి తోటి కార్మికుడు జెం విల్సన్‌తో పరిచయమేర్పడుతుంది. అతనికి ఆత్మగౌరవం ఎక్కువ. పనిలో అందరికీ అతడే ఆదర్శం. పరిచయం ప్రేమగా మారుతుంది. పెళ్లి చేసుకుందామని ప్రతిపాదిస్తాడు. మేరీ సందేహిస్తుంది. సంస్థ యజమాని హెన్రీ కార్సన్ కూడా ఆమె అందానికి ఆకర్షితుడవుతాడు. ఇద్దరిలో ఎవరిని చేసుకోవాలి? కార్సన్‌ను అంగీకరిస్తే నిశ్చింతగా బతకవచ్చు. కలలు పండించుకోవచ్చు. తనూ, తన తండ్రి జీవితాంతం కూలీ చెయ్యక్కర్లేదు. అయితే ఇది కేవలం డబ్బుమీది

# ఎలిజబెత్ గాస్కెల్

## ( 1810 - 1865 )

తొలి రచనతోనే కార్లైల్, కింగ్స్లీ, చార్లెస్ డికెన్స్‌వంటి ప్రముఖుల ప్రశంసలు పొందిన రచయిత్రి ఎలిజబెత్ గాస్కెల్. ఈమె రాసిన పలు కథలు, వ్యాసాలు, రెండు నవలలు క్రాన్ ఫోర్డ్ (1851), నార్త్ అండ్ సౌత్ (1854) డికెన్స్ సంపాదకత్వం వహించిన 'హౌజ్‌హోల్డ్ వర్డ్స్' పత్రికలో ప్రచురించబడ్డాయి. స్కాట్లండు మాండలికానికి వాల్టర్‌స్కాట్ తన నవలల్లో సాహిత్య గౌరవం కలిగించినట్టుగానే, ఇంగ్లండులోని ఇతర ప్రాంతాల 'యాస'ను, దిగువ తరగతుల వాడుక బాషను సమర్థంగా ఉపయోగించిన తొలితరం రచయిత్రి ఎలిజబెత్.

లండన్ పరిసరాల్లోని చెల్సీలో జన్మించింది. ఆమె స్కాటిష్ యూనిటేరియన్ (జీసస్‌ను దైవాంశ సంభూతునిగాకాక ఆదర్శ పురుషునిగా ఆరాధించే క్రైస్తవశాఖ)మినిస్టర్, ప్రభుత్వోద్యోగి, జర్నలిస్టుగా పనిచేసిన విలియం స్టీవెన్సన్‌కు ఎనిమిదో సంతానం. విలియం 1806లో ఇండియాకు గవర్నర్ జనరల్ కాబోతున్న ఎర్ల్ ఆఫ్ లాడర్‌డేల్‌కు ప్రైవేట్ సెక్రటరీగా పని చెయ్యటానికి లండన్ వచ్చాడు. అయితే కొన్ని పరిస్థితులవల్ల కీపర్ ఆఫ్ ట్రెజరీ రికార్డ్స్‌గా ఉద్యోగంలోకి చేరాడు. ఎలిజబెత్ పుట్టిన మూడునెలలకే తల్లి మరణించింది. ఆ పసికందును భార్య సోదరి హన్నాలంబ్ సంరక్షణలో పెంచాడు. ఆవిడే ఎలిజబెత్‌కు పెంపుడు తల్లి.

విలియం మళ్లీ పెళ్లి చేసుకున్నాడు. ఎలిజబెత్ బాల్యమంతా పిన్నివద్ద, నట్స్‌ఫోర్డ్, చెషైర్‌లో గడిచింది. ఇది ఆమె నవల క్రాన్‌ఫోర్డ్‌కు కథాస్థలం. 1832లో విలియం గాస్కెల్‌ను వివాహం చేసుకుని, పారిశ్రామిక నగరం మాంచెస్టర్‌లో స్థిరపడింది ఎలిజబెత్. ఆమె రచనలకు ప్రేరణ ఈ కొత్త వాతావరణమే. తొలినవల ప్రచురణ తర్వాత, ప్లిమౌత్ గ్రోవ్‌లో(1850) విల్లా కొనుక్కుని చివరి పదిహేనేళ్లు అక్కడే గడిపింది. ఆనాటి ప్రముఖులందరూ ఆమెకు మంచి మిత్రులు. సంఘ సంస్కర్తలు విలియం&మేరీ హోవిట్, డికెన్స్, జాన్‌రస్కిన్, హారియెట్ బీచర్ స్టోవ్(అంకుల్ టామ్స్ కేబిన్ రచయిత్రి), చార్లెస్ ఎలియట్ నార్టన్‌లు ఆమె ఇంటికి తరచుగా వచ్చే అతిథులు. ప్రముఖ పియానిస్టు చార్ల్స్‌హాల్ ఆమె నలుగురు కూతుళ్లకూ సంగీతం నేర్పించాడు. రచయిత్రి జార్జి ఎలియట్, ప్రముఖ కవి రాబర్ట్ బ్రౌనింగ్ భార్య ఎలిజబెత్ బారెట్ బ్రౌనింగ్ కూడా ఆమె మిత్రబృందంలోని వారే.

1850లో ఎలిజబెత్‌కు జేన్‌ఐర్ నవలా రచయిత్రి చార్లాట్ బ్రాంటీతో సన్నిహిత స్నేహం ఏర్పడింది. తన ఆప్తమిత్రురాలి మరణం తర్వాత, ఆమె తండ్రి కోరిక మేరకు సుదీర్ఘ పరిశోధన చేసి, 'ది లైఫ్ ఆఫ్ చార్లాట్ బ్రాంటీ' ప్రచురించింది ఎలిజబెత్. ఇది ఇంగ్లీషులోని అత్యుత్తమ బయోగ్రఫీలలో ఒకటి.

విక్టోరియన్ సంప్రదాయాల ప్రకారం తన రచనలన్నీ 'మిసెస్ గాస్కెల్'గానే ప్రచురించింది ఎలిజబెత్. స్త్రీలు తమపేరు ప్రకటించుకోవటం ఆనాడు మర్యాద కాదు.

ఎలిజబెత్ సృష్టించిన సీరియస్ సాహిత్యం కన్నా ఆమె సరదాగా రాసిన దయ్యం కథల (ఘోస్ట్ స్టోరీస్)కే సమకాలీన పాఠకుల్లో ఎక్కువ ఆదరణ లభించిందంటారు.

సంఘసేవా కార్యక్రమాలలో చురుకుగా పాల్గొని, సండే స్కూల్లో బోధించి, పేదల సేవలో గడిపిన ఎలిజబెత్ గాస్కెల్ యాభై ఐదేళ్లకే గుండెపోటుతో మరణించింది.

---

ప్రేమ. హెన్రీకి తన హృదయంలో స్థానం లేదు. కార్మికుడు, పేదవాడైన జెంతో జీవితం పంచుకోవాలనిపిస్తున్నది. అతడే సరిజోడు. తనమీద ఆశలు పెంచుకోవద్దని హెన్రీ కార్సన్‌కు చెప్పాలి. అది ఉభయులకూ శ్రేయస్కరం.

మేరీ తనను తిరస్కరించిందనే అనుకుంటాడు జెం. అయినా ఆమెపై ప్రేమను గుండెలో పదిలంగా దాచుకుంటాడు.

ఈలోగా వేశ్యగా మారిన ఎస్తర్, తిరిగి వచ్చి, మేరీని హెన్రీ కార్సన్ నుండి కాపాడమని జెంను వేడుకుంటుంది. 'ధనవంతుల్ని నమ్మకూడదు. వాళ్లకు పేద ఆడపి

ల్లలు ఆటబొమ్మలు మాత్రమే. ఈ కామాంధుల లోకంలో అందమైన పడతులు ఆత్మరక్షణ చేసుకోగలగటం చాలా అవసరం. ఈ నీచులు తమ అవసరాలు తీరేదాకా కొండమీది కోతినైనా తెచ్చిస్తామంటారు. ఆ తర్వాతే వాళ్ల దుష్టత్వం బయటపడుతుంది' అంటుంది.

అయితే తాగుబోతు ఎస్తర్ మాటలకు విలువలేదు. పబ్లిగ్గా మద్యం సేవించినందుకు ఆమెను నెలరోజులు జైల్లో వేస్తారు. అవమానంతో ఎస్తర్‌ను ఇంటిగడప తొక్కనివ్వడు జాన్ బార్టన్. ఇక అతడికి కూతురు ఫ్యాక్టరీ యజమానిని ఇష్టపడటం నచ్చదు. పేదవాళ్లకు అందమే శత్రువు. డ్రెస్‌మేకింగ్ పని మేరీ మానేస్తే సంతోషిస్తాడు. 'ఫ్యాక్టరీ యజమానులు జలగలు' అని అనుభవం ద్వారా తెలుసుకున్నాడు. వాళ్లను ప్రతిఘటించడానికే ట్రేడ్ యూనియన్‌లో చేరాడు. కూతురు శత్రుపక్షంలో చేరతానంటే తానెలా అనుమతిస్తాడు?

ఎస్తర్ హెచ్చరికతో మేరీని మరచిపొమ్మని కార్సన్‌కు వార్నింగ్ ఇస్తాడు జెం. పోలీసుల సాక్షిగా ఇద్దరూ కొట్టుకుంటారు. ఆ తర్వాత ఎవరో కార్సన్‌ను కాల్చి చంపుతారు. హత్యా స్థలంలో జెం రివాల్వర్ దొరుకుతుంది. అనుమానంతో అతణ్ణి అరెస్టు చేస్తారు. రివాల్వర్ చుట్టి పడేసిన కాగితం మీద 'మేరీ' అని రాసివుంటుంది. ప్రియుణ్ణి ఎలాగైనా రక్షించుకొమ్మని మేరీని హెచ్చరిస్తుంది ఎస్తర్. కేసును స్వంతంగా పరిశోధించి హత్య చేసింది మరెవరో కాదు, తన తండ్రే అని తెలుసుకుంటుంది మేరీ. ఇప్పుడో కొత్త సమస్య ఎదురైంది. తండ్రిని చెరసాల పాలు చెయ్యకుండా జెంను రక్షించటమెలా? తన స్నేహితురాలు మార్గరెట్ తాత జాబ్ లే సహాయంతో ఎలిబీ (నేరం జరిగినప్పుడు నిందితుడు నేరస్థలంలో గాక వేరేచోట ఉన్నట్లు ఆధారం) సేకరించటానికి లివర్‌పూల్ వెళుతుంది. అక్కడ జెం విల్సన్ కజిన్ విల్ విల్సన్ ఒక షిప్ మీద నావికుడిగా పని చేస్తున్నాడు. హత్య జరిగిన రోజు ఇద్దరూ మాంచెస్టర్‌లో కలిసి తిరిగారు. అయితే దురదృష్టవశాత్తూ విల్ విల్సన్ షిప్పు అప్పటికే హార్బర్ దాటింది. మేరీ పడవలో ఆ ఓడను కొంత దూరం వెంబడిస్తుంది. మరునాడు పైలట్ షిప్‌లో తిరిగి వచ్చి సాక్ష్యం చెబుతానని వాగ్దానం చేస్తాడు విల్ విల్సన్.

గత్యంతరం లేని పరిస్థితిలో నేరం చేస్తే తప్పులేదనేది జాన్ బార్టన్ అభిప్రాయం. ఉదాహరణకు ఆకలిగా ఉన్న మనిషిని రక్షించటానికి బ్రెడ్డు దొంగలించవచ్చు. అంటే మంచి ఫలితం కోసం చెడు చెయ్యవచ్చు. కార్సన్‌ను హత్య చెయ్యటానికి కూడా ఈ ఆలోచనా ధోరణే కారణం. ఇది మిల్లు యజమానులకు ఒక హెచ్చరిక.

"పేదలకు సాయం చేస్తున్నారు కొందరు దాతలు. అక్కడికెందుకెళ్లవు?" అని మేరీ అడిగితే, "ఒకరి దయాధర్మాల మీద బతకటమెందుకు? పని చెయ్యటం నా జన్మహక్కు. ఆత్మగౌరవంతో బతకలేనప్పుడు ఆత్మహత్య చేసుకోవటానికైనా వెనుకాడను. చేసిన పనికి న్యాయమైన ప్రతిఫలం గిట్టాలి. అందుకోసం చివరి క్షణందాకా పోరాడుతాను" అని పిడికిలి బిగిస్తాడు.

పరిశోధనలో మేరీకి సహకరించిన మరోపాత్ర ఆలిస్ విల్సన్. ఆమె అవివాహిత. బాల్యంలోనే తమ్ముడితో కలిసి పనిమనిషిగా పొట్టపోసుకోవాలని మాంచెస్టర్ వచ్చింది. "ఇళ్ళలో పని చెయ్యటమంటే ఫ్యాక్టరీ శ్రమ కన్న తక్కువేమీకాదు. పిల్లల్ని చూసుకోవటం, ఇల్లంతా శుభ్రం చెయ్యటం, జబ్బు పడ్డవాళ్లకు సేవలు చెయ్యటం, వంటపని, అంట్లు తోమటం, బట్టలు ఉతకడంతో ఒళ్లు హూనమైపో

తుందనుకో" అంటూ తనగోడు వెళ్లబోసుకుంటుంది. ఆ చాకిరీ తనకు తప్పించినందుకు భగవంతునికి కృతజ్ఞతలు చెప్పుకుంటుంది మేరీ. పాత్రల వ్యక్తిగత జీవితాల గురించే రాసినా, ఇదంతా నగరంలోని కల్లోల పరిస్థితుల నేపథ్యంలో జరుగుతున్నదని గుర్తుచేస్తుంది రచయిత్రి. ఇందులోని పాత్రలు వేలాది కార్మికులకు, దగాపడిన తమ్ముళ్లకు, చెల్లెళ్లకు ప్రతీకలు. అందరి జీవితాలూ కొడిగట్టిన దీపాలే.

జాన్‌బార్టన్ చేసిన హత్యను రచయిత్రి సమర్థించలేదు. వ్యవస్థే బ్రహ్మారాక్షసిగా మారినప్పుడు ఒక వ్యక్తిని హత్యచేసినంత మాత్రాన పరిస్థితి మారుతుందా? ఆర్థిక, సామాజిక రంగాలలో న్యాయం సాధించడానికి చార్టిస్టు ఉద్యమం, ట్రేడ్ యూనియన్‌లు ఉన్నాయి. వ్యక్తులలో ఉన్నత భావాలు పెంచటానికి బైబిల్ వుంది. నవలనిండా బైబిల్ సూక్తులు కోకొల్లలు. ప్రేమ ఎన్ని కష్టాలనైనా భరిస్తుందని చెప్పటానికి మేరీ జీవితమే ఓ తార్కాణం.

చార్లొట్ బ్రాంటీ తన నవల 'జేన్ ఐర్' లో గవర్నెస్‌ల దీనస్థితిని చిత్రించినట్టుగానే, ఫాక్టరీలలోని స్త్రీల కడగండ్లకు అద్దం పట్టింది మేరీబార్టన్. శ్రమ దోపిడీ మాత్రమే కాదు. స్త్రీల లైంగిక దోపిడీ కూడా నేటిలాగే ఆనాడూ సర్వసాధారణం.

నవలలో సగానికిపైగా కార్మికుల కష్టాలు, యజమానుల విలాసాల గురించే రాసింది గాస్కెల్. సంపద సృష్టించిన వాళ్ళు ఆకలికి మాడుతుంటే సుఖాలనుభవించినవాళ్ళు నెత్తుటి కూడు తిన్నట్టే.

పందొమ్మిదవ శతాబ్ద పూర్వార్థంలో ఒక రచయిత్రి వీధివేశ్య గురించి రాయటం సాహసమే. అంతేకాదు ఆమెపట్ల సానుభూతి కలిగించే ప్రయత్నం కూడా చెయ్యలేదు. ఎస్తర్ అందగత్తె కాదు. కాయ కష్టంతో గాక, పురుషులనాకర్షించి డబ్బు చేసుకోవాలనుకోవటం నీచమైన వ్యాపకమని నిర్ద్వంద్వంగా చెప్పింది. నీతి బాహ్యమైన పనులు చేస్తే జీవితం కుక్కలు చింపిన విస్తరవుతుంది.

అనేక ప్రతికూల పరిస్థితులను అధిగమించి, తోటి శ్రామిక సోదరీ సోదరుల సహాయంతో జెంను రక్షించటానికి అవసరమైన సాక్ష్యాధారాలు సేకరిస్తుంది మేరీ. వివాహానికంగీకరించని స్త్రీ తనకోసం ఎంత పాటు పడిందని తెలిసి ఆశ్చర్యపోతాడు జెం. ఆమె నిజంగా ప్రేమిస్తుందన్న మాట. తన జీవితం ధన్యమైంది.

కోర్టులో విచారణ ప్రారంభమవుతుంది. లివర్‌పూల్ నుండి వచ్చిన విల్‌విల్సన్ ఆరోజు జరిగిన సంఘటనలన్నీ వివరిస్తాడు. హత్యా సమయంలో జెం అక్కడ లేనేలేడు. జెంను నిర్దోషిగా ప్రకటిస్తాడు జడ్జి. విచారణ కాలంలో టెన్షన్ భరించలేక మేరీ జబ్బుపడితే, మరో నావికుడు మిస్టర్ స్టర్గిస్, అతని భార్య సపర్యలు చేస్తారు.

ఇంటికి తిరిగివచ్చి, పశ్చాత్తాపంతో దహించుకుపోతున్న తండ్రిని చూస్తుంది మేరీ. హతుని తండ్రి జాన్ కార్సన్‌ను పిలిచి, వర్గ ద్వేషంతో తనే అతడి కొడుకుని హత్యచేశానని చెప్తాడు జాన్ బార్టన్. జాన్ కార్సన్‌లో ప్రతీకారజ్వాల రగులుతుంది. కాని బైబిల్ పఠనంతో పాపులను క్షమించటమే తన కర్తవ్యమని గ్రహిస్తాడు. మనోవ్యథతో జాన్‌కార్సన్ చేతుల్లో ప్రాణాలు వదులుతాడు జాన్‌బార్టన్. పాప జీవితం గడిపి ఇంటికి వచ్చిన ఎస్తర్ కూడా త్వరలో మరణిస్తుంది.

తన గౌరవం మంటగలిసిందని, ఇంగ్లండు వదిలి వెళ్ళటానికి నిశ్చయించుకుంటాడు జెం. చివరకు మేరీ అతణ్ణి పెళ్ళి చేసుకుంటుంది.

–ఎం.వసంత

# చతుర కథలు

# ఎటో?

-సూరిపండు



జ్యేష్ఠమాసపు ఎండ కాష్టంలా మండిపోతోంది. కర్ఫ్యూ పెట్టినట్లుగా నగరంలోని రహదారులపై జనసంచారం చాలా తక్కువగా వుంది. శీతల పానీయాల దుకాణాలు మాత్రం రద్దీగా ఉన్నాయి. చెరకురసం, పండ్లరసాల సెంటర్లు వినియోగదారులతో కిటకిట లాడుతున్నాయి. తప్పనిసరి పనులతో బయటకు రావడం తప్పని వాళ్ళందరూ మండే ఎండను తిట్టుకుంటూ పానీయాల చల్లదనాన్ని గొంతులోకి దింపుకుంటున్నారు.

కాస్త ఖాళీగా వున్న పండ్లరసం దుకాణం దగ్గర స్కూటర్‌ని ఆపాడు ప్రొఫెసర్ పరశురాం. హెల్మెట్ తీసి సీటుపై పెట్టి ఉస్సూరనుకుంటూ చేతిరుమాలుతో కారుతున్న స్వేదాన్ని తుడుచుకుంటూ తనకు కావలసిన జ్యూస్ అడిగాడు. కొద్దిసేపటికి దుకాణంలోని కుర్రాడు అందించిన గ్లాసందుకొని పండ్లరసాన్ని కొద్దిగా గొంతులోకి దింపుకొని 'హమ్మయ్య' అనుకున్నాడు. చల్లగా గొంతులోకి జారుతున్న పండ్లరసపు రుచిని, చల్లదనాన్ని ఆస్వాదిస్తూ ఏదో ఆలోచిస్తున్నాడు. చేతిలోని గ్లాసు ఖాళీ అవడంతో "అరె... అప్పుడే అయిపోయిందా..." అనుకుంటూ గ్లాసును కుర్రాడికిచ్చి డబ్బులు చెల్లించాడు. సీటుమీద పెట్టిన హెల్మెట్‌ని తిరిగి పెట్టుకొని స్కూటర్ స్టార్ట్ చేయబోయి ఆగాడు ప్రొఫెసర్ పరశురాం.

"అవునూ.. ఇంతకీ ఎటు వెళ్తున్నానబ్బా.. ఇంటికా, యూనివర్శిటీకా.." అనుకుంటూ ఆలోచనలో పడ్డాడు. ఎంతసేపటికీ గుర్తు రాకపోవడంతో జేబులోనుండి సెల్‌ఫోన్ బయటకు తీశాడు. ఇంటికి చెయ్యబోయి ఆగిపోయాడు.

"ఊహు.. మిత్రుడు సీతారాంకు ఫోన్ చేస్తే వాడే చెప్తాడు" అనుకుంటూ ఏవో నెంబర్లు నొక్కాడు. అవతలనుంచి 'హలో' అని వినపడగానే తన సమస్యని వివరించాడు ప్రొఫెసర్ పరశురాం.

అంతా విని "బాగానే వుందిరా. వెనకటికి ఇల్లలుకుతూ ఓ ఈగ తన పేరు మర్చిపోయిందిట. నువ్వెటు వెళ్తున్నావో నాకెలా తెలుస్తుందిరా" అన్నాడు సీతారాం.

"ఏడ్చినట్టుంది ఏదో సలహా చెప్తావని నీకు ఫోన్ చేశాను. ఈగలు.. పేర్లు అంటూ కథలు చెప్తావేంటిరా? ఇంతకీ నువ్వేదన్నా చెప్పేదుందా.. లేదా?" చిరాకు పడ్డాడు ప్రొఫెసరు పరశురాం.

"చెప్పడానికేముంది? నీ స్కూటరు ఎటు పార్కుచేసి వుందో చూసి అటు తగలడు" అన్నాడు సీతారాం.

"అవునుకదూ.. నాకు తట్టలేదుస్మీ.. థ్యాంక్స్‌రా.." అంటూ ఫోన్ కట్‌చేసి స్కూటర్ వైపు చూశాడు ప్రొఫెసర్.

"అరె.. ఇది అటు యూనివర్సిటీ వైపు లేదు.

ఇటు ఇంటివైపూ లేదు. మరెట్లా..” అనుకుంటూ మళ్ళీ సీతారాంకి రింగ్ చేశాడు.

‘హలో’ అనగానే “నువ్వు చెప్పినట్టు ఏవైపుకూ లేదురా. తిన్నగా దుకాణంవైపు ఉంది” అన్నాడు ప్రొఫెసర్.

“తూర్పు ఎటో ఎవర్నన్నా అడిగి అటు తిరిగి దణ్ణం పెట్టు. నిన్ను కాదుగాని నీలాటి వాడితో కాపురం చేస్తోందే.. మా చెల్లెమ్మననాలి. అన్నట్టు చెల్లెమ్మంటే గుర్తుకు వచ్చింది. నువ్వు బయలుదేరేటప్పుడు టిఫిన్ బాక్సో, క్యారియరో ఏమన్నా ఇచ్చిందా” అడిగాడు సీతారాం.

“ఏమోరా గుర్తులేదు. చూస్తాను. ఉంటే ఏం చెయ్యమంటావు..” ప్రశ్నించాడు ప్రొఫెసర్.

“ఉంటే క్యారేజీ తెరిచి అక్కడ సెంటర్లో నిలబడి అందరికీ పంచిపెట్టు. బుద్ధి లేకపోతేసరి. అది నిండుగా వుంటే యూనివర్సిటీకి అఘోరించు. ఖాళీగా ఏడిస్తే ఇంటికి తగలడు” సలహా చెప్పాడు సీతారాం.

“బాగుందిరా ఈ ఉపాయం. థ్యాంక్స్‌రా సీతారాం” అంటూ ఫోన్ కట్‌చేసి బ్యాగ్ ఓపెన్ చేశాడు టిఫిన్ బాక్స్ కోసం.

అందులో బాక్స్ కనపడకపోయేసరికి ఏంచెయ్యాలోనన్న సమస్య మళ్ళీ మొదటికి వచ్చింది. వెంటనే సీతారాంకి ఫోన్ చేసి చెప్పాడు.

“అయితే ఒక పని చెయ్యి. వెంటనే మా చెల్లెమ్మకి ఫోన్ చెయ్యి. ఏంచెయ్యాలో చెప్తుంది” అంటూ చిరాగ్గా ఫోన్ కట్ చేశాడు సీతారాం.

“ఛ.. వీడికంతా తొందరే. వాడి చెల్లెమ్మ ఫోన్ నెంబర్ చెప్పకుండానే కట్ చేశాడు” అనుకుంటూ మళ్ళీ నెంబర్లు నొక్కడం ప్రారంభించాడు సీతారాంకి ఫోన్ చెయ్యడానికి.

Ⓒ

# అతిథి

-వాణిశ్రీ

“రేప్పొద్దున విఠోబా వస్తున్నాడు” ఆఫీసు నుంచి వస్తూనే రాజేశ్వరికి చెప్పాడు సుబ్బారావు.

“విఠోబా ఎవరు? ఎక్కడ్నుంచి వస్తున్నాడు?” అడిగింది రాజేశ్వరి.

“నీకు వాడు తెలీదు కదూ! వాడూ నేను కాలేజీ హాస్టల్లో రూమ్మేట్స్. గుంటూరు నుంచి వస్తున్నాడు. నరసాపురం ఎక్స్‌ప్రెస్‌లో రిజర్వ్ చేయించుకున్నాడట. మార్నింగ్ వస్తాడు”

“ఎందుకొస్తున్నాడు? హైదరాబాద్ చూడ్డానికా?”

“కాదు. హైకోర్టు పనట. ముందు బర్కత్‌పురాలో లాయర్‌తో అఫిడవిట్ తయారు చేయించాలట. తర్వాత కోర్టులో ఫైల్ చేయాలట. వారం, పదిరోజులు వుండాల్సొస్తుందన్నాడు.”

“మనం ఉండేది కూకట్‌పల్లిలో. అతని పని హైకోర్టులో. రోజూ అంతదూరం వెళ్ళిరావడం ఇబ్బంది కదూ? ఎంతలేదన్నా ఇరవై కిలోమీటర్ల ప్రయాణం. కోఠీలోనో, అబిడ్స్‌లోనో హోటల్లో ఉండొచ్చుగా?”

“ఉండొచ్చు. కాని మనింటికి వస్తానన్న వాడిని రావొద్దనడం ఎలా? అతిథి దేవో భవ అని కదా మన సాంప్రదాయం” నవ్వుతూ అన్నాడు సుబ్బారావు.

“సరే! రానివ్వండి. అన్నట్లు అతను ఉదయం టిఫిన్‌లోకి ఏం ఇష్టపడతాడు?” అడిగింది రాజేశ్వరి.

“ఇడ్లీ, ఉప్మా చస్తే తినడు. పూరీగాని, దోసెగాని ఇష్టంగా తింటాడు.”

“భోజనంలో ఏం కూరలు తింటాడు?”

“బీరకాయ, సొరకాయ, పొట్లకాయలు తినడు. బంగాళాదుంపలు, వంకాయ కూర్మా, చిక్కుడు వేపుడు ఇష్టం. చేపల కూరంటే ఆమడ దూరం పరిగెడతాడు. మళ్ళీ రొయ్యలు తింటాడు. మటన్ ఇష్టం. చికెన్ తినడు” గుర్తుచేసుకుంటూ చెప్పాడు సుబ్బారావు. అతను చెప్పిందంతా మనసులో రికార్డు చేసుకుంది రాజేశ్వరి.

“నా స్నేహితుడి అభిరుచులు అడిగి తెలుసుకుంటున్న నువ్వు గ్రేట్. సహధర్మచారిణి అంటే అలా వుండాలి” భార్యను పొగిడాడు సుబ్బారావు.

రాజేశ్వరి ముసిముసి నవ్వులు నవ్వింది.

★ ★ ★

ఉదయం ఎనిమిదింటికల్లా దిగాడు విఠోబా. రెండు సూట్‌కేసులు ఆటోలోంచి దించాడు.

“ఇంత లగేజీ తెచ్చావేరా?” ఆశ్చర్యంతో అడి



గాడు సుబ్బారావు.

"ఒకటి కోర్టుకి సంబంధించిన కాగితాలు. మరొకటి నా డ్రెస్‌లు వగైరా!" అని నవ్వాడు విఠోభా.

"ఎన్ని రోజులుంటాడో ఏమో? " అని సుబ్బారావు గుండె గుభేలుమంది.

"వీడే విఠోభా! నా వైఫ్ రాజేశ్వరి. వీళ్ళు .. బంటీగాడు, థర్డ్ క్లాస్, ఇది స్వీటీ.. ఫస్ట్ క్లాస్" అంటూ పరిచయం చేశాడు సుబ్బారావు.

"నమస్తే అన్నయ్యగారూ!" అన్నది రాజేశ్వరి.

"నమస్తే! సారీ అమ్మా! మీ పెళ్ళికి రాలేకపోయాను" అని అబద్ధం చెప్పాడు విఠోభా. పెళ్ళి కార్డిచ్చినప్పుడు మాత్రం బోడి వీడి పెళ్ళికి అంత దూరం అన్నవరం వెళ్ళాలా? వేస్ట్ అనుకున్న సంగతి గుర్తుంది.

"హాయ్! అంకుల్" అన్నారు పిల్లలు.

"హాయ్! బాగా చదువుతున్నారా? " అంటూ పిల్లల్ని పలకరించాడు. వాళ్ళు తలూపారు.

విఠోభా స్నానం చేసిన తర్వాత "రండి అన్నయ్యగారూ! టిఫిన్ రెడీ" అన్నది రాజేశ్వరి.

డైనింగ్ టేబుల్‌మీద పొగలు కక్కుతున్న ఉప్మా దర్శనమిచ్చింది. సుబ్బారావు కంగు తిన్నాడు. విఠోభా ఏడుపుముఖం పెట్టాడు. రాజేశ్వరివైపు అయోమయంగా చూశాడు. ఆమె అదేం పట్టించుకోనట్లు "కొబ్బరి చట్నీ తినండి. జీడిపప్పు వేసి చేశాను. చాలా బాగుంటుంది" అంటూ చట్నీ వేసింది ప్లేట్‌లో.

విఠోభా ఆముదం తాగుతున్న వాడిలా ముఖం పెట్టి చచ్చినట్టు తిన్నాడు. మారు వడ్డిస్తానంటే 'అమ్మో! తినలేను' అంటూ చేతులెత్తేశాడు.

సుబ్బారావుతోపాటు వెళ్ళిపోయిన విఠోభా మళ్ళీ రాత్రికి ఆపసోపాలు పడుతూ తిరిగి వచ్చాడు.

రాత్రి డిన్నర్‌లోకి సొరకాయల పులుసు, బీరకాయ కూర వడ్డించింది రాజేశ్వరి. అవి చూసి ముఖం చిట్లించి తనకు ఆవకాయ పచ్చడి ఇష్టం అంటూ పచ్చడి మెతుకులు తిన్నాడు విఠోభా.

మర్నాడు ఆదివారం.

టిఫిన్ ఇడ్లీ. విఠోభాకి దిగలేదు. ఏదో రెండు తిని అయిందనిపించాడు.

"అన్నయ్యగారికి ఈ రోజు నాన్‌వెజ్ వండుతా. రాత్రి గూడా సరిగా తినలేదు" అంటూ రాజేశ్వరి మార్కెట్‌కి బయల్దేరింది.

లంచ్‌లోకి చేపల పులుసు వడ్డిస్తుంటే హడలిపోయాడు విఠోభా.

"నేను చేపలు తిననమ్మా! అసలు నాకా వాసనే పడదు" అన్నాడు ముక్కు మూసుకుంటూ.

"అయ్యయ్యో! అలాగా! ఏమండీ మీరైనా చెప్పొద్దా.. అన్నయ్యగారు చేపలు తినరని. భలే వారే! తొమ్మిది కిలోల చేపలో నాలుగోవంతు

భాగం తీసుకున్నా. కూరంతా ఏం చేయాలో!" అని బాధపడిపోతూ రాత్రి మిగిలిన సొరకాయ పులుసు, బీరకాయ కూర తెచ్చి డైనింగ్ టేబుల్ మీద పెట్టింది రాజేశ్వరి.

"అమ్మా! ఫ్రిజ్‌లో పెట్టినవి నాకు పడవు. ఆవ కాయతో సర్దుకుంటా!" అని పచ్చడి మెతుకులు తిన్నాడు వినోభా.

సాయంకాలం లగేజి సర్దుకుని "అరేయ్ సుబ్బారావు. హైకోర్టు దగ్గర్నుంచి కూకట్‌పల్లి రావాలంటే చాలా ప్రాబ్లమ్‌గా ఉంది. అక్కడే ఏదో ఒక హోటల్లో వుంటా!" అంటూ బయల్దేరాడు వినోభా. సుబ్బారావు బతిమాలినా ససేమిరా అంటూ పరిగెత్తాడు. వినోభా అటు వెళ్ళగానే ఇటు రాజేశ్వరిమీద విరుచుకుపడ్డాడు.

"నువ్వు కావాలనే వాడికిష్టంలేనివి వండి కడుపు మాడ్చావు. పాపం పచ్చడి మెతుకులు తిన్నాడు."

"మీకసలు లోకజ్ఞానం లేదు. ఏదో హైదరాబాద్ చూడ్డానికొస్తే రెండు మూడు రోజులుండి పోతాడు. కోర్టు పనిమీద వచ్చినవాడు ఈ ఒక్క సారితో వదుల్తాడా? దెయ్యమై పట్టుకుంటాడు. నెల నెలా వస్తుంటాడు. అల్లుడికి మేపినట్లు మేపడం నావల్ల కాదు" అని రుసరుసలాడింది రాజేశ్వరి.

సుబ్బారావు తెల్లముఖం వేశాడు. ©

# టేస్ట్!

-కైపు ఆదిశేషారెడ్డి



సింహాద్రికి ఓ చిన్నపాటి టౌనులో చిరుద్యోగం. రెండు నెలల క్రితం సావిత్రితో పెళ్లయింది. వారం రోజుల క్రితమే భార్యతో కొత్తగా కాపురం పెట్టాడు.

ఎదురెదురుగా డైనింగ్ టేబుల్ మీద భోజనానికి కూర్చొన్నారు.

వేడివేడిగా అన్నం వడ్డించి.. కూరవేసింది సావిత్రి. కూర,

అన్నం, కలుపుకొని రెండు ముద్దలుతిని సావిత్రి వంక చూశాడు.

సావిత్రి ఆత్రుతగా భర్త ముఖంవైపు చూస్తూ.. "వంకాయ కూర.. బాగాలేదా..?" అడిగింది.

"ఎవరు చేశారు..?" అడిగాడు సింహాద్రి.

"నేనే చేశానండీ..!" సంతోషంగా చెప్పింది.

"అవునా..!" నిర్లిప్తంగా అని, యేదో విషం మింగినట్లుగా మింగి, భోజనం తిన్నాననిపించి లేచాడు.

ఆమె కూడా తిని 'కూర బాగుందే..! ఆయనకెందుకు నచ్చలేదు! బహుశా వంకాయ అంటే నచ్చదు కాబోలు!' అనుకొంది.

మరుసటి రోజు బంగాళాదుంపల మసాలా కూర వండింది.

"నీ వంటేనా యిది?" అని అడిగి, ఏడుస్తూ తింటూ ముగించాడు.

సావిత్రికి భర్తగారికి కావాల్సిన రుచులేంటో అర్థం కాలేదు. తనేం కూరలు చేయటం చేతగానిదేం కాదు. తమ పుట్టింట్లో కమ్మగా కూరలు చేసి బెస్ట్ అనిపించుకొంది. అమ్మా, నాన్నలు తన కూర రుచులను మెచ్చుకొంటూ తినేవారు.

పెళ్లయ్యాక అత్తారింటికి వచ్చిన తర్వాత పది రోజులు తానే వంట చేసింది. స్వయాన అత్తయ్యగారు కూడా తన వంటలను మెచ్చుకొన్నారు.

మరి అందరికీ నచ్చిన వంటలు.. ఆయనగారికెందుకు నచ్చటం లేదు.

తీవ్రంగా ఆలోచించసాగింది సావిత్రి. అసలు లోపం తనవైపు ఎక్కడుందనేది ఆమెకు అర్థం కాలేదు. ఏంచేయాలో దిక్కుతోచలేదు.

ఆ తర్వాత మరో వారం రోజులు అదే తంతు! చికెన్, ఫిష్, ఎగ్‌కర్రీ.. ఒకటేంటి.. తనకు తెలిసిన అన్ని రకాల వంటలను ఎంతో ఆప్యాయంగా చేసి వడ్డించింది. అయినా ఆయన తృప్తిగా భోంచేయలేదు. 'తిన్నానంటే... తిన్నాను' అన్నట్లుగా వుంది అతని స్వభావం.

"ఏవండీ! నా వంటలు మీకు నచ్చటం లేదా!" అడిగింది.

"బాగున్నాయిలే!" ముభావంగా చెప్పి తప్పించుకొన్నాడు సింహాద్రి.

ఉండబట్టలేక ఆరోజు భర్త ఆఫీసుకు వెళ్లిన తర్వాత అత్తగారికి ఫోన్ చేసింది సావిత్రి.

"అత్తయ్యగారు! మీరు ఒకసారి వచ్చివెళ్లండి!" అంది.

"ఎందుకేమిటి..? వాడేదయినా గొడవ పెట్టుకొన్నాడా?" గాబరాగా అడిగింది.

"అదేం లేదు అత్తయ్యగారూ! ఆయనకు నా వంటలు నచ్చటం లేదు. యేది వడ్డించినా తృప్తిగా తినటం లేదు. ఎలాంటి కూరలు నచ్చుతాయో అర్థం కావటం లేదు. మీరు ఓ వారం రోజులపాటు ఇక్కడ వుండి నాకు కాస్త వంటలు నేర్పించి వెళతారని..." చెప్పింది సావిత్రి.

అవతలి నుండి ఆవిడ గలగల నవ్వేసి "అమ్మాయ్..! వాడి గురించి నీకు చెప్పటం మరిచాను. వాడిది అదో రకమైన టేస్ట్!" అంటూ.. కొడుకుగారి కూరల టేస్ట్ గురించి వివరంగా చాలాసేపు చెప్పింది.

అత్తగారు చెప్పింది సావధానంగా విని "మరి.. ఇక్కడ నాకు ఇంకా ఎవరితోనూ పరిచయం కాలేదు. అంతా కొత్త. ఎవరింటికీ నేను వెళ్లట్లేదు. ఎవరి సాయమైనా పొందాలంటే నా లాంటి కొత్తగా వచ్చినవారికి ఎలా సాధ్యమవుతుంది అత్తయ్యగారూ" అని అడిగింది సావిత్రి.

"అబ్బా.. నేను చెప్పినదాన్ని అమలు చేసేందుకు నువ్వెవరినీ అడగక్కర్లేదు! ఎక్కడా తేనక్కర్లేదు! నేను చెప్పినట్లుగా కాస్త బుర్ర ఉపయోగించి ఎలాగో మేనేజ్ చేసేయ్. అద్భుతమైన ఫలితం వస్తుంది. నేనూ అలాగే చేసేదాన్ని" అంటూ బ్రహ్మ రహస్యాన్ని మళ్లీ వివరంగా కోడలి చెవిలో వేసింది.

చిక్కటి సమస్యకు చక్కటి ఉపాయాన్ని చెప్పిన అత్తయ్యకు "థ్యాంక్స్" చెప్పి ఫోన్ పెట్టేసింది సావిత్రి.

సాయంత్రం భోజనానికి కూర్చున్నాడు సింహాద్రి. యథా ప్రకారంగా నిరాసక్తంగా అదోలా మొహం పెట్టుకున్నాడు. ఆరోజుతో తన సమస్యను ఎలాగైనా పరిష్కరించుకోవాలని పట్టుదలగా ఉందామె. తన పాచిక విసిరింది.

కంచంలో అన్నం వడ్డించి, "ఇదిగో ఈ సాంబారు ఎదురింటి మీనాక్షి అక్కయ్యగారు పంపించారు. ఈ రసం పక్క పోర్షన్‌లోని కామాక్షిగారిచ్చారు" అంటూ దగ్గరకు జరిపింది.

ముఖంలో ఎక్కడలేని ఆనందం ముంచుకురాగా "అవునా.. సావిత్రీ! చెప్పవేం" అంటూ సాంబారు, రసం వేసుకొని ఆవురావురంటూ లాగించి, తృప్తిగా లేచిపోయాడు సింహాద్రి.

వాస్తవానికవి.. కిందటిరోజున చేసినవి. మిగిలిపోతే ఫ్రిజ్‌లో ఉంచింది. అత్తగారి సలహామేరకు వాటినే వేడిచేసి పొరుగింటి, ఎదురింటి వారివిగా చెప్పి వడ్డించింది. ©

# సెల్‌ఫోను

-కె. రామారావు



గోపాల్ భార్య పుట్టింటికి వెళ్ళింది. గోపాల్ ఆఫీస్ నుంచి వచ్చి ఒక కప్పు కాఫీ కలుపుకు తాగాడు. ఇంట్లో ఒంటరిగా ఉండి 'బోర్' కొడుతున్నది. కాలక్షేపానికి సినిమాకి బయల్దేరాడు. ఇంటికి తాళంపెట్టి తాళం చెవి పక్కింట్లో ఇచ్చాడు. ఒకసారి తాళంచెవి తనతో తీసుకెళ్ళి పారేసుకున్నాడు. తాళం విరగగొట్టాల్సి వచ్చింది. అప్పటినుంచి తాళంచెవి పక్కింట్లో ఇవ్వటం ప్రారంభించాడు. ఎదురుగా కనపడ్డ సినిమాహాలులో దూరాడు, సినిమా కంటే 'టైం కిల్లింగ్' ముఖ్యం కాబట్టి. ఇంకా బుకింగ్ మొదలవ్వలేదు. అక్కడే ప్రేక్షకుల కోసం వేసిన ఒక బెంచీపై కూర్చున్నాడు. జేబులో 'సెల్' మోగింది.

"హలో నేన్రా రామనాథాన్ని."

"ఓ నువ్వా.. ఎప్పుడు వచ్చావు? ఎక్కడనించి మాట్లాడుతున్నావు."

"ఇప్పుడే రైలు దిగాను. స్టేషనునుంచి మాట్లాడుతున్నాను. ఆఫీసులో పని ఉండి వచ్చాను".

"సంతోషం. మీ వదినె ఊరికెళ్ళింది. నేను కాలక్షేపానికి సినిమాకి వచ్చాను. నీవు ఇంటికి వెళ్ళి ఫ్రెష్ అయ్యి రా. అన్నట్టు మా ఇల్లు గాంధీ నగర్, 31 నెం. పక్కింట్లో తాళంచెవి ఇచ్చాను. నా పేరు చెప్పి తీసుకో. మళ్ళీ తాళం చెవి అక్కడే ఇచ్చేసేయ్. నువ్వు వచ్చేసేయ్'

"తమ్ముడా ఇప్పుడు మీ ఇంటికి పోయే ఓపిక లేదు. నా దగ్గర సామాను కూడా ఏమీ లేదు."

"అయితే సరాసరి సినిమా హాలుకి వచ్చేయి. ఇద్దరం సినిమా చూసి, మంచి హోటల్‌లో భోంచేసి వెళ్దాం" అని సినిమా హాలు అడ్రసు చెప్పాడు. అరగంటలో రామనాథం వచ్చాడు. అప్పటికే గోపాల్ రెండు టిక్కెట్లు తీసుకొని సిద్ధంగా ఉన్నాడు. ఇద్దరూ సినిమా చూసి హోటల్‌లో భోంచేసి నెమ్మదిగా పదకొండు గంటలకు ఇల్లు చేరారు. పక్క ఇంటి నుంచి తాళంచెవి తీసుకొని తాళం తీసి, లైటు వేశాడు గోపాల్. ఇంటి పరిస్థితి చూసి బిత్తరపోయాడు. సామాన్లు చిందర వందరగా పడి ఉన్నాయి. అల్మారా తీసి ఉంది. అందులో నాలుగువేలు హుష్‌కాకి అయినాయి. భార్య బంగారం గాజులు జత లేవు. కొన్ని పట్టుచీరలు లేవు. వేసిన తాళం వేసినట్టే ఉంది. ఇదంతా ఎట్టా జరిగింది. ఇద్దరూ ఆశ్చర్యపోయారు. గోపాల్ దృష్టి అక్కడ బల్లపై ఉన్న ఒక కాగితంపై పడ్డది.

"ఓ మిత్రమా! నీవు నన్ను ఎరుగవు. నేను నిన్ను ఎరుగుదును. సినిమా హాలు దగ్గర చూశాను. నీవు సెల్‌ఫోన్‌లో నీ స్నేహితుడితో మాట్లాడింది విన్నాను. నా ఉద్యోగం ఇదే. పక్క ఇంటినుంచి నీ 'రిఫరెన్స్' ఇచ్చి తాళం చెవి తీసుకున్నాను. నాకు కావలసినది నేను తీసుకున్నాను. భద్రంగా ఇల్లు తాళం వేసి తాళంచెవి ఇచ్చేశాను. మీరు ఇద్దరూ సినిమా చూసి మంచి హోటల్‌లో భోంచేసి రండి. ఇల్లు భద్రంగా ఉంది. బై..బై".

గోపాలం కోపంగా సెల్‌ఫోన్ నేలకేసి కొట్టాడు.

# ఆరి... పిడుగా..!

-సోమంచి రామం





"అన్నయ్యా వీడితో నా ప్రాణం విసుగెత్తి పోతోంది. వీడికసలు చదువు వచ్చే యోగం ఉందో లేదో!"

"ఏం జరిగిందిరా? ఎందుకలా ఆదుర్దా పడతావు? వాడింకా చిన్న వెధవేగా? "

"చిన్నో పెద్దో! చివరకు ఒట్టి వెధవలా తయారయ్యేట్టున్నాడు! మేమంతా చిన్నప్పుడే చదువుకోలేదూ! మేము ఇలాగే జులాయిగా తిరిగామా? "

"ఆ రోజులు వేరురా.. అది సరే.. ఇంతకూ ఇప్పుడేమంటావ్? "

"ఏం లేదన్నయ్యా! వీడ్ని కాస్త దగ్గర కూర్చోబెట్టుకొని, నాలుగక్షరమ్ముక్కలైనా వచ్చేట్టు చూడు! వీడి చదువే సమస్య అయిపోయిందనుకో! అప్పుడే ఫైనల్ ఎగ్జామ్స్ వస్తున్నాయి! ఫోర్తులో టెన్త్ ర్యాంకు. ఈ ఫిఫ్త్‌లోనన్నా ఫిఫ్త్‌ర్యాంకన్నా"

"అలాగే చూద్దాం లేరా! అయినా చదువంటే ఎంతసేపూ ర్యాంకులేనేరా? చదువంటే బట్టీపట్టినవి పరీక్షల్లో రాయడం కాదురా!"

"ఏంచేస్తావో ఏమో! నీ దయవల్ల మేమంతా బాగా చదివి పైకొచ్చాం! అలాగే వీడ్ని కూడా"

"సర్లే చూద్దాంలే! నువ్వెళ్ళు.. మళ్ళీ ఆఫీసు టైమవుతుందేమో!" అలా తమ్ముణ్ణి సాగనంపాడు జగన్నాథంగారు!

ఆయన మేష్టారుగా చేరి, హెడ్మాష్టారుగా రిటైరయ్యారు. పిల్లల మనస్తత్వాలను బాగా అర్థం చేసుకొనేవారు! ఆయన పాఠం చెప్తే మళ్ళా ఇంటిదగ్గర చదివే పనుండదు. పాఠం చెప్పేటప్పుడు ఎంత సీరియస్‌గా, స్ట్రిక్టుగా ఉంటారో మిగతా టైములో పిల్లల్తో అంతే ప్రేమగా ఉంటారు. అంతేనా! పిల్లలకు, ఆటలు, పాటలు, విచిత్రవేషాలు, నాటకాలు.. ఎన్నెన్నో నేర్పేవారు. అందుకనే పిల్లలకు ఆయనంటే ఇష్టం, గౌరవం.

తమ్ముడు వెళ్ళిపోగానే, పదేళ్ళ ఆ పసివెధవ కేసి చూశారు జగన్నాథం. హాయిగా కుర్చీలో కూర్చుని, డైనింగ్ టేబుల్ మీద కాళ్ళుపెట్టి టీవీలో 'పోగో'లాంటిదేదో చూస్తున్నాడు. ఆనందాతిశయంతో మరోలోకంలో తేలిపోతున్నాడు. మధ్యమధ్యలో క్యాడ్‌బరీస్ చాక్లెటు కొరుక్కుని తింటున్నాడు. వాడి ధోరణి, వాడి వాలకం

చూస్తే, వాడినెలా దారికి తేవాలన్న ఆలోచనలో పడ్డారాయన. ఛైల్డ్ సైకాలజీనంతా గుర్తు తెచ్చుకున్నారు. ఇంతలో కరెంటు పోయింది! అంతే-

'ఓ! డామిట్ కరెంటు! ఇంకా నైన్ కాకుండానే ఆఫ్ చేసేశాడు' అంటూ విసుగ్గా అరిచాడు, ఆ పసివాడు కోపంతో!

"ఏమిట్రా? ఏమైందిప్పుడు? " అంటూ తాపీగా ఏమీ ఎరగనట్లు అడిగాడాయన!

"చూడు పెదనాన్నా! ఇంకా త్రీమినిట్స్ బిఫోర్ పవర్‌కట్ చేసేశాడు స్కౌండ్రెల్!" అంటూ ఆ కోపమంతా క్యాడ్‌బరీస్‌మీద చూపిస్తూ, గబగబా కొరికేసి నమలసాగాడు.

దాన్ని చూడగానే, జగన్నాథంగారి బుర్రలో ఓ అయిడియా తళుక్కుమంది. ఫ్రం నోన్ టు అన్నోన్ - అన్న సూత్రంలాగే ఆసక్తి కలవైపు నుంచి వెళ్ళాలని, "చూడు! వినయ్! నీకీ మిల్క్ బార్లంటే చాలా ఇష్టమనుకుంటాను" అన్నాడు.

"అవును పెదనాన్నా! అవంటే నాకు చచ్చేలైకింగ్.. అందులోనూ క్యాడ్‌బరీసంటే"

"వెరీగుడ్! తినడానికేమో మిల్క్‌బారులు ఇష్టమన్నావు కదా! మరి ఆడుకునేందుకే గేమ్సు ఇష్టం? "

"గేమ్సా.. నాకు చాలా ఇష్టమే! హాయిగా బైటికెళ్ళి క్రికెట్టు ఆడుకొంటానంటే డాడీ ఒప్పుకోవటం లేదు పెదనాన్నా!"

"ఓ! అలాగా!... అయితే నీకు క్రికెట్టాడాలని ఉందన్నమాట!"

"అవును పెదనాన్నా! నాకు క్రికెటంటే చచ్చే లైకింగ్! టీ.వీ.లో మ్యాచ్ చూస్తుంటే... నాకింక లంచ్, టిఫిను, డిన్నరు.. ఇవేం గుర్తుండవు"

"అలాంటప్పుడు నువ్వూ క్రికెట్టాడుకోవచ్చుగా"

"ఎలా పెదనాన్నా! బ్యాటేదీ? బంతేదీ? పాడ్లేవి? స్టంప్స్ ఏవి? డాడీ కొనరు!"

"డాడీ సంగతొదిలేయ్! డాడీ కొనకపోతే నువ్వే డబ్బు సంపాదించి కొనుక్కుందువుగాని!"

"పో పెదనాన్నా! బలే జోక్ చేస్తున్నావు! నేనేంటి? డబ్బు సంపాదించడమేంటి? "

"సంపాదిస్తావురా! నువ్వు కష్టపడి చదువుకొని మాంచి ర్యాంకులు సంపాదించుకుంటే.."

"ఏమిటి పెదనాన్నా! మళ్ళీ చదువంటూ నువ్వూ బోర్ కొడుతున్నావ్!" అన్నాడావెధవ విసుగ్గా!

"అబ్బే! అదేం లేదురా! నిన్నేం చదువుకోమనటం లేదు. ఊరికే నీకో ఐడియా ఇస్తున్నానంతే! నీకు ఫస్టు ర్యాంకొచ్చిందనుకో.. స్కాలర్‌షిప్ వస్తుంది! దాంతో హైయర్ ఎడ్యుకేషన్ పూర్తి చేసి ఐ.ఏ.ఎస్ పరీక్షకెళ్ళొచ్చు" అని.

"ఎందుకు పెదనాన్నా? "

"ఎందుకేమిట్రా? ఐ.ఏ.ఎస్ సెలక్షనొస్తే కలెక్టరవచ్చు! లేదా గవర్నమెంటులో సెక్రటరీ అవచ్చు! అప్పుడు మంచి హోదా, గౌరవం, పెద్ద జీతం, గవర్నమెంట్ జీపు.."

"ఇంకా...? " ఆత్రుత కనపరుస్తున్నట్లుగా అడిగాడు ఆ పసివాడు!

"ఇంకా చాలావస్తాయి. పెద్ద పలుకుబడి వస్తుంది! మాంచి బంగళా, దాన్నిండా ఫర్నీచరు, ఫ్రిజ్, టీ.వీ, వి.సి.ఆర్, వీ.సి.పీ, బంగళాలోనే టెన్నిస్ కోర్టు.."

"మరి స్విమ్మింగ్ పూల్..? "

"ఆ! అదీనూ! టెన్నిస్ కోర్టుకు దూరంగా స్విమ్మింగ్ పూలు..? సాయంత్రం టెన్నిస్ ఆడి, హాయిగా ఆ పూల్‌లో స్విమ్మింగ్ చేయచ్చు."

"ఆ తర్వాత హాయిగా ఇంట్లోకొచ్చి టీ.వీ. పెట్టుకుంటా! కావాలంటే వీడియోగేమ్సు ఆడుకోవచ్చు కదూ!"

"కరెక్ట్‌గా చెప్పావురా! ఇవన్నీ ఓ ఓన్ బిల్డింగ్‌లోనే ఉంటాయి."

"ఓన్ బిల్డింగా? అదేంటి పెదనాన్నా! ఇదుండగా నాకింకో బిల్డింగెందుకు మళ్ళా? ఇది నాదేగా? "

"అలా అని ఎవరు చెప్పార్రా నీకు? "

"డాడీయే! లాస్ట్‌మంత్ ఎవరో ఫ్రెండొస్తే, ఈ బిల్డింగ్ నా కోసమేనని చెప్తుంటే విన్నాను? "

జగన్నాథంగారికి బుర్ర తిరిగిపోయింది. అంతలో మళ్ళా తేరుకున్నారు.

"ఆల్ రైట్! ఆల్ రైట్!! పోన్లే ఆ సంగతలా వదిలేయ్! నువ్వు బాగా చదువుకొని, మంచి ర్యాంకు తెచ్చుకొని, పెద్ద ఉద్యోగంలో చేరి, బాగా డబ్బు సంపాదించుకున్నావంటే హాయిగా నీకిష్టమైనవన్నీ తింటూ, నీకిష్టమైన గేమ్సు ఆడుకొంటూ, టీ.వీ. చూసుకొంటూ, హ్యాపీగా ఎంజాయ్ చేయొచ్చు! నిన్నడిగే వాళ్ళెవరూ ఉండరు! తెల్సిందా? "

"ఏంటి పెదనాన్నా! నీ చాదస్తం! నేనిప్పుడు హ్యాపీగానే ఎంజాయ్ చేస్తూనే ఉన్నానుగా! ఇంకా నాకారిస్కంతా ఎందుకు? చెప్పు పెదనాన్నా!"

జగన్నాథంగారు కొయ్యబారిపోయాడు.

"ఆరి పిడుగా!" అని మనసులో అనుకోబోయి పైకనేశారు.

అయినా ఆ పిడుగు అక్కడుంటేగా! Ⓒ

# మానాన్న .. నేనూ...



**'మానాన్న కొడవటిగంటి కుటుంబరావు శతజయంతి సందర్భంగా రాష్ట్రంలోని పత్రికలూ, సాహితీ సంస్థలూ గత పదినెలలుగా ఎన్నో రచనలని ప్రచురిస్తున్నాయి. సభలు ఏర్పాటు చేసి ఉపన్యాసాలు ఇప్పిస్తున్నాయి. పాఠకులకి ఇప్పటికే ఆయన రచనలు, వ్యక్తిత్వం గురించీ చాలా తెలిసే ఉంటుంది. నిజానికి మానాన్నలో ఉండే రచయితకీ, వ్యక్తికీ పెద్ద తేడా లేదు. రచనల్లో చెప్పిన విషయాలు, ఆలోచనలనీ జీవితానికి కూడా అన్వయించుకున్న గొప్ప వ్యక్తి. ఆయన కుమార్తెగా నాకు మాత్రమే తెలిసిన కొన్ని విషయాలని పంచుకునే ప్రయత్నం ఇది'**

–ఆర్. శాంతసుందరి

**మా**నాన్న రచనల ప్రత్యేకత సూటిదనం, స్పష్టత, క్లుప్తత. తను చెప్పే విషయం ఆలోచింపజెయ్యాలనేది ఆయన అభిమతం. రచనల్లోని ఈ పద్ధతినే ఆయన ఇంట్లో కూడా పాటించేవారు. మేమెవరమైనా ఏదైనా పొరపాటు చేస్తున్నామని అనిపిస్తే, నాలుగే నాలుగు మాటల్లో వ్యాఖ్యానించేవారు తప్ప, 'ఇలా ఎందుకు చేస్తున్నావు? అలా ఎందుకు చెయ్యటం లేదు?' అని నిలదీయటం కానీ, లెక్చర్లివ్వడం కాని ఉండేది కాదు. అసలు మా దగ్గర్నుంచి సంజాయిషీ రావాలని ఆయన అనుకునేవారే కాదు. సరైన మార్గమేదో సూచనప్రాయంగా చెప్పేవారు. దాన్ని అర్థం చేసుకుని సరిదిద్దుకోవలసిన బాధ్యత మాకే వదిలి పెట్టేవారు. ఇదంతా మాకు పదిహేనేళ్లు వచ్చిన తరవాత సంగతి. అంతకు ముందు మా మంచి చెడ్డలన్నీ అమ్మే చూసుకునేది. మా చిన్నతనంలో ఆయన సాయంకాలాలు మాతోటే గడిపేవారు. 'చందమామ' కథల్లాటి కథలెన్నో చెప్పేవారు. చీకటి పడ్డాక బైట అరుగుమీద ఆయనతో కూర్చుని ఆకాశంలో ఉండే నక్షత్ర మండలాలు, గ్రహాల గురించీ చాలా తెలుసుకున్నాం.


కొడవటిగంటి

మా నాన్నకీ, మా అమ్మకీ ఇద్దరికీ సంగీతంలో అభిరుచీ, ప్రవేశం ఉండటం చేత, నాకూ, మా తమ్ముడికీ సంగీతం నేర్పించారు. ప్రాక్టీసు చెయ్యమని ఎప్పుడూ వేధించేవారు కాదు. కానీ మేము ప్రాక్టీసు చేస్తూంటే సలహాలిచ్చేవారు. బాగుంటే నిస్సంకోచంగా పొగడేవారు.

పేరులోనే 'కుటుంబం' ఉన్న మా నాన్న పూర్తిగా కుటుంబానికే అంకితమయిన వ్యక్తి. ఆఫీసు, ఇల్లు, అంతే. అదే ఆయన ప్రపంచం. విశాల ప్రపంచం ఆయన దగ్గరున్న పుస్తకాల్లోనూ, ఆయన మేధలో పుట్టే ఆలోచనల్లోనూ ఉండేది. మా అమ్మని పెళ్లి చేసుకుని స్థిరపడే లోపలే (1945) ఆయనకి బోలెడంత అనుభవ జ్ఞానం లభించింది. దేశంలోని ఎన్నో ప్రాంతాల్లో, ముఖ్యంగా ఆంధ్ర రాష్ట్రం బైటే ఎక్కువ కాలం గడిపారు. అందువల్లనే విశాలదృక్పథం అలవడిందేమో!

ప్రతిరోజూ ఆఫీసునించి వచ్చాక, ఇంట్లో

కూడా మంచం మీద బోర్లా పడుకుని, ఛాతీ కింద దిండు పెట్టుకుని రాసుకునే వారు. ఆయన రాసిన దానిలో తుడు పులూ, కొట్టివేతలూ ఉండేవి కావు. కానీ అందులోనించి ఒక్కమాటని తీసేయటం కాని, చేర్చటం కానీ వీలుపడదు. రాసింది తిరిగి చూసుకోవటం అనేది ఆయన పద్ధతి కాదు. ఒకసారి ఆయన కథలు పన్నెండిం టిని నేను కాపీ చెయ్యాల్సి వచ్చింది. అసలు ఏం జరిగిందంటే, పాత 'ఆంధ్ర భూమి' ఒక ఏడాది సంచికల బైండు పుస్తకం తనకి పేవ్‌మెంట్ షాపులో దొరి కిందని, అట్లూరిపిచ్చేశ్వర్రావు, మా నాన్నకి తెచ్చిచ్చారు. ఒక్కో సంచికలోనూ నాన్నది ఒక్కో కథ ఉంది. 'పతిభక్తి' అనే సంకల నంగా అవి తరవాత పుస్తకరూపంలో వచ్చాయి. ఆ పన్నెండు కథలనీ నాచేత కాపీ చేయించటమే కాక పుస్తకంగా వచ్చాక, ముందుమాటలో నాకు కృతజ్ఞ తలు కూడా తెలిపారు! ఇదేమిటి అని నేనూ, మా అమ్మా అంటే, నా పద్ధతి అంతేనన్నారు.!

## సత్యజిత్‌రాయ్ సినిమాలకి...

మాకు పన్నెండు, పదమూడేళ్లు వచ్చాక మమ్మల్ని సత్యజిత్‌రాయ్ సినిమాలకి తీసు కెళ్లారు. ఇంటికొచ్చాక నాన్న ఆ సినిమాల గురించి వివరించాక అవి ఎందుకు గొప్పవో మాకు అర్థమయేది. పెద్దయాక సబ్‌టైటిల్స్‌తో చూసినప్పుడు ఇంకా ఎక్కు వగా ఆనందించగలిగాం. మా అమ్మ కూడా సాహిత్య వాతావరణం ఉన్న కుటుంబంలోనించి వచ్చి ఉండటంచేత, మా అమ్మానాన్నా మాకు మంచి సాహిత్యం పట్ల, సంగీతం పట్ల, మా అయిదో ఏటినించే అభిరుచిని కలిగిం చారు. వాళ్లిద్దరూ ఎప్పుడూ పుస్తకాలు చదువుతూ ఉండటంచూసి, మేము కూడా అదే అలవాటు చేసుకున్నాం. మొదట్లో నాకిద్దరు తమ్ముళ్లు. మేం ముగ్గురం పదేళ్లు కూడా నిండకముందే, పుస్తకాలూ, కలాలూ పుచ్చుకొని 'కథలు' కూడా రాసేవాళ్లం. వాటిని మేమే చదువుకుని ఆనందించే వాళ్లం అనేది వేరే సంగతనుకోండి!

## ఫొటోగ్రఫీ.. తోటపనీ...

రాయటం మా నాన్నకి 'పని' కాబట్టి ఆయనకి హాబీలు వేరే ఉండేవి. మా నాన్నకి ఫొటోగ్రఫీ, తోటపనీ, సంగీతం హాబీలని చెప్పవచ్చు. ఇంట్లోవాళ్లకీ, స్నేహి తులకీ ఆయన కొన్ని వందల ఫొటోలు తీసి ఉంటారు. రకరకాల కెమెరాలని చూసి చిన్నపిల్లాడిలా సంబరపడిపోయే వారు. అసలాయన అల్పసంతోషి. ప్రథమ కోపం ఉన్నప్పటికీ, అది అలా వచ్చి, ఇలా పోయేది. మనసులో కసి, ఈర్ష్య, అవతలి వారి చెడు కోరటంలాంటివి అసలు ఉండేవే కాదు. నా అనుభవంలో ఆయన ఎవరి గురించీ చెడుగా మాట్లాడటం విన లేదు. విమర్శించేవారు కానీ దాన్లో అక్కసు ఉండేదికాదు. అటువంటి అరుదైన స్వభా వాన్ని అలవర్చుకోవాలని నేనిప్పటికీ ప్రయ త్నిస్తూనే ఉంటాను.

## పెరటి నిండా మొక్కలే..

తోటపనిలో నేను మా నాన్నకి కుడి భుజంలా ఉండేదాన్ని. బావిలో నీళ్లు నేను తోడి ఇస్తే, ఆయన మొక్కలకి పోసేవారు. మా పెరటి నిండా మామిడి, జామ, సపోటా, పనస, బొప్పాయి, కొబ్బరి చెట్లు ఉండేవి. ఇక మల్లె, జాజి, సెంటుజాజి, పొగడ, పారిజాతంవంటి సువాసనలు వెద జల్లే పూలే కాక, రంగురంగుల అందమైన పూలచెట్లు ఎన్నో ఉండేవి. అవన్నీ నాకు స్నేహితుల్లా అనిపించేవి. రోజూ పొద్దున్న లేవగానే తోటలోకెళ్లి కొత్త పూలు ఏం పూశాయో చూసి, మా నాన్నకి చెప్పటమే

నా మొట్టమొదటి పని!

వేసవిలో మామిడికాయలు కోయటం మా ఇద్దరికీ ఒక పెద్ద కార్యక్రమంగా ఉండేది. నాన్న చెట్టెక్కి కాయలు కోసి కింద పడేస్తుంటే, నేలమీద పడకుండా ఒడుపుగా పట్టుకునేదాన్ని (త్రోబాల్ లో మంచి నైపుణ్యం ఉండేది అప్పట్లో నాకు!). పగిలిన కాయలు పప్పుకీ, పచ్చళ్లకీ, లేక పోతే పండబెట్టేందుకూ, ఆవకాయకీ! ఈ అనుభవం చదివేవాళ్లకి పెద్ద గొప్పగా అని పించకపోవచ్చు కానీ ఆ బావీ, ఆ చెట్లూ, అవన్నీ మనసుకి ఎంతగా హత్తుకుపోయా యంటే, అర్ధశతాబ్దం దాటినా అవే ఈనా టికీ నాకు కలల్లో కనబడుతూ ఉంటాయి.

కర్ణాటక సంగీతం విని ఆనందించే వారు. బాలమురళి, ఈమని, చిట్టిబాబు, పట్టమ్మాళ్, వసంతకుమారి అంటే ఆయన కిష్టం. కానీ తను హార్మోనియం వాయిస్తూ పాడుకునే పాటలు మాత్రం మరాఠీ రంగ స్థల గాయకులవి లేదా కె.ఎల్.సైగల్ వి. మా నాన్న కాళ్లతో హార్మోనియం వాయిం చేవారని ఎవరో రాశారు. అది అభూత కల్పన. ఆయన ప్రధానంగా సంగీత విద్వాంసుడు కాదు. తను రిలాక్స్ అవటం కోసం మాత్రమే పాడుకునేవారు.

మా నాన్నలో నేను గమనించిన మరో ప్రత్యేకత... కొత్త విషయాలని ఎప్పటిక ప్పుడు తెలుసుకోవాలన్న జిజ్ఞాస. తెలుసు కున్నదాన్ని అర్థం చేసుకుని, నలుగురితో పంచుకోవాలని కూడా అనుకునేవారు. విశ్లే షించుకునేవారు. ఇంట్లోనే భూతద్దాలూ, కార్డుబోర్డుతో చేసిన చిన్నా, పెద్ద గొట్టాలూ తీసుకొచ్చి, దుర్భిణులు తయారుచేసేవారు. వాటిలోంచి మేం చందమామలోని మచ్చల్ని చాలా స్పష్టంగా చూసేవాళ్లం. మాకవి బాగా కనిపించాయంటే ఆయనకి అమితమైన ఆనందం. 'చూడు ఎంత తెలి వైనవాడినో!' అనే ధోరణితో కాకుండా మా స్నేహితుడిలా ఆ ఆనందాన్నీ, 'థ్రిల్'నీ పంచుకునేవారు. అలాగే రష్యన్లు పంపిన మొట్టమొదటి స్పుత్నిక్ తాలుకు 'బీప్ బీప్' ని రేడియోలో మాకు వినిపించారు.

సాహిత్యం విషయానికొస్తే, 'ఫలానా పుస్తకం చదువు' అని ఎన్నడూ చెప్పలేదు. 'అరె, ఆ పుస్తకం నువ్వు చదవలేదా?' అనే వారు. వెంటనే అది చదవాలని అర్థం అయ్యేది. ఆసక్తికూడా కలిగేది. తన రచన లగురించి ఒక్కసారికూడా మా దగ్గర ప్రస్తావించినట్టు నాకు గుర్తులేదు. అందు కేనేమో పెళ్లయ్యేదాకా నేను మా నాన్న రచనలు చదవలేదు. ముందే చదివి ఉండాల్సిందని నాకనిపించింది! తెలుగు క్లాసిక్స్, రష్యన్ క్లాసిక్స్, అనువాదాలూ, ఇంగ్లీషు క్లాసిక్స్ ఇంట్లో ఉండేవి. వాటినే ఎక్కువగా చదివేవాళ్లం. మా నాన్న పుస్తకం 'నిత్యజీవితంలో భౌతికశాస్త్రం' మట్టుకే నేను చదివానేమో అప్పుడు.

నేను అనువాదకురాలిగా నిలదొక్కుకో వటం ఆయన చూడనేలేదు. మావారి ఉద్యోగరీత్యా లిబియాలో దాదాపు ఐదేళ్లున్నాం. అక్కడి విశేషాలన్నీ నెలకి రెండుమూడు ఉత్తరాలుగా అమ్మకీ, నాన్నకీ రాసేదాన్ని. నాకు చెప్పకుండా వాటిని 'వనిత' మాసపత్రికలో సీరియ ల్ గా వేయించారు. ఏదైనా చేస్తే తన పిల్లల దగ్గర కూడా గొప్పలు చెప్పుకునే వారు కాదు. అసలెవరి దగ్గరైనా గొప్పలు చెప్పుకోవటం ఆయన స్వభావమే కాదు.

సన్మానాలూ, సత్కారాల పట్ల ఆయనకి కొంచెం కూడా వ్యామోహం ఉండేది కాదు. రష్యన్ భాష నేర్చుకోవటానికి పనికి వచ్చే రికార్డులు ఆయనకి ఎవరో తెచ్చిస్తే, వాటిని వినేందుకు రికార్డు ప్లేయరు మర్నాడే కొనుక్కొచ్చేశారు. ఆ రోజుల్లో అది దుబారా ఖర్చే కానీ డబ్బు ఖర్చు గురించి ఆయన ఆలోచించలేదు. ఎప్పె



మూడు తరాలు: కొడవటిగంటి కుటుంబరావు, ఆర్. శాంత సుందరి (కుమార్తె), రామవరపు అరుణ (మనవరాలు)

రాంటో అనే ఇంగ్లిష్ భాషను నేర్చుకునేందుకు కొన్నినెలలపాటు క్లాసులకి వెళ్లారు. నేనుకూడా ఆయన దగ్గర ఆ భాషని కొద్దిగా నేర్చుకున్నాను! ఇప్పటికీ ఆభాష తాలూకు నోట్సు, మానాన్న రాసిపెట్టుకున్నవి, మా దగ్గర ఉన్నాయి.

**రోటిపచ్చళ్లూ.. వంటలూ...**

ఎప్పుడైనా వంట కూడా చేసేవారు. రోట్లో పచ్చడి, ఉత్తరభారతదేశం వంటకాలు చెయ్యటం లాంటివి. నాకు పెళ్లయి ఢిల్లీ వెళ్లాక చలికాలం మద్రాసు వస్తే ఆయనకోసం శల్‌గమ్ (నూల్‌కోల్ వంటి దుంప) తప్పకుండా తెచ్చేదాన్ని. ఆ శల్‌గమ్‌ని బాగా కడిగి, తరిగి, వండేవారు. అప్పట్లో మద్రాసులో దొరకని కాలీఫ్లవరు, గాజర్ వంటి కూరలు కూడా మేం ఢిల్లీ నించి తెచ్చేవాళ్లం. సెలవు రోజుల్లో మధ్యాహ్నాలు నేనూ, మా నాన్నా పెరట్లోని దోర బొప్పాయి కాయలు కోసుకు తినేవాళ్లం. ఒక్కోసారి వేయించిన శనగపప్పు, ఉల్లిపాయ ముక్కలూ కలిపి మసాలా శనగలు చేసేవారు. మా నాన్న మెప్పు పొందాలని చిన్నతనంలో నాకు చాలా ఉండేది. అందుకే ఆయన ఏమైనా కొత్తవిషయం చెప్పగానే, అది తిండికి సంబంధించిందైనా, ఇంకేదైనా కూడా వెంటనే దాన్ని ఎంతో ఇష్టంగా చేసేసేదాన్ని. అలా చెయ్యటంవల్లే అనుకుంటాను, చాలా విషయాల్లో కొత్త పరిస్థితులకీ, కొత్తచోట్లకీ అడ్జస్ట్ అయిపోవటం నాకలవాటయింది.

తన గురించి మరీ గొప్ప అభిప్రాయం ఆయనకి ఉండేదికాదు. చివరిదాకా కూడా ఇంకా తెలుసుకోవలసింది ఎంతో ఉందనే ధోరణే కనబరిచారు. అప్పుడప్పుడే రచనలు చెయ్యటం ప్రారంభించిన యువ రచయితలు వస్తే వాళ్లతో మనస్ఫూర్తిగా మాట్లాడేవారు. పత్రిక పెడుతున్నాం, కథో, వ్యాసమో రాసి పంపమంటే, ఆ పత్రిక

అసలు వస్తుందా? పారితోషికం ఎంతి స్తారు? అనే ప్రశ్నలు ఏవీ అడిగేవారు కాదు, వెంటనే పంపేసేవారు. ఎవరి దగ్గ ర్నించి ఉత్తరం వచ్చినా వెంటనే జవాబు రాసేవారు. కొన్ని సంకలనాల్లో 'రాత ప్రతి నుంచి' అని ఉంటుంది, అవి అచ్చు కాని వి, పత్రికలకి పంపినవే అయి ఉండాలి.

మా ఇంట్లో జెండర్ ప్రసక్తి, కులం, మతం గురించిన ప్రసక్తి ఎప్పుడూ వచ్చేది కాదు. అలాంటి వాతావరణంలో పుట్టిపెరి గిన నాకు, పెళ్లయి ఢిల్లీ వెళ్లాక, అక్కడ కూడా అదే వాతావరణం కొనసాగింది. మనుషులని కేవలం మనుషులుగా అభి మానించటమే మా పద్ధతి. నిజం చెప్పా లంటే, నేను కూడా ఒక కథో, కవితో నచ్చిందంటే, వాళ్ల అనుమతితో దాన్ని మరో భాషలోకి అనువదించటమే తప్ప, వాళ్లు ఏ కులస్థులో తెలుసుకోవాలన్న ఆలోచన రాదు. ఇప్పటికీ నేను అభిమా నించే కొందరు రచయితలు ఏకులం వారో నాకు తెలీదు, తెలుసుకోవాలనే కుతూహల మూ ఉండదు. కాలంతోపాటు అన్నీ మారినట్టే, సాహిత్యం కూడా మారుతుంది. వందేళ్లక్రితం రాసిన సాహిత్యాన్ని గురించి నేటి పరిస్థితికి అన్వయించి విమర్శించటం ఎంత తప్పో, ఇప్పుడు వచ్చే సాహిత్యాన్ని వందేళ్ల క్రితం వచ్చిన సాహిత్యంతో పోల్చటం కూడా అంతే తప్పని నేను అను కుంటాను.

మా నాన్న గొప్ప ఆశావాది. మా అమ్మ నాకు వంట నేర్పబోతే, 'దాన్ని ఇబ్బంది పెట్టకు, అది పెద్దదయేసరికి కమ్యూనిటీ కిచెన్స్ వస్తాయి!' అనేవారు. ఆయన ఆ మాట చెప్పి యాభై ఏళ్లయినా, ఇప్పటికీ అలాటివి ఎక్కడా కనబడటం లేదు! ఇదీ ఆయన ఆశావాదం. ఆయనకు కీర్తి కండూతి లేకపోవటంతో 'నా రచనలు పాఠకులు ఎంత త్వరగా చదవటం మానేస్తే నేనంత ఆనందిస్తాను', అనేట్టు చేశాయి. తన పేరుగాని, తన రచనలు కాని చిరస్థాయిగా నిలిచిపోవాలని ఆయన ఏనాడూ కోరుకోలేదు.

ఆయన వ్యక్తిత్వంలోని మరో అంశం గురించి చెప్పకపోతే ఈ వ్యాసం అసం పూర్తి అనిపించవచ్చు అది ఆయనని కొంత విమర్శకి కూడా గురిచేసిన అంశం. అదే ఆయన ప్రతిపాదించిన బుద్ధికొలత (Mind dimension) సిద్ధాంతం. విరసం ప్రచురణ, తాత్విక వ్యాసాలు, చదివి దీన్ని గురించి తెలుసుకోవచ్చు

### అసాధారణ అనుభవాలూ...

మా చిన్నతమ్ముడు ఆరేళ్ల వయసులో మెదడువాపు వ్యాధితో హఠాత్తుగా చనిపో యాడు. దాంతో ఆయన రక్తపోటు తీవ్రంగా పెరిగిపోయింది. మా తమ్ముణ్ణి చూడటానికి వచ్చిన ఆయన స్నేహితుడు, మా ఫ్యామిలీ డాక్టర్, గాలి బాల సుంద రావు, ముందుగా మా నాన్నని పరీక్షించి మందులిచ్చారు.

మా నాన్న ప్రాణానికి ముప్పు వాటిల్లు తుందని భయపడ్డానని ఆయన తరువాత మా అమ్మకి చెప్పారు. మా అమ్మ దుఃఖాన్ని తగ్గించేందుకు రకరకాల ప్రయ త్నాలు చేసే క్రమంలో ఆయనకు మృత్యువు, పునర్జన్మ, దెయ్యాలు వంటి విషయాల గురించి మరింత అధ్యయనం చెయ్యాలన్న కోరిక కలిగింది. తనకి అంత వరకూ కలిగిన అనుభవాలని ఈ కొత్త జిజ్ఞాసకి అన్వయించి చూసుకుంటే, ఇంత కుముందు కూడా తనకి అసాధారణ అను భవాలు కొన్ని కలిగినట్టు తెలిసింది. ఈ విషయం మీద రాసిన వ్యాసాలూ, పుస్త కాలూ చదివారు. ఇంగ్లండులో ఉండే ఒక దూరపు బంధువుకి (అతనికి మా తమ్ముడి వివరాలేవీ తెలీవు, వాణ్ణి

చూడను కూడా లేదు) మా తమ్ముడి చొక్కా గుండీని పంపించి, అక్కడి మీడియమ్ చేత వాడి 'ఆత్మ'తో మాట్లాడించి, ఉత్తరాల ద్వారా వాడు చెప్పిన మాటల్ని తెప్పించుకున్నారు. ఆశ్చర్యకరంగా కొన్ని వేల మైళ్ల దూరంలో ఉండే ఆ 'బ్రిటిష మీడియమ్' మాకు మాత్రమే తెలిసిన మా తమ్ముడి వివరాలు ఎన్నో చెప్పగలిగింది!

ఒకరి అనుభవాలు మరొకరికి ఎంత మాత్రం పనికిరావనీ ఆయన నమ్మేవారు. తను నమ్మినవి తన అనుభవాలకే పరిమితమనీ, అందరూ వాటిని నమ్మక్కర్లేదని, అవి తప్పని ఎవరైనా శాస్త్రీయపద్ధతిలో రుజువు చెయ్యగలిగితే తనకేమీ అభ్యంతరంలేదనీ చాలా స్పష్టంగా చెప్పారు. 'తాత్విక వ్యాసాలు' పుస్తకం నించి కొన్ని వాక్యాలు ఇక్కడ చెప్పటం సముచితం.



'చాలా కాలంగా నేను ఎదుర్కొంటున్న సమస్య ఏమిటంటే, అసాధారణ అనుభవాలను అబద్ధాలని చెప్పి కొట్టెయ్యటం అశాస్త్రీయం. అవి సాధారణమైన అనుభవాలేనని రుజువు చెయ్యాలి. లేదా వాటికి భౌతిక వాదంతో కూడిన వివరణ ఇవ్వాలి. లేకపోతే ఆ అనుభవాల చాటున ప్రజలలో ఆదర్శవాద విశ్వాసాలూ, మూఢనమ్మకాలూ తామర తంపరగా వ్యాపిస్తాయి. అసాధారణ అనుభవాల వెనక దైవిక శక్తులున్నాయని ప్రచారం జరుగుతుంది'

నాకు అనుభవంలోకొచ్చిన ఇటువంటి విషయాన్ని మీతో పంచుకోవాలని ఉంది. మేము లిబియా వదిలి ఇండియా వచ్చేస్తున్నప్పుడు యూరప్‌లో పర్యటిస్తూండగా, మా పదేళ్ల అమ్మాయి అరుణ, హఠాత్తుగా 'అమ్మా! మనం ఇండియా వెళ్లేప్పటికి తాతకి ఏమైనా అవుతుందనిపిస్తోంది!' అంది. అప్పుడు నేను దాన్ని పట్టించుకోలేదు. వారం తరువాత మేం మద్రాసు ఎయిర్‌పోర్ట్‌లో దిగగానే విన్న మొదటి వార్త, మా నాన్న ఇంక లేరని! అది ఆ మాట అన్న మర్నాడో, లేదో కొన్ని గంటల్లోనే మా నాన్న పోయారు. దీనికి సరైన సమాధానం నాక్కూడా తెలీదు.

మొత్తం మీద మా నాన్న 'చెప్పి' మాకు నేర్పిందానికన్నా 'చేతల' ద్వారా నేర్పినదే ఎక్కువని నమ్ముతాను. వాటిని వీలైనంతగా పాటించే ప్రయత్నమూ చేస్తున్నాను. మా అమ్మా, నాన్న, ఆ తరువాత నా భర్తా అందరూ చాలా క్రమశిక్షణ గలవారు. నాలో సహజంగా అది ఉండే ఉంటుంది. వీళ్ల సాహచర్యం వల్ల దాన్ని మరింత మెరుగుపరుచుకునే అవకాశం దొరికింది.

'నాకు పేరు అక్కర్లేదు, అవార్డులు అక్కర్లేదు, నా రచనలు వీలైనంత త్వరగా పాతబడిపోవాలి' అనుకునే మా నాన్న, శత జయంతి జరుపుకునే వరకూ అభిమానుల హృదయాలలో నిలిచి ఉండటం, ఆయన రచనలని పునర్ముద్రిస్తే అందరూ కొని చదవాలనుకోవటం, ఇవన్నీ ఒకవైపు ఆనందం అనిపించినా, మరోవైపు ఆయన ఆశించిన మార్పులు రానందుకు బాధగా కూడా ఉంది.

మా నాన్న నిరాడంబరత్వానికి నిదర్శనాలు, నేనూ, నా తమ్ముడూ. వటవృక్షం లాంటి ఆ మేధావి తన నీడతో మా వ్యక్తిత్వాలని ఆక్రమించుకోలేదు. మాకు కూడా మేమున్న రంగాలలో కొద్దో గొప్పో గుర్తింపు లభించింది. దీన్ని బట్టి మా నాన్న ఎంత నిగర్వో, ఎంత సరళమైన వ్యక్తో గ్రహించగలరు.

***(కొడవటిగంటి జయంతి ఈనెల 28న)***



# టీ, కాఫీలు అస్సలు తాగను

కొచ్చిన్‌లో పుట్టి పెరిగిన ఆమె దక్షిణ భారతదేశ సౌందర్య దేవత. 'అమ్మా నాన్నా ఓ తమిళ అమ్మాయి' సినిమాతో దశ తిరిగిన ఆ కేరళ కుట్టి డిగ్రీలో ఆంగ్లసాహిత్యం చదువుకుంది. తండ్రి జోసెఫ్, ఓ వ్యాపారి. తల్లి సెలైన్, ఎర్నాకులంలో డాక్టర్. ఆ సౌందర్యదేవత వేరెవరో కాదు అసిన్. మొదట్లో ఆమె కోల్గేట్ టూత్‌పేస్ట్, ఫెయిరెవర్ క్రీమ్‌కు మోడెలింగ్ చేసింది. తెలుగు తమిళ, మలయాళ, హిందీ సినిమాల్లో అగ్ర నటుల సరసన నటించింది. ఫిల్మ్‌ఫేర్ అవార్డులు పొందింది. తమిళనాడు ప్రభుత్వం ఇచ్చే కలైమామణి పురస్కారం సైతం ఆమెను వరించింది. దశావతారం, ఘజనీ, శివమణి తదితర సినిమాల్లో నటించిన అసిన్ తన అందం, ఆరోగ్యం గురించి ఇలా చెబుతోంది..

★ ఆరోగ్యానికి సంబంధించి నా రోజూవారి జాగ్రత్తలు చాలా సాధారణం. బాగా తింటాను. దానికి తగ్గట్టుగా ఎప్పుడు సమయం దొరికినా వ్యాయామం చేస్తాను. హృదయకండరాల ఎక్సర్‌సైజులు చేయడం నాకిష్టం. జిమ్ కూడా చేస్తుంటాను. చక్కటి శరీర సౌష్టవాన్ని కాపాడుకునేందుకు ఆరోగ్యంపై ఈ మాత్రం శ్రద్ధ అవసరం.

★ సాధారణంగా ఉదయం ఆరింటికే నిద్రలేస్తాను. రాత్రులు ఆలస్యంగా పడుకుంటే ఉదయం తొమ్మిదిలోపల లేస్తాను.

★ ఆహారం విషయంలో మరీ చాదస్తంగా ఉండను. ఎందుకంటే చిన్నదాన్నే కావడంతో నా జీర్ణక్రియ భేషుగ్గా ఉంది. అంత సులభంగా బరువు పెరగను. పిండిపదార్థాలు, మాంసపుకృత్తులు, మంచి కొవ్వు ఉన్న సమతుల ఆహారాన్ని తింటాను.

★ కచ్చితంగా పాటించే ఆహార నియమం చాలా పెందరాళే టిఫిన్ చేయడం. బ్రేక్‌ఫాస్ట్‌లో ఓ కప్ ఓట్స్, పండ్లు, రెండు గుడ్లు లేదా ఇడ్లీలు తీసుకోవడం.

★ మధ్యాహ్నం చపాతీలు, అన్నం, కూరగాయలు, సలాడ్, చికెన్ లేదా చేపలు తింటాను. చిరుతిండికి వస్తే పండ్లు, గింజలు తింటాను. ఇంకో ముఖ్య విషయమేమంటే టీ, కాఫీలు తాగను. పాలు, కొబ్బరినీళ్లు తాగుతాను.

★ షూటింగ్ లేని రోజుల్లో రాత్రిళ్లు ఏడుగంటలకే భోజనం చేస్తాను. అయితే సాధారణంగా అప్పుడు అన్నం తినను.

★ తీరికగా ఉన్న రోజున కంటినిండా నిద్రపోతాను. శరీరం, మనసూ రెండూ ఉల్లాసంగా మారుతాయి. మూడ్ బాగుంటే కాళ్లకు, తలకు ఆయిల్‌తో మసాజ్ చేయించుకుంటాను.

★ కార్బోనేటెడ్ డ్రింక్స్, చిరుతిళ్లు, వేపుళ్లకు దూరం. చిన్నచిన్నవాటికే మందులను తీసుకోను. అల్లోపతి అస్సలు ఉపయోగించను. అవసరాన్ని బట్టి ఆయుర్వేదాన్ని ఆశ్రయిస్తాను.

★ నేను పెరిగిన వాతావరణంవల్లనేమో కృత్రిమ ఆహార పదార్థాలు, మసాలాలు, చక్కెర పదార్థాలు, చాక్లెట్లు తినను. ఇంటినుంచి వచ్చిన అమ్మచేతి వంటకాలను షూటింగ్‌లకు కూడా బాక్సులో తీసుకెళతాను. స్వీట్లు ఒకటి లేదా రెండు ముక్క లు తప్ప తీసుకోను. విదేశీ చాక్లెట్లకంటే మన దేశపు జిలేబీ, లడ్డూ, మైసూర్‌పాక్, పాయసం తదితర స్వీట్లు నాకిష్టం.

★ నా ఫిట్‌నెస్ రహస్యం సూర్యనమస్కారాలో, యోగానో అనుకుంటున్నారా? నిజానికి ఇంటితిండి వల్లనే ఇలా అందంగా, ఆరోగ్యంగా నిగనిగలాడుతున్నాను. ఒకవేళ సినీరంగానికి రాకపోయినా నా ఆరోగ్యాన్ని, ఫిట్‌నెస్‌ను కాపాడుకునేదాన్ని అనడంలో సందేహమేలేదు. కారణం మా అమ్మానాన్నలు తమ ఆరోగ్యంపై తీసుకునే శ్రద్ధ నాకు కూడా అలవాటయింది.

★ రొయ్యలంటే ఇష్టం. గతంలో రకరకాల మాంసాహారాన్ని బాగా లాగించేదాన్ని. సినీరంగానికి వచ్చిన తర్వాత కేవలం చికెన్, చేపలు తప్ప వేరే ముట్టుకోడంలేదు. మాంసాహారానికి ఒక్కరోజైనా దూరంగా ఉండలేని నేను శాకాహారాన్ని ప్రోత్సహించే ఓ సంస్థ కార్యక్రమాన్ని తిరస్కరించాను కూడా.

★ శాకాహారంతో వెంట్రుకలు, చర్మం బాగా తయారవుతాయని గుర్తించాను. కేరళలో దొరికే పాలిష్ చేయని బ్రౌన్ రైస్ చాలా శ్రేష్ఠం.



★ క్లీన్సింగ్-టోనింగ్-మాయిశ్చరైజింగ్ ప్రక్రియలను చర్మసౌందర్యానికి అనుసరిస్తాను. గోరువెచ్చని నీటితో లేదా చన్నీటితో ముఖాన్ని శుభ్రం చేసుకుంటాను. సున్నితంగా ముఖాన్ని కడుక్కుంటాను. ఎలా పడితే అలా చర్మంపై రుద్దను.

★ కేరళలో సాంప్రదాయికంగా వచ్చిన కలారీ చిత్ర కళను అభ్యసించాను. దాన్ని ఇతరులకు కూడా నేర్పుతున్నాను. మంచి పుస్తకాలు చదవడం నా హాబీ. బీఏలో ఆంగ్ల సాహిత్యాన్ని చదివాను.

★ నాకిష్టమైన కాయగూర కారెట్. మామిడి, పనస, సీతాఫలం, అరటిపళ్లు అంటే ఇష్టం.

★ చివరిగా ఆహార్యానికి సంబంధించి నేను సౌకర్యవంతంగా ఉండే, అందంగా కనిపించే, హాయిగా నప్పే డ్రెస్సులను వేసుకుంటాను. విపరీతమైనపోకడలకు పోను.

-కెఆర్‌జి



# సామ్రాజ్యవాదంపై నిప్పులు చెరిగిన రాంధారీ సింహ్ దినకర్

## 1908 - 1974

**కాల్పనిక దృక్పథం, సౌందర్య కల్పన, ఆత్మాభివ్యక్తి ముఖ్య భూమికలుగా హిందీ సాహిత్యం వర్ధిల్లుతున్న తరుణంలో మొదట్లో ఛాయావాదం వైపు మొగ్గు చూపి ఆ మార్గంలో ఖ్యాతి పొందినా, అనతి కాలంలోనే వీర రసావేశంతో దేశభక్తి ప్రపూర్ణ కవితలు సృజించిన మహాకవి రాంధారీసింహ్ దినకర్. సామాజికాంశాలకు పెద్దపీట వేసి అభ్యుదయవాదిగా, స్వాంతంత్ర్య భావోద్దీపకుడుగా సామ్యవాదం, సంఘహితం, పరపీడనా నిర్మూలనం ప్రబోధించిన దినకర్ గాంధీని అభిమానిస్తూనే తనను తాను 'బ్యాడ్ గాంధీయన్'గా హాస్యధోరణిలో వర్ణించుకోవడం విశేషం. 1961లో వెలువడిన ఆయన 'ఊర్వశి' మహా కావ్యానికి 1972లో జ్ఞానపీఠ పురస్కారం లభించింది. ఆయన చేపట్టిన ఉన్నత పదవులు తన కావ్యాలను జ్వాలామాలికలతో నింపడంలో ఎన్నడూ అడ్డురాలేదు.**

దినకర్ జననం 1908 సెప్టెంబరు 23న, బీహారు రాష్ట్రం బేగుసరాయ్ జిల్లా, సిమరియా గ్రామంలో. వారిది పేద భూమిహార్ కుటుంబం. స్థానిక పాఠశాలలో విద్యాభ్యాసం ఆరంభమయింది. ముఖ్మాఘాట్ పాఠశాలలో చదివి ఎంట్రెన్సు పరీక్ష ఉత్తీర్ణుడయ్యాడు. బాల్యంనుంచీ విస్తారంగా పుస్తకాలు చదివేవాడు. పాట్నా విశ్వవిద్యాలయం నుంచి బి.ఏ. (ఆనర్స్) పట్టం స్వీకరించాడు. అప్పటికే సాహిత్యాభిలాష, రచనాసక్తి ఎంతగానో పెరిగాయి. చరిత్ర, రాజనీతి శాస్త్రం, తత్త్వశాస్త్రం అభిమాన అధ్యయనాంశాలయ్యాయి సంస్కృతం, హిందీ, ఉర్దూ, మైథిలీ, బెంగాలీ, ఇంగ్లీషు భాషల్లో అసాధారణ పాండిత్యం సముపార్జించుకున్నాడు. రవీంద్రుడు, ఇక్బాల్, కీట్స్, మిల్టన్, కాళిదాసు, వివేకానంద, మార్క్స్, తిలక్, గాంధీ మున్నగువారి రచనల్ని లోతుగా అధ్యయనం చేశాడు. మైథిలీ శరణ్ గుప్తా, సుమిత్రానందన్‌పంత్, రాంనరేష్ త్రిపాఠీ తదితర గొప్పవారి రచనల్ని అభిమానించాడు. దినకర్ అధ్యాపకుడుగా ఉద్యోగ జీవితం ప్రారంభించాడు. కొంతకాలం సబ్ రిజిస్ట్రారుగా, సమాచార పౌర సంబంధాల శాఖ ఉపసంచాలకుడుగా పనిచేశాడు. పిమ్మట ముజఫ్ఫర్‌పూర్ కళాశాలలో ఆచార్య పదవి చేపట్టారు. భాగల్పూర్ విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులుగా ఉత్తమ సేవలందించారు. కేంద్ర ప్రభుత్వ హిందీ సలహాదారుగా విశేష కృషిచేశారు. దినకర్ 1952 నుంచి 1964 వరకు సుదీర్ఘకాలం రాజ్యసభ సభ్యులుగా వ్యవహరించి అందరి మన్ననలందుకున్నారు.




1928 నుంచి దినకర్ నాలుగు దశాబ్దాలకు పైగా హిందీ సాహిత్యక్షేత్రాన్ని సస్యసంపద్విల

సితం చేశారు. దీర్ఘకావ్యాలు, ఖండకావ్యాలు, కవితా సంపుటాలు, వ్యాసాలు, విమర్శలు, అనువాదాలు, బాలసాహిత్యం, యాత్రచరిత్రలు మొదలైనవి డెబ్భైకి పైగా కృతులు వెలయించాడాయన. 'విజయసందేశ్' ఆయన తొలిరచన. 'హరెకొహరినామ్' ఆయన 1970లో రచించిన కడపటి కావ్యకుసుమం. భారతదేశంపైన, సంస్కృతిపైన, స్వాతంత్ర్య భావనపైన దినకర్‌కు అపారప్రేమ. దేశభక్తి ఆయనలో మూర్తీభవించింది. వీరరస చిత్రణలో ఆయనకు ఆయనే సాటి. దేశప్రజల్ని స్వరాజ్యోద్యమానికి సమాయత్తం చేసేందుకు దినకర్ కవితను శక్తిమంతమైన సాధనం చేసుకున్నారు. కవితల్లో అభివ్యక్తి, నైశిత్యం, భావతీవ్రత ప్రస్ఫుటమవుతాయి. 'హిమాలయ్' అనే కవిత నుంచి నాలుగు పంక్తులు: "లే అంగడాయి ఉఠ్ హిలే ధరా/ కర్ నిజ విరాట్‌స్వర్‌మేఁ నినాద్/ తూ శలరాట్!/ హుంకార్ భరే/ ఫట్‌జాయ్ కుహాభాగే ప్రమాద్" (హిమనగమా! నీ గాఢనిద్ర విరమించు. జగతి దద్దరిల్లేటట్లు గంభీర స్వరంతో నినదించు, జనంలో సోమరితనం అంతం చేసి విచక్షణ పెంచు). 'రశ్మిరథి', 'కురుక్షేత్ర' కావ్యాలు మహాభారత స్ఫూర్తితో రాసినవి. దినకర్ వాటిని తన జాతీయతాభావావిష్కరణకు వాడుకున్నాడు. సమసమాజ స్థాపనాధ్యేయాన్ని కర్ణుని పాత్ర చిత్రణ ద్వారా 'రశ్మిరథి'లో అత్యద్భుతంగా ప్రదర్శించారు. 'హుంకార్'లో దినకర్ విప్లవ శంఖాన్ని మోగించాడు. 'నయీదిల్లీ' జాతీయతా భావ సమన్వితం. విజయ సాధనకు శస్త్రపాణులు కావాలని ఎలుగెత్తి ప్రకటించేందుకు దినకర్ వెనకాడలేదు. చైనా దండయాత్రపై నిప్పులు చెరిగే కావ్యం 'పరశురామ్‌కీ ప్రతీక్షా'లో 'జాతీయ గర్వపర్ క్రూర్ ప్రహర్ హువాహై/ మాఁకే కిరీట్ పర్ హీ యహ్‌వార్ హువాహై/ అబ్ జో సిర్‌పర్ ఆపడే నహీఁ డర్‌నాహై/ జన్మహైఁతో దోబార్ నహీఁ మర్‌నాహై (జాతి ఆత్మగౌరవానికి భంగం వాటిల్లింది. మాతృమూర్తి కిరీటంపై దాడి జరిగింది. ఇంతకు మించి మరే ఆపద రాదు. మనిషికి మరణం ఒక్కసారే వస్తుంది) అని గర్జించాడు. రేణుక, ద్వంద్వగీత్, ఊర్వశి బాపు, ఇతిహాస్‌కె ఆఁశూ, మిర్చీ కా మజా, నీల్ కుసుమ్, కలిశ్రీ, నయే సుభాషిత్, కోయిల్ ఔర్ కవిత, ఆత్మకీ ఆఁఖే, అర్ధనారీశ్వర్, ఉజీ ఆగ్, సంస్కృతికే చార్ అధ్యాయ్, కావ్యకీ భూమిక, హేరామ్, భారతీయ ఏక్తా, ఆధునిక్ బోధ్ మొదలైన రచనల్లో దినకర్ బృహద్రూపం బహిర్గతమవుతుంది.

రాంధారీసింహ్ దినకర్‌కు ఉత్కృష్ట జ్ఞానపీఠ పురస్కృతిని చేకూర్చిన 'ఊర్వశి' మహాకావ్యంలో ముఖ్యపాత్రలు అప్సరస ఊర్వశి, చక్రవర్తి పురూరవుడు. దినకర్ తన సహజ వీరరస ప్రధాన కావ్య రచనా సంవిధానానికి భిన్నంగా ఈ ప్రేమోదంతాన్ని స్వీకరించినా, స్త్రీ పురుషుల మధ్య ప్రేమ సమస్యను తార్కిక దృష్టితో పరిశీలించాడు. రచన నాట్య శైలిలో సాగింది. ఇది ప్రతీకాత్మక కావ్యం. దినకర్ సుదీర్ఘ పరిశోధనల ఫలితం ఈ కృతి. సముదాత్త నిష్కామకామాభివ్యక్తి, తాత్త్విక చింతన ఇందులో కానవస్తాయి. మాతృత్వ మహనీయత ద్యోతకమవుతుంది. శృంగార రసాన్ని ఆధ్యాత్మిక సోపానాలపై నడిపించాడు. బీజప్రాయంగా కథా వస్తువును స్వీకరించి, దీనినొక మహత్కార్యంగా సృజించాడు.

రుషి సంప్రదాయాన్ని సమున్నత పీఠంపై అధిష్ఠింపజేస్తూ అంటాడు- 'పూఛోమత్, వైసేతో, రుషికీ ప్రకృతి తనిక్ కోపన్‌హై/ మన్‌కీ రచనామేఁ కుఛ్ అధిక్ అంశ పావక్ కా/ కింతు నారియోఁ పర్ సచ్‌ముచ్, ఉన్‌కీ అపార్ శ్రద్ధాహై/ ఔర్ సహజ్ ఉతనీ హీ వాత్సల్యతా నిరీహ శిశు ఓ పర్? ' కొద్దిపాటి ఆగ్రహం రుషికి సహజం. మనస్సు మాత్రం నిర్మలం. స్త్రీలపైన అపారానురాగం, శిశువులపై అంతే వాత్సల్యం వుంటుందని ఒక పాత్ర ద్వారా పలికిస్తాడు.

హిందీ సాహిత్యంలో విశిష్ట స్థానాన్ని అలంకరించిన దినకర్ అనేక సత్కారాలందుకున్నాడు. ఆయనకు జాతీయకవి గౌరవమిచ్చి జాతి సన్మానించింది. కాశీ నాగరీ ప్రచారణీసభ, కేంద్ర సాహిత్య అకాడమీ, ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం, బీహార్ రాష్ట్ర భాషా పరిషత్తు, ప్రయాగ సాహిత్యకార్ సంసద్ ఇత్యాదులు దినకర్‌ను ఘనంగా సత్కరించాయి. భాగల్పూరు విశ్వవిద్యాలయం గౌరవ డాక్టరేటు ఇచ్చింది. భారత ప్రభుత్వం 'పద్మభూషణ్' గౌరవమిచ్చింది. ఉదయపూర్‌లోని రాజస్థాన్ విద్యాపీఠం 'సాహిత్య చూడామణి', గురుకుల మహా విద్యాలయ 'విద్యావాచస్పతి' బిరుదాలిచ్చాయి. ఆయన కృతులు అనేక దేశీయ, విదేశీ భాషల్లోకి అనువదితాలయ్యాయి.

1974 ఏప్రిల్ 24న పరమపదించిన రాంధారీసింహ్ దినకర్ యశస్సు భారతీయ సాహిత్యంలో స్వర్ణాక్షర లిఖితమై శోభిల్లుతోంది.

*–గోవిందరాజు రామకృష్ణారావు*

# 'లై' డిటెక్టర్

యర్రంశెట్టి శాయి



(గత సంచిక తరువాయి)

**"నే**న్నమ్మను"

"అయ్‌కాన్ట్ హెల్ప్‌ట్"

కాసేపు ఇద్దరూ ఫోన్లో గొడవ పడ్డారు.

"ఒకే, అదంతా నాకనవసరం! నువ్ ఇప్పుడు వెంటనే ఇంటికి రావాలి"

"ఎందుకు? "

"వచ్చాక చెప్తాను"

"సరే"

గంటలో ఇంటికి చేరుకున్నాడు రమేష్.

ఈలోగా ఆ మెషిన్ ఎలా పని చేస్తుందో 'యూజర్ మాన్యువల్'లో చదివి బైహర్ట్ చేసింది షైనీ.

"ఇవిగో, వీటిని న్యూమోగ్రాఫ్స్ అంటారు. వీటిని కాండేట్ ఛాతికి చుట్టి ప్రశ్నించటం మొదలు పెట్టాలన్నమాట! ప్రశ్నించటంలో కూడా రకరకాల పద్ధతులుంటాయ్. సాధారణంగా ఎక్కువమంది వాడే పద్ధతి పేరు 'కంట్రోల్ కొశ్చెన్ టెస్ట్' అంటారు. అంటే సడెన్‌గా, డైరెక్ట్‌గా కొశ్చెన్ చేయటమన్నమాట"

తనకు లైడిటెక్టర్ టెస్ట్ చేయబోతున్న విషయం తెలుసుకునేసరికి రమేష్ పెద్దఎత్తున ప్రొటెస్ట్ చేశాడు.

"నేనేదో క్రైమ్ చేసినట్లు ఈ టెస్ట్‌లేమిటి? నేనొప్పుకోను" అన్నాడు గాబరాగా.

"ఒప్పుకోకపోతే నీకూ ఆ సుచిత్రకూ ఎఫైర్ ఉందని ఒప్పుకో" అంది చాముండేశ్వరి ఆవేశంగా.

"యస్, లైడిటెక్టర్ టెస్ట్ జరగాల్సిందే!" అంది రమేష్ అత్తగారు. మగాళ్ళెవరూ ఏమీ మాట్లాడటం లేదు. 'రేపు మన పరిస్థితేంటి? ' అనే షాక్‌లోకెళ్ళిపోయారు.

చివరకు రమేష్ లై డిటెక్టర్ టెస్ట్‌కి ఒప్పుకోక తప్పలేదు.

ఆ మిషన్ చైనాలో తయారయిందయినా అందులో సైరన్ ఫెసిలిటి ఉంది.

"ఆ మిషన్ తగిలించాక మనం వేసిన ప్రశ్నకి ఎవరయినా అబద్ధం చెప్తే చాలు-మిషన్ వెంటనే ఫ్యాక్టరీ సైరన్‌లాగా అరుస్తుంది. ఒకవేళ కాండేట్ నిజం చెప్తే-నిశ్శబ్దంగా ఊరుకుంటుంది" అంది షైనీ.

మిగతా వాళ్ళకెవరికి ఎక్స్‌పీరియెన్స్ లేదు గనక షైనీకే రమేష్‌ని కొశ్చెన్ చేసే అధికారమిచ్చింది చాముండేశ్వరి.

రమేష్ పరిస్థితి చూస్తే మాకందరికి చాలా జాలిగా ఉంది. అతనో బలిపశువులా కనిపించాడు మాకు.

"చూడు రమేష్! ఇప్పటికయినా మించింది లేదు. అందరి ఎదురుగ్గా అబద్ధాలకోరుగా ప్రూవ్ చేసుకోవటం కంటే మీ మిసెస్‌తో సీక్రెట్‌గా మాట్లాడుకుని రాజీకి రావటం మంచిది. ఏమంటారు? " అడిగింది షైనీ, పెద్ద పోలీసాఫీసరులాగా.

రమేష్ సంగతేమోగానీ ముందు మా మగాళ్ళందరికీ చెమటలు పట్టేస్తున్నాయ్.

రమేష్ మొఖంలో కూడా భయం స్పష్టంగా కనబడుతోంది.

"సో" అంది షైనీ తన వాచ్ చూసుకుంటూ.

"మీరు లైడిటెక్టర్‌ని ఫేస్ చేయడానికి నిర్ణయించుకున్నారన్నమాట" అందామె.

"యా!" అన్నాడు రమేష్ జీరగొంతుతో.

"కంగ్రాచ్యులేషన్స్ రమేష్! మన అపార్ట్‌మెంట్స్‌లో ఈ 'లైడిటెక్టర్' టెస్ట్‌కి ఎన్నికయిన మొదటి కాండేట్ మీరే! మీ పేరు మన అపార్ట్‌మెంట్స్ చరిత్రలో గోల్డ్ కలర్ అక్షరాలతో లిఖించబడుతోంది" అందామె.

రమేష్ పరిస్థితి ఇంకా దిగజారింది.

షైనీ మిషన్‌కున్న రెడ్ బటన్ ప్రెస్ చేసింది. వెంటనే మిషన్ చిన్నపాటి శబ్దంతో 'ఆన్' అయింది.

షైనీ కొశ్చెన్‌ని షూట్ చేసింది.

"మిస్టర్ రమేష్! మీకూ మీ కొలీగ్ సుచిత్రకూ సంబంధం ఉంది కదూ? "

రమేష్ కంగారుగా "లేదు! అలాంటిదేమీ లేదు" అన్నాడు.

అతనిమాట పూర్తవకుండానే మిషన్ సైరన్ పెద్దగా మోత పెట్టింది.

షైనీ విజయ గర్వంతో చాముండేశ్వరి వేపు చూసింది.

"చూశారా... మీ అనుమానం నిజమే! రమేష్ అబద్ధం చెప్తున్నాడు" అందామె.

"దిసీజ్ టూమచ్. అలా సైరన్ మోగి



నంతమాత్రాన నేను అబద్ధం చెప్పాననటం అన్యాయం" అన్నాడు రమేష్ గొడవచేస్తూ.

"చూడండి రమేష్! మనిషి అబద్ధం చెప్తాడుగానీ మిషన్ ఎప్పటికీ అబద్ధం చెప్పదు" అంది షైనీ.

"ఇప్పుడేమంటారు? " అంది చాముండేశ్వరి రమేష్‌ని నిలదీస్తూ.

"ఇలాంటి అల్లుడిని ఉప్పు పాతర వేయాలి" అందతని అత్తగారు కోపంగా.

"చాముండీ! ప్లీజ్ బిలీవ్ మీ! మన పెళ్ళయాక నేను ఎప్పుడయినా ఒక్కసారయినా అబద్ధం చెప్పానా? ఒక్కసారి ఆలోచించు! ఇంతకాలంలేంది ఇప్పుడెందుకు అబద్ధం చెప్తాను? "

"నువ్వెన్నయినా చెప్పు! నీ మాటలయితే నమ్మేదాన్నేమోగానీ లైడిటెక్టర్ ఇంత స్పష్టంగా చెప్పాక నిన్ను ఛస్తే నమ్మను"

"ఆ మిషన్ కరెక్ట్‌కాదు చాముండీ!"

"అక్కడికి నువ్ కరెక్ట్ అయినట్లు" అంది అత్తగారు.

ఇంక లాభంలేదని జోక్యం చేసుకున్నాడు హమీద్‌మియా.

"మిస్టర్ రమేష్! ఇస్ దునియామే అందరూ తప్పులు చేస్తయ్! లేకిన్ ఆ తప్పులు మనం రిపీట్ చెయ్యవ్! తప్పు చేసినందుకు రిపెంట్ అవుతయ్! సారీ చెప్తయ్! కాంప్రమైజ్ అవుతయ్" అన్నాడు వచ్చే సొసైటీ ఎన్నికల్లో తనకు పడే లేడీస్ ఓట్లు దృష్టిలో పెట్టుకుని.

లేడీస్ అంతా తప్పట్లు కొట్టారు.

"మాకు సరిగ్గా అర్థం కాపోయినాగానీ చాలా బాగా చెప్పారు హమీద్‌గారు" అంది మంజులత.

షైనీ రమేష్‌కి చుట్టిన వైర్లు తీసేసింది.

అతను వాడిపోయిన మొఖంతో అక్కడి నుంచి వేగంగా వెళ్ళిపోయాడు.

లేడీస్ చాముండి చుట్టూ మూగారు.

"పట్టుదలతో మీ హజ్‌బెండ్ అబద్ధాలకోరని రుజువు చేశారు. యూ ఆర్ గ్రేట్" అందీ సీతావరదరాజన్.

"మరి మీ ఫ్యూచర్ కోర్స్ ఆఫ్ యాక్షనేంటి? " అడిగిందొకావిడ.

"ఇంకా డిసైడ్ చేసుకోలేదు"

"ఈ ఒక్కసారికీ వార్నింగిచ్చి వదిలెయ్యండి. మీకు అంత మంచి మొగుడు ఇంకోడు దొరకాలంటే కష్టం" అంది షైనీ.

"అదే అనుకుంటున్నా" అందామె.

ఆ రాత్రి అపార్ట్‌మెంట్స్‌లో మగాళ్ళెవరికీ నిద్రపట్టలేదు. నెక్స్ట్‌టర్న్ ఎవడికొస్తుందో అన్న భయంతోనే తెల్లార్లూ గడిపారు.

"వీలయినంతవరకూ పెళ్ళాంతో నిజాలు చెప్పటమే మంచిది" అన్నాడు శంకరమూర్తి, మర్నాడు ఉదయం విజయ్‌యాదవ్ కలిసినప్పుడు.

"అదే ఆలోచిస్తున్నా! కానీ అన్నీ నిజాలే చెప్తే కొంప కొల్లేరవుతుంది కదా!"

"ముందు నుయ్యి- వెనుక గొయ్యి" అన్నాడు కృష్ణమూర్తి.

అందరూ భయపడుతున్నట్లే ఆ రాత్రి



రెడ్డి రెడ్‌హాండెడ్‌గా వాళ్ళావిడకి దొరికిపోయాడు. ఆ రాత్రి అతను ఇంటికి చేరుకునేసరికి పదకొండయింది.

"నిజం చెప్పండి! ఎక్కడున్నారు ఇంతసేపూ? " నిలదీసింది వాళ్ళావిడ.

"ఆఫీస్‌లో కొంచెం పనెక్కువుండి..." అంటూ గొణిగాడు రెడ్డి-

"ఆఫీస్‌లో మీ పక్క సీటతనే ఇందాక మీ కోసం ఫోన్ చేశాడు" అందామె.

రెడ్డి షాకయ్యాడు.

"అలాగా! అదేంటి? నేను బాస్ రూమ్‌లో కూర్చుని ఫైల్స్ గురించి డిస్కస్ చేస్తున్న విషయం అతనికి తెలీదేమో"

"నిజం చెప్పండి మీరు కూర్చుంది బాస్ రూమ్ కాదు! బార్ రూమ్! బార్‌కెళ్ళి మందుకొట్టి వచ్చారు కదూ? "

"మందా? ఏం మాట్లాడుతున్నావే.. నేను మందు కొట్టటమా? అసలా టేస్ట్ ఎలా ఉంటుందో తెలీదు మనకి"

"అదుగో చూడండి! గప్పున వాసన కూడా కొడుతోంది"

"ఛఛ! అది కారా కిళ్ళీ వాసనే"

"అలాగా! మరి మీ మొఖంలో అంత సంతోషం ఎందుకు కనబడుతోంది?

ఇంటికొచ్చేముందు డి(పెస్డ్‌గా, చిరాకుగా వస్తారు కదా రోజూనూ! నన్ను చూస్తేనే మొఖం అదోలా పెడతారుకదా"

రెడ్డి కంగారుపడ్డాడు!

"నా మొఖంలో సంతోషం కనబడు తోందా? ఇంపాజిబుల్! నేను నార్మల్‌గా డి(పెస్డ్‌గానే ఉన్నా"

"సరే ఇదంతా ఎందుకు? మీరు మందు కొట్టలేదంటారు, అంతేకదా!"

"ఎగ్జాక్ట్‌లీ"

"అయితే రేపు లైడిటెక్టర్ టెస్ట్‌చేద్దాం"

రెడ్డి అదిరిపడ్డాడు.

"ఏంటీ? నాకు లైడిటెక్టర్ టెస్టా? "

"అబద్దాలు చెప్పారు కాబట్టి తప్పదు"

"ఇది టూమచ్"

"మీరు మందుకొట్టటమూ టూమచ్చే"

ఇద్దరు మర్నాడు సాయంత్రం వరకూ గొడవపడ్డారు. ఆ గొడవ మామూలుగానే పెరిగి పెద్దదయి షైనీ నోటీస్ కొచ్చింది.

వెంటనే లైడిటెక్టర్ టెస్ట్ ఏర్పాటు చేసిం దామె. ఏం జరుగుతుందో అని మళ్ళీ అందరం మూగాం.

రెడ్డిని లేడీస్ అంతా బలవంతంగా తీసు కొచ్చి కూర్చోబెట్టి వైర్లు తగిలించారు.

రెడ్డిని కొశ్చెన్ చేసేముందు షైనీ, సీతా వరదరాజన్, మంజులతా, బొషాషా ఓ మూలకెళ్ళి అతన్నెలా కొశ్చెన్ చేయాలా అ ని డిస్కస్ చేసుకోసాగారు.

"ఇలాంటి వాళ్ళను మామూలుగా కొశ్చెన్ చేయకూడదు. వీళ్ళకోసం 'గిల్టీ నాలెడ్జ్ టెస్ట్' అని ఇంకోరకం ఉంది. ఆ పద్ధతిలో చేస్తేనే దొరికిపోతారు" అంది మంజులత.

"గిల్టీ నాలెడ్జ్ టెస్ట్ పద్ధతిలో కొశ్చెన్స్ ఎలావుంటాయ్? " అడిగింది సీత.

"అవతలివాడు కొంచెం ముదురు కేస్ అయినప్పుడు ఆ పద్ధతిలో కొశ్చెన్ చేయా లన్నమాట! అంటే వాడు ఆ పని చేసినట్టు గానే భావించి కొశ్చెన్ చేయాలి. ఫరెగ్జాం పుల్ దొంగనోట్లు ప్రింట్ చేశాడని అను మానం ఉన్నవాడిని ఈ మిషన్ మీద టెస్ట్ చేస్తున్నామనుకో.. అప్పుడు 'నువ్ ప్రింట్ చేస్తోంది వందనోట్లా, అయిదొందల నోట్లా, వెయ్యినోట్లా? ' అని అడగాలి. దాంతో అతను అబద్ధం చెప్పాలంటే చాలా కష్టపడాల్సి వస్తుంది గనుక తేలిగ్గా పట్టు బడిపోతాడన్నమాట"

తర్వాత వాళ్ళంతా రెడ్డి దగ్గరకొచ్చారు.

రెడ్డి ముఖంలో అప్పటికే భయం, ఆందోళన కనబడుతున్నాయ్.

"ఎందుకొచ్చింది తాగానని ఒప్పేసుకో. ఈ రోజుల్లో తాగనోడెవడు? " శంకర మూర్తి రహస్యంగా రెడ్డి చెవికొరికాడు. కా నీ రెడ్డి ఒప్పుకోలేదు.

"ఇలా ఒక్కరోజు ఒప్పుకున్నాననుకో. ఇకనుంచి తాగకపోయినా రోజూ తాగా నని గొడవ మొదలెడుతుంది మా మిసెస్. ఆవిడ కొంచెం ఛాన్సిస్తే నెత్తినెక్కి కూర్చునే టైపు"

షైనీ రెడ్ బటన్ ప్రెస్ చేసింది.

"చూడు మిస్టర్ రెడ్డీ! మీరు నిన్న తాగింది క్వార్టరా, హాఫా, ఫుల్లా? "

రెడ్డి అబద్ధం చెప్పడానికి నిజంగానే కొంచెం తగ్గుల్సి ... 

"అస్సలు తాగలేదంటే ఆ ప్రశ్నేంటి? "

దాంతో మిషన్ పెద్దగా అరిచింది.

ఆడాళ్ళందరి మొఖాల్లోనూ 'విజయ గర్వం' వీరవిహారం చేసింది.

"ఇలాంటి అబద్ధాల కోరుతో సంసారం నావల్ల కాదు" అంటోంది రెడ్డి భార్య.

రెడ్డి పరిస్థితి చూడలేక మేం అక్కడి నుంచి దూరంగా వెళ్ళిపోయాం.

ఆ రాత్రి మళ్ళీ మగాళ్ళందరం టెర్రెస్ మీద చీకట్లో సీక్రెట్ మీటింగ్ పెట్టాం.

"పరిస్థితి, డేంజరస్ హై! అప్‌నే లోగ్ ఇమీడియెట్ యాక్షన్ చేయాలె! లేకుంటే

మగాళ్ళందరికీ బేయిజ్జత్ అవుతాయ్" అన్నాడు హమీద్‌మియా.

డి-బ్లాక్‌లో ఉండే ప్రొఫెసర్ నారాయణ్ గౌడ్ ఒక అయిడియా చెప్పాడు.

"ఈ పాలిగ్రాఫ్ టెస్ట్‌లకు చట్టబద్ధత లేదు. ఈ టెస్ట్‌లన్నీ ఇంతవరకూ సైంటిఫిక్‌గా రుజువు చేయలేదెవరూ! అందుకనే పోలీసులు వీటిసాయం తీసుకుంటారు గానీ వీటి ఫలితాల ఆధారంగా కేస్‌లు పెట్టలేరు. ఇలాంటిపరిస్థితుల్లో మన అపార్ట్‌మెంట్స్‌లో ఉపయోగిస్తున్న లైడిటెక్టర్‌ని మనం యాక్సెప్ట్ చేయకూడదు. కోర్టుల్లో కూడా వీటిని ఒప్పుకోరు" అంటూ అతను వివరిస్తుంటే మా మగాళ్ళందరిలో పోయిన ప్రాణం తిరిగి వచ్చింది.

"మరి మీరు సైలంట్‌గా ఉంటే ఎలా సార్? ఇవన్నీ షైనీకి చెప్పండి!"

ప్రొఫెసర్ గాబరాగా "షైనీకా! నోవే..!"

"ఎందుకని? "

"ఆమె వినే టైప్ కాదు! కుందేలు-మూడేకాళ్ళు టైప్!"

"మరామెలోని ఈ మూఢనమ్మకాన్ని పోగొట్టటమెలా? " అందరూ ఆలోచనలో పడ్డారు.

చివరకు విజయ్‌యాదవే సలహా ఇచ్చాడు.

"మా చిన్నాయన ఒకాయన 'లైడిటెక్టర్' టెస్ట్‌లు చేయటంలో ఎక్స్‌పర్ట్! ఆయన్నీ ఒకసారి మన అపార్ట్‌మెంట్స్‌కి పిలిపించి లైడిటెక్టర్ మీద మన అపార్ట్‌మెంట్ లేడీస్‌కి ఒక లెక్చెర్ ఇప్పిద్దాం!"

అందరూ ఏకగ్రీవంగా ఒప్పుకున్నారు.

మర్నాడు ఆ వార్త షైనీకి చెప్పాడు హమీద్‌మియా.

"కానీ మా లేడీస్‌ని ఈ విషయంలో ఎడ్యుకేట్ చేయాలని మీరెందుకు ఇంట్రెస్ట్ తీసుకుంటున్నట్లు? " అడిగిందామె.

హమీద్‌మియా జవాబు చెప్పడానికి కంగారుపడుతూంటే శంకరమూర్తి అందుకున్నాడు.

"సంగతేంటంటే.. ఇది ఈ మిషన్‌ని ఇంకా విరివిగా వాడ్డానికి ఏర్పాటు చేసిన అవగాహన సదస్సు అన్నమాట! మన అపార్ట్‌మెంట్ లేడీస్ కదాని మన ప్రెసిడెంట్ గారికి సాఫ్ట్ కార్నర్-"

ఆ ఆదివారం పోలీసాఫీసరు వచ్చాడు.

"నిజం చెప్పాలంటే ఈ పాలిగ్రాఫ్ టెస్ట్‌లనేవి టోటల్‌గా బోగస్. అందుకే వీటిని కోర్టుల్లో యాక్సెప్ట్ చేయరు. అదీగాక ఈ మిషన్‌ని ఇంతవరకూ సైంటిఫిక్‌గా ఎక్కడా- ఎవరూ- కరెక్ట్ అని ప్రూవ్ చేయలేకపోయారు. కనుక మీరు దీంతో పరీక్షలు జరిపి ఫలానా వాళ్ళు అబద్ధం చెప్తున్నారు అని అనటం రాంగ్..."

నిశ్శబ్దంగా వింటున్న లేడీస్ ఒక్కసారిగా లేచి నిలబడి కేకలు వేశారు.

"అది బోగస్ మిషనయితే మరి మీ పోలీసులు దాన్నే అన్ని నేర నిర్ధారణలకూ ఎందుకు వాడ్తున్నారు? " అంటూ మంజులత అరచింది.

"అయినా అంకుల్.. మీరు పోలీస్ డిపార్ట్‌మెంట్‌లో పనిచేసి కూడా మీకు ఈ లైడిటెక్టర్‌ని కొన్ని కేసుల్లో కోర్టులు నేర నిర్ధారణకి యాక్సెప్ట్ చేస్తారనే విషయం కూడా తెలీదంటే చాలా సిగ్గుచేటు!" అంటూ షైనీ అందుకునేసరికి ఈ పోలీసాయన వెంటనే స్పీచ్ ఆపేసి 'ఇప్పుడే వస్తా' అంటూ ఎటో పారిపోయాడు.

మర్నాడు పొద్దున్న ఆరుగంటలకే ఏదో గొడవవుతున్నట్లు కేకలు వినబడేసరికి అందరం గ్రౌండ్ ఫ్లోర్‌లోకి పరుగెత్తాం!

అపార్ట్‌మెంట్స్‌లో పాలుపోసే వ్యక్తికి లైడిటెక్టర్ వైర్లు తగిలిస్తున్నారు లేడీస్.

"నువ్ పాలలో నీళ్ళు ఒక్క చుక్క కూడా కలపలేదంటున్నావ్ కదా! నీ మాట నిజమో, కాదో ఈ మిషన్ చెప్తుంది.

అప్పుడు గానీ మేము నీ మాట నమ్మం!" అంటోంది షైనీ.

"నేను నిజమే చెప్తున్నానండీ! నీళ్ళు కలపాల్సిన అవసరం మాకేంటి? మీ దగ్గర ఎక్కువ రేటు తీసుకుంటున్నాంగా" అంటున్నాడు పాలతను.

"మేమనేది అదే.. ఎక్కువ రేటు తీసుకుని నీళ్ళపాలు పోస్తున్నావ్" అంటూ రెడ్ బటన్ ప్రెస్‌చేసింది షైనీ. పాలతని మొఖంలో భయం కనబడుతోంది.

"నిజం చెప్పు బాబూ! ఇవాళ పాలల్లో ఎన్ని నీళ్లు కలిపావ్? పావు, సగం! మూడొంతులు? ఎన్ని చెప్పు త్వరగా!"

ఆ క్వశ్చన్ ఆన్సర్ చేయడానికి నానా తంటాలూ పడ్డాడతను. చివరకు ఆ మిషన్ పెద్దగా సైరన్ మోగించింది.

"చూశావా! నువ్వు చెప్పేది అబద్ధం అంటోంది మిషన్"

"అలాగా మేడమ్- అయితే ఒక పని చేయండి మేడమ్"

"ఏమిటది? "

"మంచినీళ్ళు ఒక్క చుక్క కూడా కలపని పాలను ఆ మిషన్‌నే పోయమనండి. రేపట్నుంచీ నేను పాలు బంద్ చేస్తున్నా"

లేడీస్ అంతా షాకయిపోయారు.

వాడి ధైర్యానికి మాకందరికీ తప్పట్లు కొట్టాలనిపించిందిగాని- మళ్ళీ అది ఏం గొడవకు దారితీస్తుందో అని సైలెంట్ అయిపోయాం.

కొద్దిసేపు వాదోపవాదనల తర్వాత పాలతనూ, లేడీసూ ఒక రాజీకొచ్చారు.

ఇకనుంచీ అతను నీళ్ళు కలపకూడదు. వాళ్ళు అతనిని లైడిటెక్టర్ టెస్టులు చేయరు. 'నీళ్ళు కలపావా? ' అని అడగరు.

పాలతను ఎంత పెద్దఎత్తున పబ్లిసిటీ చేశాడో ఏమోగానీ ఆ మర్నాటి నుంచీ మా అపార్ట్‌మెంట్స్‌కి రెగ్యులర్‌గా వచ్చే కూరగాయలబండీవాడూ, పళ్ళు అమ్మే బండీవాడూ రావడం మానేశారు. దాంతో రోజూ



మార్కెట్ కెళ్ళి కూరగాయలూ, పళ్ళూ తెచ్చే డ్యూటీ మామీద పడింది.

ఒకరోజు మేము మార్కెట్ కెళ్తుంటే మా కూరగాయల బండీవాడు రోడ్ పక్కన బండితో కనిపించాడు.

"ఏమిటి శంకరయ్యా! మా అపార్ట్‌మెంట్స్‌కి రావటం మానేశావ్? " అడిగాడు విజయ్‌యాదవ్.

"మీ లేడీస్ అదేదో మిషన్ కొన్నారంట కద్సార్, దాంతో మా తూకాలు, మా రేట్లు.. అన్నీ చెకింగ్ చేస్తారంట! మాకెందుకు సార్ ఈ కిరికిరంతా? ఇక్కడే హాపీగా అమ్ముకుంటాం" అన్నాడతను.

ఆ వార్త తీసుకెళ్లి షైనీకి చెప్పాం, అప్పటికైనా ఆమె రూటు మార్చుకుంటేందోమో అని! కానీ ఆమె నిర్లక్ష్యంగా నవ్వింది.

"ఎవడు రానీ రాకపోనీ.. ఎవడికిష్టం ఉండని ఉండకపోనీ.. లై డిటెక్టర్ ఇక్కడ ఉండి తీర్తుంది" అంది కర్కశంగా.

ఇలా రెండ్రోజులు గడిచేసరికి మూడో రోజు ఇంకో ఉపద్రవం ముంచుకొచ్చింది.

ఆ రాత్రి అందరూ న్యూస్ ఛానెల్స్

చూస్తుండగా, సడెన్‌గా ఒక 'బ్రేకింగ్ న్యూస్' స్క్రీన్ మీద ఫ్లాష్ అవటం మొదలుపెట్టింది.

సహజంగానే అందరూ ఎలర్ట్ అయి ఆ న్యూస్ చూశారు. న్యూస్ రీడర్, యాంకర్ మామూలుగానే రెచ్చిపోయి ఆ వార్తను జనం మీదకు వదులుతున్నారు.

"ఇప్పుడే అందిన వార్త- మేడ్చల్‌కి సమీపంలోని ఒక రిసార్ట్స్‌కి చెందిన క్లబ్ హౌస్‌లో బొంబాయి నుంచి రప్పించిన యువతులతో సెక్స్‌డాన్స్‌ల పేరుతో విశృంఖలంగా జరుగుతోన్న సెక్స్ రాకెట్ విషయం తెలుసుకున్న పోలీసులు, తుగ్లక్ టీవీ జర్నలిస్ట్ రాజుతో కలసి ఆ రిసార్ట్స్ మీద రైడ్‌చేశారు. ఆ యువకుల డాన్స్‌లు చూడ్డానికి వచ్చిన విటులు అందరూ హైదరాబాద్ వాసులే! ఒక్కొక్క విటునికీ పదివేల రూపాయలు ఛార్జీ వసూలుచేసిన నిర్వాహకులు పోలీసులను చూడగానే జారుకున్నారు. విటులూ, ఆ యువతులూ మాత్రం పోలీసులకు దొరికిపోయారు" అంటూ వివరిస్తూండగానే కెమేరా ఆ యువతుల, విటుల మొఖాలనూ పదేపదే చూపించటం మొదలుపెట్టింది. యువతులంతా మొఖానికి చీరకొంగులు, దుపట్టాలు అడ్డం పెట్టుకున్నారు. విటులు కర్చీఫ్‌లూ, టవల్సూ అడ్డం పెట్టుకున్నారు.

న్యూస్‌రీడర్ గజని తగులుకున్నాడు.

"రాజూ! ఈ సెక్స్‌రాకెట్ ఎంతకాలం నుంచి నడుస్తోంది? ఈ విషయం ఇంతకాలం పోలీసులకు ఎందుకు తెలీలేదు? 'నృత్యం' పేరుతో ఈ వ్యభిచారం నిర్వహిస్తోన్న నిర్వాహకులెవరు? "

"గజనీ.. ఈ రాకెట్ చాలాకాలం నుంచీ నడుస్తోన్నట్లు తెలుస్తోంది గజనీ! ఈ రిసార్ట్స్‌కి చాలామంది ధనికులు, రియల్ ఎస్టేట్ వ్యాపారులు, కొంతమంది రాజకీయనాయకులు కూడా వస్తోన్నట్లు తెలుస్తోంది గజనీ. అయితే దీని నిర్వాహకులు ఎవరో తెలీటం లేదు గజనీ. ఎందుకంటే దీని ఓనర్స్ ఒకరయితే ఇంకొకరు లీజుకు తీసుకున్నారు. ఆ లీజుకి తీసుకున్న వ్యక్తులు మరో గ్రూప్‌కి సబ్‌లీజ్ ఇచ్చినట్లు తెలుస్తోంది. పోలీసులు ఇన్వెస్టిగేట్ చేస్తున్నారు గజనీ"

"బొంబాయినుంచి వచ్చిన యువతులెవరు? వారు ఎందుకని అంటే ఏ కారణం చేత ఇలాంటి అనైతిక కార్యకలాపాలకు పాల్పడుతున్నారు? వారికి నిర్వాహకులెంత డబ్బు ముట్టజెబుతున్నారు, రాజూ? "

"గజనీ.. ఆ యువతులు కొంతమందితో మేము మాట్లాడటం జరిగింది. వారి అడ్రస్‌లు, సెల్‌ఫోన్‌నెంబర్స్ కూడా మన ఛానెల్‌లో స్క్రోల్ చేయడానికి పంపించాము. వాళ్ళు చెప్పేది వాళ్ళ మాటల్లోనే"

"మీరెక్కడినుంచి వచ్చారు? "

"బొంబాయి నుంచి!"

"ఎందుకొచ్చారిక్కడికి? "

"ఎందుకేముంది? మేము డాన్సర్స్ కనుక ఎవరు డాన్స్ ప్రోగ్రాంకి పిలుస్తే అక్కడికెళ్తాం"

"కానీ మీరు అర్ధనగ్నంగా అసభ్యకరంగా నృత్యాలు చేస్తున్నట్లు తెలుస్తోంది కదా!"

"డబ్బు ఎక్కువిచ్చి, నగ్నంగా కూడా డాన్స్ చేయమంటున్నారు ప్రేక్షకులు. వారు చెప్పినట్లు చేయక తప్పదు"

"ప్రోగ్రాం తర్వాత మీరు విటులతో సెక్స్‌లో పాల్గొంటున్నారని అంటున్నారు"

"డబ్బు పెరిగినకొద్దీ - ఏం అడిగితే అది చేయటం మా ధర్మం"

"కానీ మీరు గౌరవంగా బతక్కుండా ఇలాంటి వృత్తి ఎందుకు ఎంచుకున్నారు?

"ఎందుకేముంది? మా ఇంట్లో ఖరీదయిన జబ్బుతో బాధపడే తల్లీ, పక్షవాతం వచ్చిన తండ్రీ, చెల్లెళ్ళు, తమ్ముళ్ళను పోషించటంకోసం, చదివించటంకోసం"

"కానీ అందుకు ఏదొక ఉద్యోగం చేసి డబ్బు సంపాదించుకోవచ్చు కదా? "

"మీ చానెలోళ్ళకి ఏమయినా మెంటలా? మాకెవరు ఉద్యోగమిచ్చినా మాతో యాజమాన్యం చేయించేదిదేగా? మీ చానెలోళ్ళు రోజూ బ్రేకింగ్ న్యూస్ అంటూ వేసేవి అలాంటి వార్తలేగా? ప్రైవేట్ ఉద్యోగాలూ, గవర్నమెంట్ ఉద్యోగాలూ, అన్నిచోట్లా మమ్మల్ని వాడుకునే వారేకదా! ఆ కీచకులందరినీ టీవీలో చూపిస్తోండి కూడా ఇంకా ఇలాంటి చెత్త ప్రశ్నలేయడానికి మీకు సిగ్గుండక్కర్లేదూ? అదీగాక మాలో చదువురాని వాళ్ళుంటారు.. వాళ్ళకెవరిస్తారు ఉద్యోగం? "

"వాళ్ళు ధనవంతుల ఇళ్ళల్లో మెయిడ్ సర్వెంట్స్‌గా పని చేయవచ్చుకదా!"

"షైనీ ఆహుజా తనింట్లో సర్వెంట్ మెయిడ్‌ని రేప్ చేసిన విషయం మీ చానెల్లో టెలికాస్ట్ చేసి కూడా ఇంకా ఈ ప్రశ్నలేంట్రా? నీకు తెలీదేమో! దేశమంతా షైనీ ఆహుజాలతో నిండిపోయి ఉంది. పోలీసులు కూడా మాలాంటి వాళ్ళను బెదిరించి, మమ్మల్ని నగ్నంగా సెల్‌ఫోన్లో వీడియోలు తీసి బ్లాక్‌మెయిల్ చేసి సంవత్సరాల తరబడి రేప్ చేస్తున్నారని మొన్నేగా విజయవాడలో గొడవయింది? అందాకా ఎందుకు? ఇప్పుడు రైడ్ చేయడానికి వచ్చిన పోలీసులే మమ్మల్ని బుక్‌చేసుకుని వాళ్ళ అధికారుల దగ్గరకు పంపిన విషయం మీ చానెల్ వాళ్ళకు తెలీదా? "

ఆ మాట పూర్తి అవకుండానే కెమెరా ఆపేశాడు రాజు కంగారుగా!

"ఏదేమైనా ప్రభుత్వమే ఈ యువతులకు ఉపాధికోసం ఏదయినా స్కీమ్‌ని పెట్టి ఆదుకోవాలని వీళ్ళు కోరుతున్నారు గజనీ"

సడన్‌గా మా అపార్ట్‌మెంట్‌లో ఆ దృశ్యాలు చూస్తున్న వాళ్ళందరిలోనూ కలకలం మొదలయింది.

అందుక్కారణం- ఆ విటుల్లో మా అపా



ర్ట్‌మెంట్స్‌కి చెందిన శాస్త్రి కనిపించటం. శాస్త్రి మా అపార్ట్‌మెంట్స్‌లో 'సి' బ్లాక్‌లో ఉంటాడు. అపార్ట్‌మెంట్స్‌లో ఏ పూజలైనా తనే నిర్వహిస్తూంటాడు. రోజూ తెల్లారు జామునా, రాత్రీ ఆయన చేసే భగవన్నామస్మరణ రెండు మూడు బ్లాకుల వరకూ వినబడుతూనే ఉంటుంది.

"అవును! మన శాస్త్రే- అనుమానంలేదు. చేతి వాచ్ చూడు శాస్త్రి పెట్టుకునేదే" అన్నాడు విజయ్‌యాదవ్.

"అతని ఫింగర్‌కున్న అంగూటీ భీ- శాస్త్రిదే" అన్నాడు హమీద్‌మియా. అయితే ఆ కాండేట్ మొఖం కెమెరాకు కనిపించకుండా కర్చీఫ్ అడ్డుపెట్టుకోవటంవల్ల కచ్చితంగా శాస్త్రే అని చెప్పటం కష్టంగా ఉంది.

అప్పటికే అపార్ట్‌మెంట్స్‌లో లేడీస్ గుసగుసలాడుకోవటం మొదలుపెట్టారు.

"మనకు భగవద్గీత బోధించే శాస్త్రి సెక్స్ డాన్సర్స్‌ని బుక్‌చేసుకోడానికి వెళ్ళి పోలీసులకు దొరికిపోయాడంట- టీవీలో చూపిస్తున్నారు" అంది మంజులత షైనీతో.

లేడీస్ అంతా శాస్త్రి ఇంటికెళ్ళేసరికి

వాళ్ళావిడ ఏడుస్తోంది. అందరూ ఫోన్లు చేసి "మీ హజ్‌బెండ్‌ని బ్రోతల్స్ దగ్గర పోలీసులు పట్టుకున్నారు. టీవీ ఆన్‌చేయండి.. కనిపిస్తాడు. మొఖానికి కర్చీఫ్ అడ్డుపెట్టుకుంటే మాత్రం గుర్తుపట్టలేమా ఏమిటి? అంటూ నానా హేళనా చేస్తున్నారు" అందామె.

"ఇంతకూ టీవీలో కనబడేది ఆయనేనా? "

"ఆయనలాగానే ఉన్నాడు. ఆ షర్టూ, పాంటూ అచ్చం ఆయనకున్న లాంటివే. ఆ వాచీ ఉంగరం కూడా ఆయనవిలాగానే ఉన్నాయ్. కానీ ఆయనలాంటివారు కాదు, మహాభక్తులు"

షైనీ నవ్వింది.

"భారతనారి అన్నాక భర్తమీద ఆ మాత్రం నమ్మకం ఉండాల్సిందే కానీ అనవసరంగా ఓవర్ కాన్ఫిడెన్స్ పెట్టుకోకండి! మొన్నేగా పేపర్లో చదివాం.. ఒక పూజారి గుడికొచ్చిన భక్తురాలిమీద అత్యాచారం చేయబోయాడు"

"ఏమో- నాకు మాత్రం ఆయనలాంటి పని చేయరనే అనిపిస్తోంది"

"అయితే ఒక పనిచేయండి.. ఇప్పుడు శాస్త్రిగారెక్కడున్నారు? "

"ఒకచోట మహాపూజ ఉందని సాయంత్రమనగా వెళ్ళారు"

"అనుమానమెందుకు? ఈ పూజకే వెళ్ళి ఉంటారు" అంది మంజులత.

అందరూ ఘొల్లుమని నవ్వారు.

"పోనీ ఓ పని చేయరాదూ? మీ హజ్‌బెండ్ సెల్‌కి ఫోన్ చెయ్. ఏ పూజలో ఉన్నారో తెలిసిపోతుంది కదా? "

ఆమె వెంటనే లాండ్‌లైన్ నుంచి శాస్త్రి గారి సెల్‌కి ఫోన్ కొట్టింది. "మీరు డయల్‌చేసిన సెల్ నెంబరు ప్రస్తుతం ఆఫ్ చేయబడి ఉంది" అంది టేప్‌వాయిస్.

"ఆయన పూజలో ఉంటే సెల్ ఆఫ్ పెడతారు" చెప్పిందామె చావని ఆశతో.

"అమ్మా, టీవీలో మళ్ళీ నాన్నని చూయిస్తున్నారే!" పరుగున వచ్చాడు శాస్త్రి ఆరేళ్ల కొడుకు.

"చూడండి మీనాక్షిగారూ! మీరు భ్రమ లోనుంచి బయటకు రండి! మీ పసివాడు కూడా తేలిగ్గా తండ్రిని గుర్తుపట్టాడు. కానీ పదేళ్ళు కాపురం చేసిన మీరు కర్చీఫ్ అడ్డం ఉండేసరికి ఆయన కాదంటున్నారు. అసహ్యంగా లేదూ? " అంది షైనీ- అక్కడితో అందరూ డిస్పర్స్ అయిపోయారు.

రాత్రి రెండింటికి శాస్త్రి ఇంటికొచ్చాడు.

ఆ రాత్రి తెల్లార్లూ శాస్త్రీ అతని భార్యా గొడవపడటం చుట్టుపక్కల ఫ్లాట్స్ వాళ్ళంతా నిద్రపోకుండా విన్నారు.

తెల్లారేసరికి లేడీస్ అంతా సెల్లార్‌లో గుమికూడటం, షైనీ లై డిటెక్టర్ తీసుకురావటం జరిగిపోయింది.

శాస్త్రిని వాళ్ళావిడ తీసుకొచ్చి మధ్యలో నుంచోపెట్టింది.

రాత్రికిరాత్రే శాస్త్రి టీవీ చానెల్స్ పుణ్యమా అని హీరో అయిపోవడంతో అపార్ట్‌మెంట్స్‌లోని జనమంతా క్రిక్కిరిసిపోయారు, కాసేపట్లోనే!

ఇంకాసేపట్లో తనని ఉరి తీస్తున్న లెవల్లో కనబడుతున్నాడు శాస్త్రి.

"నేను బొలారంలో ఒకళ్ళింట్లో పూజలు చేయడానికెళ్తే.. నేను సెక్స్ డాన్స్‌లు చూడ్డానికి వెళ్ళానని ఈ అపవాదులేమిటో.. నా వాచీ, నా ఉంగరం, నా బట్టల్నీ పోలి ఇంకోడికి ఉండటం ఏమిటో, ఈ అపార్ట్‌మెంట్స్‌లోని వాళ్ళందరితో పాటు నా భార్య కూడా నన్ననుమానించటం ఏమిటో- అక్కడితో ఆగక ఈ లేడీస్ అంతా కలసి నాకీ లై డిటెక్టర్ టెస్ట్ చేయాల్సిందేనని తీర్మానించటాలేమిటో- ఈ సీన్ చూడ్డానికి జనం ఇలా విరగబడిపోవటం ఏమిటో- అంతా అయోమయంగా ఉంది.

వచ్చివచ్చి- నాలాంటి భక్తుడికే ఈ పరీక్షలు రావాలా? హమీద్‌గారూ.. మీరయినా కలుగజేసుకోకపోతే ఎలాగండీ? ” అంటూ ప్రాధేయపడ్డాడు శాస్త్రి.

“ఇప్పుడు నేను ఏమీ చెయ్యలేవ్ శాస్త్రీ!” అన్నాడు హమీద్‌మియా విచారంగా.

“అన్యాయంగా అపవాదులేస్తున్నారు! నేనెంత భక్తుడినో మీ అందరికీ తెలుసు”

“నిజమే” అన్నాడు విజయ్‌యాదవ్.

“నాకూ మీ మీద పూర్తి నమ్మకం ఉంది. మీరలాంటి పనులు చేయరని-”

సరిగ్గా అప్పుడే ఓ యువకుడు వచ్చి శాస్త్రి చెవిలో గుసగుసలాడాడు.

“శాస్త్రిగారూ! రిసార్ట్ అడ్రస్ చెప్తారా ఓసారి? మా ఫ్రెండ్సందరూ అక్కడ పార్టీ చేసుకుందామని అడుగుతున్నారు-”

“శివశివా శివశివా” అంటూ చెవులు మూసుకున్నాడాయన.

ఈలోగా షైనీ ఆయన దగ్గరకొచ్చింది.

“శాస్త్రిగారూ! మీరంటే మాకు గౌరవం ఉంది. ఇప్పటికైనా మించిపోయిందిలేదు. ఆ రిసార్ట్స్‌లో కనిపించింది మీరేనని ఒప్పుకుంటే ఇంతమందిలో పరువుపోకుండా ఉంటుంది” అంది చాయిస్ ఇస్తూ.

“అంతా ఆ భగవంతుడికి తెలుసమ్మా” ఎటూ తేల్చకుండా అన్నాడు శాస్త్రి.

శంకరమూర్తి కూడా ఆయనకు నచ్చచెప్పటానికి ప్రయత్నించాడు.

“పోనీ సీక్రెట్‌గా మీ ఆవిడ దగ్గర ఒప్పేసుకోండి శాస్త్రిగారూ! ఈ న్యూసెన్స్ అంతా తప్పిపోతుంది”

“నీకు తెలీదయ్యా! ఒప్పుకుంటే మా ఆవిడ శాశ్వతంగా పుట్టింటికెళ్ళిపోతుంది! ఆ రిస్క్ తీసుకునేబదులు 'నేను కరెక్టే- ఆ మిషనే రాంగ్' అనేస్తే నా కాపురం నిలబడుతుందిగా” ఆశగా అన్నాడతను.

శంకరమూర్తి అదిరిపోయాడు.

“అమ్మనా శాస్త్రో! ఏం తెలివిరా నీది!”

షైనీ శాస్త్రిగారికి వైర్లు తగిలించేసింది.



“క్రిందటి వినాయక చవితినాడు అనుకోకుండా నా స్కూటర్ రియర్ మిర్రర్‌లో చంద్రుడిని చూశానండీ! అప్పుడే అనుకున్నా - ఇలాంటి అపవాదేదో ఎదుర్కోవాల్సి వస్తుందని” శాస్త్రి, విష్ణుమూర్తికి చెప్తున్నాడు.

షైనీ గొంతు కంచులా మోగింది.

“శాస్త్రిగారూ! రాత్రి ఆ సెక్స్‌డాన్స్‌ల రిసార్ట్‌లో పోలీసులు రైడ్ చేసినప్పుడు టీవీ కెమెరాకి కనబడకుండా మీ మొఖానికి ఎందుకు కర్చీఫ్ అడ్డం పెట్టుకున్నారు? కర్చీఫ్ అడ్డం పెట్టుకున్నంత మాత్రాన మిమ్మల్ని గుర్తించలేమనుకున్నారా? ” అడిగింది చాలా తెలివిగా.

“ఆ కర్చీఫ్... అహహా... అసలు టీవీలో కనిపించింది నేను కాదండీ! ఆ టైమ్‌కి నేను బొలారంలో పూజా కార్యక్రమం నిర్వహిస్తున్నానని చెప్తున్నాను కదా”

అతని మాట పూర్తి కాకుండానే మిషన్ గుండెలదిరేలా సైరన్ మోగించింది. శాస్త్రి మొఖం వాడిపోయింది కానీ అంతలోనే



పుంజుకున్నాడు.

"ఇలాంటి మిషన్లు ఎన్ని సైరన్లు కూసినా, నేను నిర్దోషినని ఆ భగవంతుడికి తెలుసు- నా భార్యకు తెలుసు"

"ఛీ- నోర్ముయ్ సిగ్గు లేకుండా వాగుతున్నావ్!" అంటూ అందరి ఎదురుగ్గా అతని చెంప పగలగొట్టి ఉక్రోషంగా, ఇంట్లోకి పరుగెత్తింది వాళ్ళావిడ. జనమంతా ఎవరిదారిన వాళ్ళు వెళ్ళిపోయారు.

ఆడాళ్ళంతా గ్రూప్స్‌గా విడిపోయారు. "ఈ శాస్త్రి ఇంత గ్రంథసాంగుడని తెలీక రెండేళ్ళ నుంచే వాడికాళ్ళు మొక్కుతున్నాం" అన్నారొకరు.

"వాడు ఒకటి రెండుసార్లు నావంక కూడా అదోలాచూశాడు రజనీ! అప్పుడే కొంచెం డౌటొచ్చిందిగానీ వాడి చూపే అంతేమో- అనుకున్నా" అని ఇంకొకావిడ.

"ఇంతకూ ఇప్పుడు శాస్త్రి పెళ్ళాం ఏం చేస్తుందంటారు? వాడిని శాశ్వతంగా వదిలేసి పుట్టింటికెళ్ళిపోతుందంటారా? " అని ఇంకొకరు.

ఇలా కామెంటరీలు ప్రసారం చేస్తుండగానే ఏడుస్తూ శాస్త్రి భార్య తన పిల్లాడిని, సూట్‌కేస్‌నీ తీసుకుని ఆటోఎక్కి వెళ్ళిపోవటం- ఆమెకు వెళ్ళొద్దని బతిమాలుతూ శాస్త్రి వెంటపడటం- అందరం గుడ్లప్పగించి చూస్తుండిపోయాం.

మా కమిటీ మెంబర్స్ తప్ప మిగతా వాళ్ళంతా ఫ్లాట్లలోకి వెళ్లిపోయారు.

"ఇవాళ శాస్త్రికాగతి పట్టిందంటే- రేపు మనకూ లైన్లో ఉన్నట్లే లెక్క" అన్నాడు మోహిందర్‌సింగ్.

"ఉన్నట్లే లెక్కేమిటి? ఈ లైడిటెక్టర్ వచ్చిన దగ్గర్నుంచీ నేనేం మాట్లాడినా మా మిసెస్ అవన్నీ అబద్ధాలని కొట్టి పారేసింది. అవి నిజాలని ప్రూవ్ చేయాలంటే లైడిటెక్టర్ టెస్ట్ చేసుకోవాలంట" చిరాగ్గా అన్నాడు శంకరమూర్తి.

సరిగ్గా అప్పుడే మా అపార్ట్‌మెంట్స్ యూత్ లీడర్లు మా దగ్గరకొచ్చారు.

"గుడ్‌మార్నింగ్ అంకుల్" విష్ చేశారిద్దరూ హమీద్‌మియాకి.

"గుడ్‌మార్నింగ్! క్యాహై భాయ్!"

"మాకు ఒక ప్రాబ్లెమ్ వచ్చిందంకుల్- మీ హెల్ప్ కావాలి"

"చెప్పు.. ఏంటయ్" అడిగాడు హమీద్.

వాళ్లు కొంచెంసేపు నసిగి తర్వాత సబ్జెక్ట్‌లోకొచ్చారు.

"అదీ.. అదేంటంటే.. మా కాలేజ్ బాయ్స్‌కి గాళ్‌ఫ్రెండ్స్ ఉంటారుగదంకుల్"

"తెలుసు - సిటీలో ప్రతి ఏరియాకీ ఒక గాళ్ ఫ్రెండ్ ఉంటుంది మీకు"

"అహహ! మీ స్టేట్‌మెంట్ కొంచెం ఓవరయిందిగానీ- బట్- ఇద్దరు గాళ్‌ఫ్రెండ్స్ ఉండటం నార్మల్ అంకుల్"

"అందుకే కాలేజ్‌డేస్ బెస్ట్ అనేది" అన్నాడు కృష్ణమూర్తి.

"ఇంతకూ మీ ప్రాబ్లమ్ ఏంటి? " అడిగాడు విజయ్‌యాదవ్ ఈర్ష్యగా.

"అందుకే కాలేజ్‌డేస్ బెస్ట్ అనేది" అన్నాడు కృష్ణమూర్తి-

"ఇంతకూ మీ ప్రాబ్లమ్ ఏంటి?" అడిగాడు విజయ్‌యాదవ్ ఈర్ష్యగా.

"నా గాళ్‌ఫ్రెండ్ సుష్మిత మన అపార్ట్‌మెంట్స్‌లోనే ఉంటుంది కదంకుల్- తను ఈ లైడిటెక్టర్‌ని చూసిన దగ్గర్నుంచీ నా ప్రేమ సిన్సియరా, కాదా అన్న అనుమానం పట్టుకుంది. అందుకని నేను తనని తప్ప ఇంకెవ్వరినీ ప్రేమించటం లేదని, తనను నా ప్రాణం కన్నా ఎక్కువగా ప్రేమిస్తున్నాననీ ఆ లైడిటెక్టర్ టెస్ట్‌లో చెప్పమంటోంది-"

అందరం ఉలిక్కిపడ్డాం.

అటు తిరిగి, ఇటు తిరిగి టాపిక్ మళ్లీ లైడిటెక్టర్ దగ్గరకే వచ్చింది.

"చెప్పేసేయ్- భయం ఏమున్నయ్" అన్నాడు హమీద్‌మియా.

అతను కంగారుపడ్డాడు.

"చెప్తే - సుష్మితకు వెంటనే నా లవ్ అబద్ధం అని తెలిసిపోతుంది కదా! ఆ సంగతి తెలిసిందంటే నన్ను కట్ చేసిపారేసి రోహిత్‌ని లవ్ చేస్తుంది-"

"రోహితా? వాడెవడు?"

"రోహిత్ ఎప్పటి నుంచో సుష్మిత వెంట పడుతున్న కాండేట్-"

"అంటే నువ్ సుష్మిత్‌ను సిన్సియర్‌గా ప్రేమించటంలేదా?"

"ప్రేమిస్తున్నానంకుల్! కానీ సాగరికని కూడా లవ్ చేస్తున్నాను కాబట్టి లైడిటెక్టర్ ముందు మాట్లాడాలంటే అంతా బయటపడిపోతుంది-"

"సుష్మిత నిన్నొదిలి రోహిత్‌తో పోతే పోనీ- నీకు సాగరిక ఉందికదా!"

"ఉంది గానీ సాగరికకి వేరే ఫ్లాష్‌బాక్ ఉంది-"

"వద్దులే- ఇప్పుడా ఫ్లాష్ బాక్‌లన్నీ వినే ఓపిక నాకు లేదుగానీ- మేము నీకు ఏవిధంగా హెల్ప్ చేయాలో చెప్పు-"

"అదే- ఆ లైడిటెక్టర్‌ని ఎలాగయినా చెడగొట్టేస్తేగానీ మన అపార్ట్‌మెంట్స్‌కి పెద్ద న్యూసెన్స్ పోదంకుల్-" అందరికీ అతని ప్లాన్ ఇన్‌స్టెంట్‌గా నచ్చింది.

"నిజమే- ఇది చాలా మంచి ఐడియా" అన్నాడు కృష్ణమూర్తి.

"కానీ దాన్ని చెడగొట్టటం ఎలా? - అది షైనీ కంట్రోల్లో - 'లాక్ అండ్ కీ'లో ఉంటుంది కదా!"

"అక్కడే తెలివి ఉపయోగించాలంకుల"

"అంటే?"

"మనం ఒక కమిటీని వేసి- ఏం చేస్తే ఆ మిషన్ చెడిపోతుందో తెలుసుకుని ఆ పని చెయ్యాలి-"

వెంటనే శంకరమూర్తీ, కృష్ణమూర్తీ, మొహిందర్‌సింగ్‌లతో ఒక కమిటీ వేశాడు హమీద్‌మియా!

ఆ మర్నాడు 'D' బ్లాకులో ఉండే లావణ్య ఇంట్లో పెద్దగా ఏడుపులు వినిపించేసరికి అందరం అక్కడకు పరుగెత్తాం.

మామూలుగానే లావణ్య భర్త రాజనర్సింహ భార్యను పట్టుకుని చావగొడుతున్నాడు. భార్య శీలంమీద అనుమానంతో తాగివచ్చి చావగొట్టడం మామూలే!

మేమంతా వెళ్లి అతనికి వార్నింగిచ్చాం!

"ఇదిగో చూడు! నీకు ఆల్‌రెడీ రెండు వార్నింగ్‌లిచ్చేశాం! ఇప్పుడిది లాస్ట్ వార్నింగ్! అయినా ఇంకా నీ భార్యని కొట్టావనుకో! పోలీసు రిపోర్ట్ తర్వాత- ముందు మేమందరం కలసి నీ చేతులు ఫ్రాక్చర్ చేసేస్తాం! దాంతో ఇక జీవితమంతా నువ్ నీ భార్యను కొట్టలేవ్! చేతులు విరగటం వల్ల నీ ఉద్యోగం కూడా పోతుంది. మేము చేసింది మంచి పనే గనుక పోలీసులు కూడా మమ్మల్ని ఏమీ అనలేరు- ఏమంటావ్ మరి?"

మామూలుగానే అతను భయపడినట్లు నటించాడు.

(తర్వాత ఏమైందో వచ్చేనెల)



జీవితంలోని అనేక పార్శ్వాలను చూపుతూ, పాఠకుల్లో కొత్త అనుభవాలను, అనుభూతులనూ కలిగించేది, కొంగొత్త ఆలోచనలు రేకెత్తించేది మంచి రచన అవుతుందని ప్రగాఢంగా నమ్మే చిలుకూరి దేవపుత్ర సీమ రచయితల్లో తనదైన ప్రత్యేకత సంతరించుకున్నారు. ఆయన వందకుపైగా కథలు రచించారు. వీటిలో కొన్ని ఆంగ్లం, హిందీ, మరాఠీ, ఒరియా, కన్నడ భాషల్లోకి అనువాదం అయ్యాయి. ఇంత వరకూ నాలుగు నవలలు వెలువరించారు. ఇందులో 'పంచమం'... ఉద్యమాల నేపథ్యంలో వచ్చిన తొలి దళిత నవలగా ప్రాచుర్యం పొందింది. ఈ రచన 'కథవెనుక కథ' రచయిత మాటల్లోనే విందాం...

చిలుకూరి దేవపుత్ర

# పదునెక్కిన దళితస్వరం
# పంచమం

దాదాపు రెండుదశాబ్దాల క్రితం, కచ్చితంగా చెప్పాలంటే.. 1988లో 'అద్దంలో చందమామ' నవల రాశాను. అప్పటికి దళితవాదం ఒక రూపం తీసుకో లేదు. తెలుగునాట రచయితలూ, విమర్శ కులూ, రాజకీయవర్గాలూ దళిత వాదాన్ని చర్చనీయాంశంగా చేయలేదు. ఆ దశలోనే దళిత సంస్కృతి, వారి సమస్యలు ఆ నవ లలో ప్రస్తావించాను. ప్రధాన ఇతివృత్తం భూమికి సంబంధించింది. ప్రభుత్వం 'సీమ మాగాణి సమారాధన' పేరుతో దళి తులకు పట్టాలు పంచుతుంది. భూస్వా ములు ఆ భూముల్ని వదులుకోరు. దళి తుల్ని ఆ భూముల్నించి తరిమి కొడతారు. కథానాయకుడు 'చిన్నోడు' భూమికోసం జరిపే పోరాటంలో ప్రాణాలు కోల్పో తాడు. సాహిత్యంలో తొలి దళిత నవలగా ఇది మేధావుల ప్రశంసలు అందుకుంది. సుప్రసిద్ధ విమర్శకులు వల్లంపాటి వెంకట సుబ్బయ్య, రచయితలు స్వామి, శిఖామణి లాంటివారు ప్రత్యేక ప్రస్తావనలు చేశారు.

కారంచేడు హత్యాకాండ అనంతరం దళిత ఉద్యమం ఊపిరిపోసుకుంది. అప్పటి నుంచి దళితవాదం వేళ్లూనటం మొదలయ్యింది. మెలమెల్లగా కథలు, కవి తలు, వ్యాసాలూ వస్తున్నాయి. సరిగా ఆ సమయంలోనే దళిత ఉద్యమ నేపథ్యంలో ఒక మంచి నవల రాస్తే బావుంటుందని అనిపించింది. దళితులు పెద్ద పెద్ద అధి కార హోదాలు చేపట్టినా, ముఖ్యమం త్రులు, ఉపముఖ్య మంత్రులు, మంత్రు లుగా బాధ్యతలు నిర్వర్తించినా వారు

భూస్వామ్య వర్గానికి ఉపయోగపడుతున్నారే తప్ప తమ వారికి చేస్తున్న మేలేముంది? దళితులకు రాజ్యాధికారం రావాలంటే వారిలో చైతన్యం ఉండాలి. వాళ్లంతా ఒక్కటై పోరాడాలి. వీటన్నింటిపైనా సాధికారతతో చర్చించే కథాంశాన్ని ఎంపిక చేసుకోవాలనిపించింది. అలా అనుకుంటున్న తరుణంలో ఓ సంఘటన చోటుచేసుకుంది.

ఇది 1990 నాటి మాట. నేను రెవిన్యూ శాఖలో ఉద్యోగిని. అప్పట్లో అనంతపురం జిల్లాలోని మారుమూల మండలంలో రెవిన్యూ ఇన్‌స్పెక్టర్‌గా పనిచేసేవాడిని. ప్రభుత్వం ల్యాండ్ సీలింగ్ కింద మా మండలంలో ఉన్న ఒక భూస్వామికి చెందిన 30 ఎకరాల భూమిని అప్పటికి కొన్ని సంవత్సరాల క్రితం స్వాధీనం చేసుకుంది. దాన్ని కొంతమంది దళితులకీ, భూమిలేని ఇతర కులాల వారికి పట్టాలుగా ఇచ్చింది. ఆనందంతో పట్టాలు వచ్చిన వారంతా ఆ భూమిలో పంటలు పండించుకోవటం ప్రారంభించారు.. అందుకోసం కొందరు అప్పులు చేశారు కూడా. ల్యాండ్ సీలింగులో భూమిని ప్రభుత్వపరం చేసిన భూస్వామికి ఆ భూమి మీద ఎనలేని మమకారం. పైగా అది తన సొంత ఊరిలోని భూమి మరి. అంచేత ఎట్లయినా దాన్ని తిరిగి హస్తగతం చేసుకోవాలని ప్రయత్నాలు ప్రారంభించాడు. ల్యాండ్ సీలింగు చట్టంలోని లొసుగులు, అధికారుల అవినీతి, అతనికి ఉపయోగపడతాయని తెలుసుకున్నాడు. మరో మండలంలో ఉన్న తన భూమిని తీసుకుని




## కథ వెనుక కథ

## పురస్కారాలు

★ అటా నవలల పోటీలో 'పంచమం' మూడో బహుమతి అందుకుంది. ఇప్పటికి మూడు ముద్రణలు అయ్యాయి.

★ 'ఉండేల విజ్ఞాన కళాపీఠం' అవార్డు లభించింది.

★ ఈ నవలని 2001లో శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం (అనంతపురం), 2005లో యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాదు, ఆంధ్రయూనివర్సిటీ ఎం.ఎ (తెలుగు) సిలబస్‌లో పాఠ్యాంశంగా ఉంచారు.

సొంత ఊళ్లో ఉన్న (ల్యాండు సీలింగు కింద పోయిన) తన భూమి తిరిగి తనకే చెందేలా 'రీ కన్వే' ఉత్తర్వులు మంజూరు చేయవలసిందిగా 'ల్యాండు సీలింగు ట్రిబ్యునల్'కు అప్పీలు చేశాడు. అడ్డదార్లన్నీ తొక్కాడు. ఏమైతేనేం చివరికి 'రీ కన్వే' ఉత్తర్వులు వచ్చాయి.

మా ఆఫీసుకు ఈ ఉత్తర్వులు రాగానే వెంటనే వాటిని అమలయ్యేలా చూడమని ఎమ్మార్వో నాకు సూచనలు చేశారు. ఈ ఉత్తర్వుల ప్రకారం రెవిన్యూ ఇన్‌స్పెక్టర్‌గా నేను భూస్వామి సొంత గ్రామంలో దండోరా వేయించి, గ్రామస్థులందరికీ ఆ విషయం తెలియచేయాలి. పైగా దండోరా వేసినట్టు సర్టిఫికెట్‌ను కూడా తేవాలి. ఆ ఉదయమే గ్రామపాలనాధికారి (వి.ఎ.ఒ.)తో కలసి గ్రామం చేరుకున్నాం. నిజానికి ఆ గ్రామ'వెట్టి'తో వేయించాలి దండోరా. అయితే ఆ వెట్టికి అది చేత

## మెచ్చుకోళ్లు

★ తల్లావజ్ఝల వారి 'హేలావతి' నవల నుంచి నేటివరకూ దళితజీవితాన్ని చిత్రిస్తూ అనేక నవలలూ, కథలూ వచ్చాయి. దళితు డిగా పుట్టి, దళితాన్ని జీవించి ఆ బాధలో నుంచి, ఆవేదనలోంచి, ఆ అనుభవంలోంచి ఆవిష్కరించిన దళిత జీవన పరిణామమే 'పంచమం' నవల. దళిత జీవితం ఎంత సంఘ ర్షణకు లోనవుతుందో ప్రతి చిన్న కదలికలతో సహా పట్టి అందించారు దేవపుత్ర

– కలేకూరి ప్రసాద్

★ దేవపుత్ర 'పంచమం' తెలుగు నవలా చరిత్రలోనూ, దళిత జీవన చిత్రణ చేసిన సృజ నాత్మక కళారూపాలలోనూ ప్రధానమైన స్థానాన్ని ఆక్రమిస్తుంది. 120 ఏళ్ల తెలుగు నవలా చరిత్రలో వస్తువైవిధ్యంలో, సంక్లిష్ట సామాజిక సంచలనాలకు అద్దం పట్టటంలో, వ్యక్తిజీవితానికి, సమాజ జీవితానికి మధ్య ఉన్న సంబంధాన్ని సరిగ్గా వ్యక్తీకరించటంలో అగ్రస్థా నంలో నిలుస్తుంది.

–ఎన్.వేణుగోపాల్

కాదు. దాంతో ఎప్పుడూ ఊళ్లో దండోరా వేసే మనిషిని పిలిపించాం. నలభై అయి దేళ్ల వయసుంటుందతనికి. మునుపు స్వాధీనం చేసుకుని, పట్టాలు ఇచ్చిన భూమిని తిరిగి భూస్వామికి స్వాధీనం చేస్తున్న విషయం దండోరా వేసేటప్పుడు ఎలా చెప్పాలో అతనికి బాగా వివరించాం.

ఆ దండోరా వేసే మనిషి అంతా విన్నాక "అయితే దేవరా! నాకిచ్చిండే భూమిని కూడా ఎనిక్కి పీక్కోనేస్తారా? నేనెట్టా డంగోరు ఏసేది? నా వల్ల కాదు సామీ..!" అంటూ కన్నీళ్లు పెట్టుకున్నాడు.

భూస్వామికి 'రీ కన్వే' అయిన ల్యాండు సీలింగు భూమిలో అతనికి పట్టా ఇచ్చిన భూమి ఉందన్నమాట. అతని ముఖకవళి కలూ, కళ్లలో నీళ్లు చూస్తుంటే నా గుండె కరిగిపోయింది. కడుపు తరుక్కుపో యింది. కానీ నా ఉద్యోగ ధర్మాన్ని నిర్వ ర్తించాలంటే దండోరా వేయించక తప్పదు. మా వీఏఓ 'నువ్వు దండోర వేయకపోతే పోలీసులకి రిపోర్టు చేస్తాం' అంటూ బెది రించాడు. చివరికి అతనితో ఎలాగోలా పనైతే పూర్తి చేయించగలిగాం. అదిగో అప్పుడు పడింది 'పంచమం' నవలకు బీజం. దళిత సమస్యల్ని, భూసమస్యల్ని చిత్రిస్తూ దళిత ఉద్యమ నేపథ్యంతో నవల మొదలు పెట్టాను.

మొదట్లో నేను రాయాలనుకున్న నవల గురించి కొంత చెబుతాను..మాదిగ నారా యణప్ప, అతని కొడుకు శివయ్యలు ప్రధాన పాత్రలు. నారాయణప్పతో భూ సమస్యల గురించి కథ నడుపుతూ.. శివయ్య కోణం నుంచి దళిత ఉద్యమ నేపథ్యం, దళిత సమస్యల్ని చిత్రిస్తూ, అతని కాలేజి చదువు, ప్రేమ వ్యవహారం.. ఇవన్నీ చూపిస్తూ.. చివరికి భూస్వాములు అతన్ని భరించలేక ప్రేమవ్యవహారం సాకుతో కడతేర్చేలా స్థూలంగా నా మనో ఫలకం మీద కథనాన్ని చిత్రించుకున్నాను. ప్రతిరోజూ కొన్ని పేజీలయినా తప్పనిస రిగా రాయాలనుకున్నాను. దాదాపు 30 పేజీల వరకూ బాగానే రాయగలిగాను. ఆ తర్వాత రెవిన్యూ శాఖ కావటం మూలంగా పని ఒత్తిడితో తర్వాత రాయొ చ్చులే అనుకుంటూ వాయిదాలు వేస్తూ వచ్చాను. అలా ఏడేళ్లు గడిచిపోయాయి.

ఓ రోజు దినపత్రికలో ఆటా (అమెరి కన్ తెలుగు అసోసియేషన్) వారి నవ లల పోటీ ప్రకటన కంట పడింది. లక్ష రూపాయల బహుమతి అన్నది ఒక ఆక ర్షణైతే, 'మరుగున పడిన జీవితాల గురించి రాసిన నవలకు ఎక్కువ ప్రాధాన్యం' అనటం మరో ఆకర్షణయింది. 30 పేజీలు రాసి, నిలిపివేసిన నవలకు మళ్లీ ప్రాణం వచ్చింది. ఏడేళ్ల క్రితం నాటి ఇతి వృత్తాన్ని మరింత మెరుగు పెట్టవలసిన

అవసరం ఉందనిపించింది.

ఎందుకంటే అప్పటికి దళిత ఉద్యమంలో బాగా మార్పులొచ్చాయి. ఉద్యమం బలపడుతున్న దశలో 'ఉద్యోగ రిజర్వేషన్లలో అన్యాయం జరిగింది.. ఏబీ సీడీలుగా విభజించాలి' అంటూ మాదిగ దండోరా, 'విభజన వద్దు.. దాన్ని రద్దు చేయాల'ని డిమాండ్‌చేస్తూ మాలమహానాడు దాన్ని చీల్చివేశాయి.

ఇవన్నీ నవలలో రావాలి. అంతే కాదు. మొత్తం దళిత సమస్యల్ని చర్చిస్తూ పరిష్కారాలూ చూపించాలి అనుకున్నాను. కొత్తగా మళ్లీ సంక్షిప్తంగా కథ రాసుకున్నాను. నా దృష్టికి వచ్చిన దళితవాద కోణాలన్నీ చాలావరకూ చూపగలిగాను. నాకు పరిచయం ఉన్న దళిత జీవనాన్ని, నేను చూసిన దళిత వాతావరణాన్ని పడుగూపేకల్లా కలిపేశాను. అది 'పంచమం' నవలయింది.

***కథలోకి వెళితే...***

కృష్ణాపురంలో ఇంటర్ ఫలితాల కోసం, పిల్లలు పేపరు కోసం ఎదురు చూస్తుండటంతో మొదలవుతుంది నవల. గ్రామంలో చెప్పులు కుట్టుకుని బతికే నారాయణప్ప కొడుకు శివయ్య అక్కడ ఉన్న పిల్లలందర్లోకి ఉత్తమునిగా ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణుడవుతాడు. అతను కాలేజిలో చేరటం, గ్రూపు-1 పరీక్షలు రాయటం, ఆ తర్వాత అదే హోదాలో అధికారిగా ఎంపిక కావటం వరుసగా సాగిపోతాయి. అతని సొంత డివిజన్‌లోనే ఆర్డీఓగా వేయించుకుంటారు ఆ గ్రామ భూస్వాములు. తమ ప్రయోజనాల కోసం అతన్ని వాడుకోవాలని చూస్తారు. ఇందుకు భిన్నంగా శివయ్య న్యాయం పక్షాన నిలబడి దళితులకు, పేదలకూ మేలు చేయాలనుకుంటాడు. దాంతో భూస్వాముల కుట్రలకు బలైౖ ఉద్యోగాన్ని పోగొట్టుకుంటాడు.

సరిగ్గా దీనికి సమాంతరంగా భూస్వాముల నుంచి స్వాధీనం చేసుకున్న మిగులు భూమిని దళితులకు, పేదలకు పంపిణీ చేస్తామన్న ప్రకటనతో కథ మొదలవుతుంది. ఆ భూమిని పేదల నుంచి వెనక్కి తీసుకుని తిరిగి భూస్వామికి అప్పచెబుతామన్న ప్రకటన వేయమంటాడు నారాయణప్పని. నారాయణప్ప వేసిన ప్రకటన (దండోర) తిరుగుబాటును సూచిస్తుంది. "మహాజనులారా! మీకు తెలిపేదేమిటంటే శివలింగం (సీలింగ్) కింద గవుర్నమెంటోళ్లు తీసుకుని పేదలకు పంచిపెట్టిండే భూమిని తిరిగి శంకరప్ప గొంచికానికే గవుర్నమెంటోళ్లు స్వాధీనం చేసినారనీ ఉత్తర్వులు ఇచ్చినారు. ఆ భూమిని పొందే పేదోళ్లంతా కలసి దాన్ని బేఖాతరు చేయండహో" అని ఊరూవాడా దండోరా వేసి చెబుతాడు.

ఈ రెండు సమాంతర ప్రారంభాలకీ.. ముగింపులకీ మధ్య 1990నాటి తొలి రోజుల నుంచీ అయిదారేళ్లపాటు, తెలుగు నాట జరిగిన ఘటనలన్నింటి ప్రతిధ్వనులూ ఉంటాయి. నవలలో చదువు పట్ల దళితుల్లో వ్యక్తమయ్యే ఆకాంక్షలూ, భూసంస్కరణల బాగోతం, భూమిలేనివారిలో భూమిని పొందాలనే తపన, భూస్వామ్య నీతి, రెవిన్యూ అవినీతి, దళితుల్లో సంఘటిత చైతన్యం కల్పించే ఆత్మవిశ్వాసం.. ఇటు తెలుగు సమాజంలోనూ, అటు సాహిత్యంలోనూ వికసించిన ప్రజాస్వామిక, ప్రగతిశీల ఆలోచనలూ, నవయవ్వన ప్రేమస్వప్నాల వంటి అనేక అంశాలు, చారిత్రక విషయాలు కూడా నవలలో చిత్రణకు వస్తాయి. ఇది ఉద్యమాల నేపథ్యంలో వచ్చిన తొలి దళితనవలగా అందరి ప్రశంసలు పొందింది.

సేకరణ: పార్థసారథి చిరువోలు



# చతుర ప్రవేశిక



## అక్టోబరు- 09

అక్టోబరు 'చతుర' చదివారా? అయితే ఈ ప్రశ్నలకు ఒకేఒక్క మాటలో జవాబు రాయగలరేమో ప్రయత్నించండి. ఎక్కువమంది సరైన సమాధానాలు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. సూర్యహా బామ్మ?
2. శిల్ప తండ్రి?
3. క్రిష్ణను మ్యారేజ్ బ్యూరోకు తీసుకెళ్లింది ఎవరు?
4. క్రిష్ణ కుటుంబాన్ని పెళ్లి చూపులకు తీసుకెళ్లింది?
5. మేరీ బార్టన్ నవలా రచయిత్రి?
6. భవిష్యత్తులో 'కమ్యూనిటీ కిచెన్స్' వస్తాయని చెప్పిన రచయిత?
7. రాంధారీసింహ్ దినకర్ ఏ రచనకు జ్ఞానపీఠం లభించింది?
8. పంచమం నవలా రచయిత?
9. లై డిటెక్టర్ టెస్టుకు తొలిసారి నిలబడాల్సి వచ్చిందెవరు?
10. తేనె ప్రవాహం అసలు పేరు?

---

పంపినవారి పేరు: ------------------------------ వయసు (   )

చిరునామా: ------------------------------------------

------------------------------------------------------

పిన్‌కోడ్:                                ఫోన్ నెం:

ప్రవేశికలు పంపాల్సిన చిరునామా : సంపాదకుడు, చతుర,
ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

ప్రవేశికలకు చివరి తేదీ 19

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

నోట్ : చతుర ప్రవేశిక, విపుల వినోదిని ఒకే కవరులో పంపవచ్చు.

Owned, Printed, Published and Edited by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, D.No.7-134/1&2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally-500 072, Ranga Reddy District. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28232390; Bangalore:25583804. & www.eenadu.net.

ఈ సుత్తులు, లిప్‌స్టిక్కులు,
కూరగాయలు.. ఏమిటిదంతా అని
కంగాళీ కాకండి.
ఎంచక్కా ఇవన్నీ మనం రాసుకునే
కలాలే నండీ బాబూ!
ఏంటి నమ్మకం లేదా..
నిశితంగా పరిశీలిస్తే
నిజం మీకే అర్థం అవుతుంది.







## వారెవ్వా!






CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. HD/965/2009-2011 RNI/32186/78